దగ్గు, జలుబులు నీర్సమును కలిగిస్తాయి — యితర వ్యాధులకు దారితీస్తాయి

# బలము మరియు ఆరోగ్యమునకు వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి

దగ్గు, జలుబులలో రోగ నిరోధక శక్తిని గోల్పోతారు. మీరు నీర్సముగా, వుంటారు. అటువంటప్పుడు మీకు యితర వ్యాధులు సోకే అవకాశ ముంటుంది. గనుక వాటర్‌బరీస్ కాంపౌండ్ క్రమంగా త్రాగండి. దీనిలోగల ఓషధులు ఆకలిని వృద్ధి పరుస్తాయి. కోల్పోయిన శక్తిని తిరిగి చేకూరుస్తాయి యితర వ్యాధులు కలగకుండా రోగ నిరోధక శక్తిని యిస్తాయి. దీనిలో చేర్చబడిన 'క్రియోసోట్' మరియు 'గయోకోల్' దగ్గు, జలుబులనుండి ఉపశమనము కలిగిస్తాయి.




**వాటర్‌బరీస్ కాంపౌండ్ — అత్యంత సమ్మతమైన టానిక్**

వార్నర్-హిందుస్తాన్ లిమిటెడ్

WH 80/5 TL

# పాండ్స్ ఫేస్ పౌడర్‌తో వనితల ముఖము గంటల కొలది మనోహరమైన వర్ఛస్సుతో వుంటుంది

## అందు వలననే చాలమంది స్త్రీలు ఏ యితర పౌడర్ కంటే పాండ్స్ ఫేస్ పౌడర్‌నే వాడుతున్నారు

పాండ్స్ ఫేస్ పౌడర్, దాని ప్రత్యేక ఫార్ములా వలన యితర ఫేస్ పౌడర్ల కన్నా చాలాసేపు చర్మము మీద నిలిచి వుంటుంది. అతి మెత్తటి పాండ్స్ ఫేస్ పౌడర్ చర్మము మీద సునాయాసంగా సరిసమానంగా అంటి మీ ముఖమునకు మెరుగులు దిద్దుతుంది.



పాండ్స్ ఫేస్ పౌడర్ దక్కని రంగులలో లభిస్తుంది: నేచురల్, రాషెల్, గోల్డెన్ రాషెల్, పీచ్, సన్ ట్యాన్, బ్రాంజ్, హానీ గ్లో మరియు తెలుపు. అది అనువైన మూడు సైజులలో లభిస్తుంది — చిన్నది, మధ్య సైజు, పెద్దది.

**పాండ్స్ ఫేస్ పౌడర్—ప్రపంచమంతటా అందకత్తెలు వాడే ఫేస్ పౌడర్!**

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమిత బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

# ఉత్తరాలు

### కథలు

31—1—69 పత్రికలో మీరు ప్రచురించిన 'ఊరు నూటుకుంది' కథ చాలా బాగుంది. రచయిత శ్రీ తేళ్ళపల్లి లక్ష్మీనారాయణ శర్మగారికి నా అభినందనలు. శర్మగారు ఎంతో అనుభవం పొంది చాలా చక్కగా రాసారీ కథ. శాస్త్రాచారి యొక్క పాత్ర బాగా వుంది. పిడుగు గొప్పవారి దృష్టిలో రక్తమాంసాలున్న ప్రతిమ తప్ప మనిషిగా చూడరు. కృష్ణమాచారికి జరిగిన అన్యాయానికి నా కళ్ళు కన్నీటితో నిండినాయి. గాయత్రిలాంటి సౌందర్యవతి పేదల్లో జన్మించి తన గొప్పతనాన్ని వెల్లడించి స్త్రీజాతికి గర్వం కల్గించినట్లు శర్మగారు చాలా అమోఘంగా ఆమె పాత్ర సృష్టించారు.

యువటూరి సీతాలత (ఏలేటిపాడు)

*　　*　　*

31.1.69 పత్రికలో ప్రచురించిన 'ఊరు నూరుకుంది" కథ గుండెల్లో దాగివున్న నీళ్లను కళ్లలోకి వచ్చేటట్టు చేసింది. గాయత్రిపాత్ర, కృష్ణమాచారి పాత్రలు నా హృదయంలో స్థానం సంపాయించుకున్నాయి.

—అయితాపుల్లేశ్వరరావు (మూలూరుపేట)

*　　*　　*

నా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక (24—1—69)లో ప్రచురించిన "నీరు పల్లమెరుగు" కథ చాల వాస్తవంగా, సహజంగావుంది యీ కథ చాల నిజంగా జరిగిన కథే, అందుకు సందేహములేదు. అన్న అభిప్రాయం చదువరులకు తప్పకుండా కలుగుతుంది.

—దుర్గాప్రసాద్ పట్నాయక్ (రాయగడ)

### సీరియల్

ఈ వారం 31—1—69 సంచికలో మీరు ప్రచురించిన సీరియల్ "అడకత్తెరలో—మనిషి"లో రచయిత్రి ఒక పొరపాటు వ్యక్తపరచింది. కథలో గోవింద అను అనుభవము గల లేడీడాక్టరుగా మనకు పరిచయము చేయబడెను. 37పేజీ మూడవ కాలం వలన మనకు ఆమెకు ఇరవై యేళ్ళు వుండునని తెలియుచున్నది. కాని డాక్టరు కోర్సు పూర్తి చేయుటకు కనీసం ఇరువది రెండు సంవత్సరములు పట్టును. పదహారు సంవత్సరములు నిండనిదే మెడిసిన్‌లో సీటు యివ్వరు. అంతేగాక ఆమెకు అనుభవము వున్నట్లు కూడ తెలియుచున్నది. అందుచేత ఆమెకు ఇరవై యేళ్ళు వుండునని రచయిత్రి వ్యక్తపరచుట అసహజముగానున్నది.

బోణం హేమ వెంకటామయ్య (రాజమండ్రి)

*　　*　　*

క్రొత్త సీరియల్ 'అడకత్తెరలో మనిషి' ప్రారంభం ఉత్కంఠ కల్గించేదిగానే వుందనిపిస్తోంది.

31—1—69 పత్రికలో 'గాలివాన' 'ఊరు నూరుకుంది' కథలు బాగున్నాయి.

—కె. కమల (విశాఖపట్నం)

### న్యూఢిల్లీ లేఖ

(7—2—1969 తేదీ ఆంధ్ర సచిత్రవార పత్రికలో పడిన శ్రీ పి. జానకిరామయ్య, రాంచీ, ఉత్తరానికి శ్రీకృష్ణ పంపిన సమాధానం ఈ క్రింద వేస్తున్నాము —సం.)

'నాలేఖలోగాని, అనువాదంలోగాని పొరపాటు జరిగి ఉండవచ్చు., ఎందుకంటే, ఈ సమస్యకి రెండు ప్రత్యేక మయిన విభిన్నమయిన రూపాలు ఉన్నాయి—అవి డిజయిన్లకి; నిర్మాణానికి సంబంధించినవి. రాంచీలోని భారీ యంత్ర కర్మాగారంలోని డిజయిన్ల సౌకర్యాలని గురించి నాకుతెలియదు కాని, రాంచీలో హిందూస్తాన్ స్టీల్‌కి ఒక డిజయినింగ్ బ్యూరో ఉందని నాకు తెలుసు. ఇది డిజయిన్లని చేసింది. చేస్తూ ఉంది. మొదట్లో ఇది బ్రిటిషు వారికి సంబంధించిన సంస్థ. అయితే. ఇప్పుడు దీనికి రష్యన్లు, అమెరికన్లు కూడా సహాయం చేస్తున్నారు.

'ఇంతకీ నేను చెప్పినదేమిటంటే, భారీయంత్ర కర్మాగారం దుర్గాపూర్, రూర్కెలా, ఇంకా ప్రయివేటు రంగం ఉక్కుమిల్లులకి సామగ్రి సప్లయి చెయ్యలేదు, అని. దీనికి కారణం లేకపోలేదు. భారీయంత్రకర్మాగారం తయారు చేసే సామగ్రి రష్యాలో చెలామణీ అవుతున్న ప్రమాణాలని అనుసరించి ఉంటుంది. ఇవి అంతర్జాతీయంగా చెలామణీ అవుతున్నవికావు. నేను అన్నదానిని ప్రపంచ బాంకు నివేదిక బలపరుస్తున్నది. అంతేకాక, రాంచీలో ఉక్కుమిల్లుల సామగ్రి తయారుచేయ గలిగిన భారీ యంత్రకర్మాగారం ఉన్నప్పటికీ ప్రయివేటు రంగంలోని ఉక్కుమిల్లులకీ, దుర్గాపూరు, రూర్కెలా ఉక్కుమిల్లులకీ సామగ్రీ, స్పేర్ పార్టులూ ఇంకా అమెరికా, జర్మనీ, బ్రిటన్ నుంచే దిగుమతి అవుతున్నాయి.

"సామగ్రి డిజయిన్ల, ఉత్పత్తి విషయంలో ఏదయినా పొరపాటు దొర్లితే దానికి చింతిస్తున్నాను. ....

—శ్రీ కృష్ణ

### వ్యాసాలు

ఈ వారం 31—1—69 పత్రికలోని 'తానొకటి తలుస్తే' (నిర్మలామోహనరావు) వ్యాసంలాంటి వ్యాసాలు మన ఆంధ్ర (అమ్మమ్మ) వనితలకై ఇంకా ఇంకా వేయండి.

'కాన్వెంటు చదువులే క్రమబద్ధమైనవి! (ఇందుమతి పట్నాయక్) అన్నునిజమే. కాదని ఎవరన్నారు. కాని వ్యాసరచయిత్రి చెప్పినట్లు కాకాహోటల్లో 'చా' పది పైసలు, అదే 'చా' రెస్టోరెంటులో, యాభై పైసలు అది నిజమే. మరి, మనదేశంలో పది పైసల టీకి కూడ నోచుకోని వారు ఎంత మందో? "కాన్వెంటు" పద్ధతులలో చదువు చెప్పే పాఠశాలలు ప్రతి తాలూకాకు ఒకటి చొప్పున వెలువడిన నాడు అది ప్రభుత్వం దయ్యలో

విస్మయజనక విజయము

# నేషనల్ ఎక్కో

# సిలికోన్ 321

ఘనస్థితి సాంకేతిక పరిజ్ఞానములో ఉచ్ఛస్థాయి నందుకున్న నవీన 2-బ్యాండ్ల సెట్టు




విశిష్టమైన సదుపాయములు.

* నేషనల్ ఎక్కో సిలికోన 321 మిక్కిలి నవీనమైన లాక్‌ఫిట్ ఇపోక్సి, సిలికోన్ ప్లేనార్ ట్రాన్సిస్టర్లను ఉపయోగించుచున్నారు
* ఇది ఇటువంటి వాటిలో అత్యంత తక్కువ ఖర్చును కలిగించే సెట్, ఎందుచేతననగా లో బ్యాటరీ డ్రెయిన్ అమరిక గలదు.
* 500 mW కు మించిన కంఠధ్వని శక్తి ప్రసారంగలది లో బ్యాటరీ డ్రెయిన్‌తో గూడిన సాటిలేని లక్షణం.
* స్పష్టమైన శబ్దగ్రహణం, తగ్గు ధ్వని లెవెల్, మరియు విశిష్ట ఫ్రీక్వెన్సీ రెస్పాన్సు నిస్తుంది.
* ఇది నమ్మకమైనది—ఎక్కువ కాలము నిరాటంకంగా విశ్వసనీయంగా పనిచేయునట్లు నిర్మించబడింది.

ధర. రూ. 235
(ఎక్సైజ్ పన్ను సహా, పన్నులు అదనం)

**GRA** జనరల్ రేడియో అండ్ అప్లైయన్సస్

ఎ డివిషన్ ఆఫ్ ది నేషనల్ ఎక్కో రేడియో అండ్ ఇంజినీరింగ్ కం. లి.,
బొంబాయి - కలకత్తా - మద్రాస్ - ఢిల్లీ - బెంగుళూరు - సికింద్రాబాద్ - పాట్నా - ఎర్నాకుళమ్.

## పనిచేయుటలో నేషనల్ ఎక్కో సిలికోన్ 321కు వేరే సాటి లేదు.

జరిగి; కాకా హోటల్ లాంటి వెలకే రెస్టారెంట్ 'టీ' లభించిన నాడు అందరు వృద్ధికి వస్తారు. (విద్యార్థులు).

ఎ. వి. స్వామి, (కరీంనగర్)

*   *   *

పల్లెటూళ్ళలో పాఠశాలలను (సింగిల్ టీచర్ స్కూల్స్) విమర్శించారు. అది నిజమే. కాని అంత పల్లెటూళ్ళలో కాన్వెంటులు ఎక్కడ ఉన్నాయి? యిక విద్యాబోధనలో పాఠశాలలను కాకా హోటల్స్ గాను కాన్వెంటును రెస్టారెంట్‌గాను పోల్చేరు. పోలికలో తక్కువతనం, పోల్చడంలో గొప్పతనం ...సుతుంది. ఇది ఒకరకంగా ప్రభుత్వాన్ని విమర్శించడమే! (అది తప్పుకాదు). అందరూ తమ ...లను ఒసేయ్ అమ్మా అని పిలవరు. అది రచయిత్రి గమనించాలి. యిక రామాయణ, భారతాలు పాఠ్యభాగాల నుంచి తొలగించి చాలా రోజుల యిందనే విషయం రచయిత్రికి తెలిసుండకపోవచ్చు. పాఠశాలలన్నీ క్రమబద్ధమైనవి కాదు అన్న ఆరోపణ పూర్తిగా అసమంజసము. కాన్వెంట్ పిల్లలు బూతులు మాట్లాడకపోవచ్చును గాని, 'బాస్టర్డ్—, రాస్కెల్' అని నాజూకైన మాటలు (మరి బూతులకి— వాటికీ భేదం నేను చెప్పక్కర్లా) వాడటం నేను చాలాసార్లు చూశాను.

వాస్తవాన్ని భూతద్దంలో చూపిన ఇందుమతి పట్నాయక్ గారు అభినందనీయులు. మతసామరస్యానికి యిది ఎంత దోహదం చేస్తుందో రచయిత్రి అంతరాత్మకు బాగా తెలుసు. భారతదేశం లాంటి బీద దేశంలో కాన్వెంటు చదువులు ఎందరికి అందని ద్రాక్ష పళ్ళో ఆవిడే చెప్పాలి.

వే. మోహనకృష్ణప్రసాద్ (వరంగల్)

*   *   *

# ఉత్తరాలు

శ్రీ ఆత్మారాం గార్కి (31.1.69 సంచిక) ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు గౌరవ 'డాక్టర్ ఆఫ్ సైన్సు' డిగ్రీని, 1968 డిశంబరు 14వ తారీఖున జరిగిన స్నాతకోత్సవములో ప్రదానము చేసి యున్నారు. కాని వ్యాసరచయిత యీవిషయాన్ని తెలుపలేదు. ఇటువంటి విజ్ఞానవేత్తల చరిత్రలు భావి విద్యార్థులకు మార్గదర్శకములు.

ఆర్. సంగమేశ్వరరావు (బొబ్బిలి)

*   *   *

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో శ్రీమతి కె. రామలక్ష్మి రాసిన సీరియల్ 'ప్రేమించు ప్రేమకై' హెర్మినా బ్లాక్ రాసిన ఇంగ్లీషు నవల 'ది ఇన్ విజిబుల్ ఫ్లేమ్'కి అనువాదం అంటూ కొందరు పాఠకులు ఉత్తరాలు రాశారు. ఆ ఉత్తరాలకు రచయిత్రి యిచ్చిన సమాధానం ఈ దిగువ యిస్తున్నాము. —సం॥

ప్రేమించు ప్రేమకై నవలపై పొగుడుతూ చాలా ఉత్తరాలు వచ్చాయి. సంతోషమే. వాటికి సమాధానం ఇవ్వవలసిన పని లేదు. ఇక తెగడుతూ వచ్చిన ఉత్తరాలని గురించి. ఏదో ఆంగ్ల నవలను పోలినట్లుందని పలువురు రాశారు. నిజమే. థీమ్‌లో పోలికలున్నాయి. ప్రేమ అంటే మోహం కాదు. ప్రేమ అన్నది ఒక్కనాటితో పెరిగే భావన కాదు. అది నెమ్మదిగా ఏర్పడే హృదయ స్పందన అన్నది నిరూపించేది ఆ థీమ్, ఇది అనువాదం కాదు కనుకా, పోలికలు పైపైనే కనుకా వివరాలు చెప్పలేదు. దాన్ని అపార్థం చేసుకుని రాసినవే ఉత్తరాలు. —రచయిత్రి




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 14—2—'69

కీలకనామ సం॥ మాఘమాసం బహుళ త్రయోదశి

సంపుటము : 61   సంచిక : 25

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1


## విషయానుక్రమణిక


భారత్-పాక్ కలహాన్ని పరిష్కరించడానికి శాంతియుత మార్గం
నన్ను ప్రజల నుంచి రక్షించు
ఆలోచనకి ఆహారం!
జాక్ వీర మరణాలని ఇందిరాగాంధి ప్రశంసించారు
మిమ్మల్నందర్నీ ఆడించగలను
నిక్సన్

# దురాక్రమణ అంటే ఏమిటి? అందరికీ ఒకటే న్యాయం కాదా?

ఇండియా, బల్గేరియా మహారాజ్యాల అధినేతలు ప్రపంచ సమస్యలని చర్చించారు ఈ వారం. ఈ రెండు రాజ్యాలకీ కొన్ని పోలికలు ఉన్నాయి. రెండూ ఒకప్పుడు మహమ్మదీయ పరిపాలనకింద ఉన్నవే. రెండిటిలోనూ మహమ్మదీయుల సంఖ్య చెప్పుకోదగ్గంత ఉంది. పోలికలు ఇంత మాత్రమే భేదాలూ ఉన్నాయి. బల్గేరియా కమ్యూనిస్టు రాజ్యం. భారతదేశం (ఇంకా) ప్రజాస్వామ్యం...

**తతంగం...**

సంయుక్త ప్రకటన అనే తతంగం జరిగింది దాని ముఖ్యాంశాలు కొన్ని—

1. అంతర్జాతీయ సంబంధ బాంధవ్యాల వ్యవహారాలలో తాము శాంతియుత సహజీవనం, ఇతరుల స్వాతంత్ర్యం, దేశ భద్రత మొదలయిన వాటిమీద ఆధారపడిన సిద్ధాంతాలని పాటిస్తామని బల్గేరియా నాయకుడూ, భారత ప్రధానీ వెల్లడించారు.

2. వియత్నాం ప్రజాస్వామ్యరాజ్యం మీద బాంబులు వెయ్యటం ఆగిపోవటం, పారిస్‌లో శాంతియుతమయిన చర్చలు కొనసాగటం, వియత్నాం సమస్య పరిష్కారానికి తోడ్పడుతున్నాయని అన్నారు. వియత్నాం ప్రజలు బయటివారి ప్రమేయంలేకుండా తమ భవిష్యత్తుని తామే నిర్ణయించుకోనగలరనే ఆశని వెలిబుచ్చారు.

3. పశ్చిమ ఆసియాలోని పరిస్థితి ప్రపంచ శాంతికే ప్రమాదకరమయినవనీ, ఈ సమస్య పరిష్కారం విషయంలో జరిగే ఆలస్యం తమకి ఆందోళన కలిగిస్తోందనీ, 22 నవంబరు 1967 లో భద్రతా మండలి చేసిన తీర్మానం ప్రకారం అన్ని పక్షాలవారూ తమ సహకారాన్ని ఇవ్వాలనీ, దురాక్రమణదారుని పొగదోలేదాకా శాంతి నెలకొల్పటం సాధ్యంకాదని తాము నమ్ముతున్నామనీ అన్నారు.

4. సామ్రాజ్యవాద వినాశనానికి బల్గేరియా, భారతదేశాలు తాము కృషి చేస్తున్నట్లూ, ప్రత్యేకంగా పోర్చుగీస్ గినియా, అంగోలా, మోజాంబిక్, జింబాబ్వే, నామిబియా ప్రజలకి తమ సానుభూతిని తెలుపుతున్నట్లూ ప్రకటించారు.

5. పాకిస్తాన్‌తో సంబంధ బాంధవ్యాలని ఎలా అభివృద్ధి చేసుకుంటున్నదీ భారత ప్రధాని వివరించారు. తాష్కెంటు ఒప్పందాన్ని అనుసరించటానికి ఏమి ప్రయత్నాలు చేస్తున్నారో చెప్పారు. బల్గేరియా నాయకుడు వీటి విషయమయి తమ ఆమోదాన్ని ప్రకటించారు భారత, పాకిస్తాన్‌లు తమ విరోధాలని వదులుకుంటారనే ఆశని వెలిబుచ్చారు.

6. బల్గేరియా నాయకుడు తమ దేశం బాల్కన్ ప్రాంతంలో శాంతి, సహకారాల కోసం చేస్తున్న కృషిని వివరించాడు.

**మనవి—ఆమోదం**

భారతదేశం ప్రధానమంత్రి ఒక బాల్కన్ నాయకునికి తమ పాకిస్తాన్—విధానం గురించి మనవి చేసుకుని, నచ్చచెప్తే ఆ నాయకుడు తమ ఆమోదాన్ని తెలియ చేశారన్న మాట.

ఇతర దేశాల స్వతంత్రానికి హాని కలిగించే పనులేవీ ఎవరూ చెయ్యరాదని ఈ నాయకులు సెలవు ఇచ్చారు. దురాక్రమణకు తన ప్రవర్తనద్వారా ప్రతిఫలం దక్కకుండా ఉండేట్లు చూడాలన్నారు.

**చెకోస్లొవాకియా మాట?**

ఈ పెద్ద నాయకులు ఇద్దరూ చెకోస్లొవాకియా మాటఎత్తలేదు. ఈ దేశంమీద 1968 లో రష్యా దాడిచేసింది. బల్గేరియా ఈ దాడికి తోడ్పడిన దాస్యదేశాలలో ఒకటి. కాని, భారతదేశం ఎవరికీ లొంగి ఉన్న దేశంకాదే? ఇతరదేశాలలో కలగచేసుకునే వారందరినీ ఖండించే ప్రకటన భారతదేశం ఎలాచెయ్యకలదు? చేస్తే రష్యాని ఖండించినట్లేగదా? చెకోస్లొవాకియాపట్ల దురాక్రమణ చేసిన రష్యాకి ఏదో ప్రతిఫలం దక్కి ఉంటుంది. ఈ ప్రతిఫలం గురించి భారత, బల్గేరియాదేశాలు చెయ్యబోతున్నది ఏమిటి?

రష్యా చెకోస్లొవాకియామీద దాడచేసింది. ఆ దేశాన్ని రెండుగా విభజించటం ప్రారంభించింది, ఆ దేశంయొక్క ఆర్థిక వ్యవస్థ తనకి అనుకూలంగా ఉండేవిధంగా ఉంచుకుంటున్నది. అక్కడ సమాచార ప్రచారాలమీద సెన్సారు నిబంధనలని విధించింది. ఇదంతా సామ్రాజ్యవాదుల నడవడి కాకపోతే మరేమిటి? మాటల అర్థాలే మారిపోయాయా?

'పేచీ ఏమీలేదు. పరిస్థితి పూర్తిగా చేతికింద ఉంది. ఇప్పటికి 15 కోట్ల రూబుల్స్ వ్యాపారం ఒప్పందాలు చేసుకున్నాము. ఇది పోయిన ఏటికన్నా అధికం. ఇంకా మూడు రోజులు ఉన్నాయి!' అన్నాడు బ్రునో ప్రదర్శనలో ఒక రష్యన్ నాతో. (ఇది సెప్టెంబర్ 15–24 మధ్య జరిగింది.)

**సాధారణ పరిస్థితి ఏమిటి?**

'అంతా చేతికిందే ఉంది, నిజమే!' అన్నాడు ఒక యుగోస్లావ్ ప్రతినిధి. 'కాని, ఇది సాధారణ పరిస్థితికాదు—మీ ఇంట్లోకి ఎవరయినా చొరబడి, మీ కుమార్తెని బలాత్కరించి, మీ పడకగదిలో విశ్రాంతి తీసుకుంటూఉంటే పరిస్థితి సాధారణమయినదే అంటారా?'

బ్రునో ప్రదర్శన చెక్ యంత్ర పరిశ్రమని చాటే ప్రదర్శన. ఇది బ్రునోకి 10 వ ప్రదర్శన. అసలు అది నడవటమే పెద్దవింత. ఎంతో కష్టపడి చెక్ అధికారులు దానిని నిర్వహించారు. వీనిద్వారా రష్యాకి చెక్ పారిశ్రామిక నైపుణ్యం ఎంత

అవసరమో తెలిపారు. చెకోస్లొవాకియాని ఆటగదొక్కితే బంగారుగుడ్లబాతుని చంపి వేస్తేలని చెప్పటానికి ప్రయత్నించా......

రష్యా జెండాలు లేవు

ఈ ప్రదర్శనలో సోవియట్ సామగ్రి ప్రదర్శనే అధికంగా ఉండటంలో ఆశ్చర్యం లేదు. మోటారుట్రక్కులు, వ్యవసాయ యంత్రసామగ్రి, మెషిన్‌టూల్‌లు, ఇతర యంత్రాలు బాగా విరివిగా ప్రదర్శించారు. అయితే అంతకి ముందులాగ సోవియట్ పతాకాలు అంతగా ఎగరలేదు. ఎక్కడ చూసినా చెక్ జెండాలే కనిపించాయి.

తూర్పు జర్మనీ వారు చాలామంది వచ్చారు. వారి జెండాలు బాగా కనిపించాయి. అక్కడికి వచ్చిన అన్ని యంత్రాలలో ఎత్తు అయిన దానికి బహుమతి పెట్టారు. ఈ పోటీ రుమేనియా, తూర్పు జర్మనీలమధ్య వచ్చింది!

బల్గేరియన్ల ప్రముఖ పాత్ర

రష్యన్ల తర్వాత చెకోస్లొవాకియాలో చివరు అందరి అయిష్టానికి గురి అయిన వారు అంటే, వారు బల్గేరియన్‌లే. దీనికి కారణం లేక పోలేదు. ప్రాగ్‌లో సాధారణంగా తూర్పు జర్మన్, హంగేరియన్ లేక పోలిష్ సోల్జరు కనిపించడు. రష్యన్లు, బల్గేరియన్లు ఎందరో కనిపిస్తారు. చెక్ సంస్కరణాలని ఎదిరించిన వారిలో వీరు ప్రముఖులు. (ఆక్రమిన దేశాల సైనికులు దేశం ఎల్లలదగ్గర ఎక్కువగా ఉన్నారుట.)

బల్గేరియన్ ప్రదర్శనపట్ల జనం అంత ఉత్సాహం చూపించలేదంటే ఆశ్చర్యం లేదు.

తుపాకులే ఏలుతున్నాయి...

'రాత్రివేళల్లో సోవియట్ మెషిన్ తుపాకులు మమ్మల్ని ఏలుతున్నాయి.' అన్నాడు. మా చెక్ స్నేహితుడు ఒకాయన. 'అప్పుడప్పుడు కాల్పులు వినిపిస్తాయి. కొందరు ప్రావ్దా పత్రికలని, తూర్పు జర్మనీలు అచ్చుఅయ్యే 'న్‌ప్రావా' అనే చెక్ పత్రికలని వంచిపెడ్తారు. దారినపోయే వారిని ఆపుతూఉంటారు. ఒకప్పుడు పాఠశాలగా ఉపయోగపడ్డ పెద్ద కట్టడంలో ఇప్పుడు సైనికులు ఉంటున్నారు...''

(14 వ పేజీ చూడండి)

ఆటలు

# ఎవరిది తప్పు?

జనవరి 29 నాడు ఎడెలెయిడ్‌లో ఆస్ట్రేలియా, వెస్ట్ ఇండీస్ మధ్య టెస్టు పోటీ 'డ్రా' తో ముగిసింది. ముగింపు విచిత్రంగా జరిగింది. ఇంకా 21 పరుగులుచేస్తేచాలు ఆస్ట్రేలియన్‌లకి., కాని,ఒకే ఒక వికెట్టు మిగిలింది! వెస్ట్ఇండీస్ ఆవికెట్టుని పడగొట్టాలి.

ఆస్ట్రేలియా 3 వికెట్లకి 214 చేసింది. పరిస్థితి బాగా ఉందనుకుంటూ ఉంటే 339 కి 9 వికెట్లు పడిపోయాయి. (1961 బ్రిస్‌బేన్ టెస్టులో వెస్ట్ ఇండీస్, ఆస్ట్రేలియన్లు సమానమయిన పరుగుల మొత్తాలతో డ్రా చేశారు.)

ఈ టెస్టులో ఆస్ట్రేలియన్లు వెస్ట్ ఇండీస్‌ని 271 పరుగులకి అవుట్‌చేసేశారు. సోబర్స్ గనక 110 వెయ్యకపోతే ఈమొత్తం కూడా వచ్చేదికాదు. ఆస్ట్రేలియా తరుపు వాల్టర్స్ నూరు పరుగుల పయిన వెయ్యటంతో ఆదేశానికి పెద్ద మొత్తం వచ్చింది! చాపెల్‌కూడామంచి స్కోర్ చేశాడు. (వెస్ట్ ఇండీస్ మీదఆడి 1000 పరుగులు పూర్తి చేశాడు.)లవురీ, స్టాక్‌పోల్‌ల పేర్లుకూడా చెప్పుకోవాలి. కాని, వెస్ట్ ఇండీస్ వారు చాలా బాగా ఆడి 616 పరుగులు చేసేశారు. బుచ్చెర్ 100 పరుగులు చేశాడు., కన్హాయి 80, కారా 90, సోబర్స్ 52 చేశారు.

ఆస్ట్రేలియన్లు తర్వాత ఆడినప్పుడు సరదాగా పరుగులు వెయ్యటానికి ప్రయత్నించారు. ముందు బాగా ఆడినా నలుగురు బాట్స్‌మన్ 'రన్‌అవుట్' కావటంతో 9 వికెట్లు పడిపోయాయి. మాచ్ డ్రా అయింది......

ఈమాచ్‌లో ఒక సంఘటన జరిగింది., గ్రిఫిత్ చాపెల్‌కి బవుల్ చేస్తున్నాడు. అవతలవయిపు రెడ్‌పాత్ అప్పటికే క్రీజ్ గీతదాటి వచ్చేశాడు. గ్రిఫిత్ వెంటనే అతని స్టంపులు పడగొట్టేశాడు. అంపయిర్ తడుముకోకుండా 'అవుట్'అన్నాడు! సోబర్స్ మంచి ఆటగాడు కాబట్టి ఈసంఘటన జరిగినందుకు ఆస్ట్రేలియాకాప్టెన్‌ని క్షమాపణ కోరుకున్నాడు. ఈ పని అతను చేసి ఉండనక్కరలేదు. గ్రిఫిత్ చేసిన దాంట్లో తప్పు ఏమీ లేదు.బంతి బవులర్ చేతిని వదిలే ముందరే అతని వయిపు బాట్స్‌మన్ ముందుకు వెళ్ళటం తప్పు. ముందు హెచ్చరించి చూసి తర్వాత అవుట్ చెయ్య నివ్వాలి అని కొందరు అంటారు. కాని బవులర్ ఎన్ని సంగతులని పట్టించుకుంటాడు? అతని కర్తవ్యం తన జట్టు శ్రేయస్సు కోసం న్యాయ బద్ధంగా కృషి చెయ్యటమే కదా?

ఈసందర్భంలో రెండు దశాబ్దాల ముందు జరిగిన సంఘటన ఒకదానిని గురించి చెప్తాను. మన్కాడ్ బ్రౌన్‌అనే ఆస్ట్రేలియా తరుపు ఓపెనింగ్ ఆటగాడిని ఒకసారి హెచ్చరించి మరీ ఈవిధంగా అవుట్ చేశాడు. కామెంటేటర్ అతని చర్యని హర్షించాడు. ఇంకా వదేళ్ళక్రితం ధనకోటి అనే ఆటగాడు ఒక బాట్స్‌మన్‌ని ఇలాగ అవుట్ చేసినప్పుడు అందరూ అతన్ని తెగ మెచ్చుకున్నారు.

ముందు హెచ్చరించ గలిగితే మంచిదే కాని బాట్స్‌మన్ కూడా క్రమబద్ధంగా ప్రవర్తించాలి!

—కె. ఎస్. నరసింహన్



ఎడింబరోలో 1970 లో జరిగే కామన్‌వెల్తు ఆటల పోటీలకోసం నిర్మిస్తున్న స్టేడియం. రూపాన్ని దిద్దుకుంటున్న ఆట స్థలాన్ని చిత్రంలో చూడవచ్చు.

# శ్రీ అన్నాదురై అస్తమయం



**తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ సి. ఎన్. అన్నాదురై కొంత కాలంగా అనారోగ్యంగా ఉండి సోమవారం ఫిబ్రవరి 3 వ తేదీన స్పృహతప్పి ఉండగానే మరణించారు. వీరి వయస్సు 60.**

కాంగ్రెసు ప్రతిపక్షమయిన ద్రావిడ మున్నేట్రకజగమ్ నాయకులుగా ముఖ్యమంత్రి అయిన శ్రీ అన్నాదురై అన్నివర్గాల వారి గౌరవాభిమానాలనిచూరగొన్నారు. అఖిలభారత స్థాయికల నాయకులుగా నిరూపించుకున్నారు. వారి మరణం తమిళనాడుకేకాక మొత్తం భారతదేశానికే తీరనిలోటు.

జనవరి 29 వ తేదీన పగలు 11—25 గంటలకు వున్నట్టుండి మద్రాసు వులిక్కిపడింది. ఎక్కడనుంచో, 'అణ్ణాదురై మరణం అడైన్దార్' అన్న ముక్క గాలిలో వచ్చింది. 'అన్నాదురై చనిపోయారా !' 'ఇజ్ అన్నాదురై డెడ్' అన్న ప్రశ్నలు పుట్టాయి. ఒక్క అరగంటలో యీ వార్త కారుచిచ్చులా మద్రాసంతా వ్యాపించింది. కొన్ని స్కూళ్ళు, కాలేజీలు, ఆఫీసులు, హోటళ్ళు, దుకాణాలూ, తక్షణ మూసేశారు. జనం అడయారులోని కాన్సరు ఆసుపత్రివేపు ధారగా ప్రవహించారు. టెలిఫోనులు ఆసుపత్రి నెంబరుకోసం, పి.టి.ఐ. నెంబరుకోసం గిరగిర తిరిగాయి. 'ఇజిట్ ట్రూ' అన్నది ప్రశ్నగానే మిగిలింది.

'ఒరింజర్ అణ్ణా నన్రాఘ ఇరిక్కిరార్— అణ్ణాదురై ఆరోగ్యంగానే వున్నారు. ప్రజలారా భయపడకండి. గాభరా పడకండి' అని పోలీసు వ్యానులనుండి ప్రకటనలు చేశారు. అప్పటికి నమ్మకలేనిజనం అడయారు ఆసుపత్రి అధికారుల వార్త విని హమ్మయ్య అనుకున్నారు.

ఆ రోజునుంచి మృత్యువుతో భయంకరంగా పోట్లాడి ఫిబ్రవరి రెండో తేదీ అర్ధరాత్రి 12—22 కు మద్రాసు ముఖ్యమంత్రి, ద్రవిడ మున్నేట్రకజగం పార్టీ నాయకుడూ అయిన శ్రీ అణ్ణాదురై చనిపోయారు. 12–30 కల్లా మద్రాసంతా పట్టపగల్లై పోయింది. కొన్ని లక్షల మంది కాన్సరు ఆసుపత్రికి పరుగులు పెట్టారు.

చరిత్రలో ఏ నాయకునికీ జరగనంత వైద్య సదుపాయం అన్నాదురైకు జరిగింది. ఆయన ఆరోగ్యనిధికివసూలు చేసిన పద్ధానుగు లక్షలలో ఐదులక్షలు ఖర్చయిందట. అమెరికా నుంచి డాక్టర్ మిల్లర్, డాక్టర్ ఎనేసకిలు వచ్చారు. హాంకాంగ్‌కి కొలంబోకు ప్రత్యేక విమానాలు వెళ్ళి మందులు తెచ్చాయి. కలకత్తా ఢిల్లీ బొంబాయి మద్రాసు మధ్య విమానాలు మందులతో తిరిగాయి. అత్యధిక రేడియో ధార్మికశక్తి కల ఇరిడియం సీడ్స్ ఆయన ఎబ్డామిన్‌లో గుచ్చారట. ఈ సీడ్స్ కాన్సర్ అధికం కాకుండా రేడియోధార్మిక శక్తితో అరికట్టాయట. కానీ విధి బలీయమైనది.

తెల్లారితే మూడో తారీఖు. ఇంకా తెల్లవారనే లేదు. మద్రాసు రాష్ట్ర ప్రజ అంతా మద్రాసులోనే వుంది. ఆడ, మగా, పిన్నా పెద్దా అంతా 'అణ్ణా మమ్మల్ని వదలిపోయావా' అని గుండెలు బాదుకుని విలపించ సాగారు. ఆయన భౌతిక దేహాన్ని రాజాజీ హాలులోకి తెచ్చిపెట్టిన వైనం తెలుసుకుని ఆడ, మగా తేడా లేకుండా పైపు గొట్టాలు పుచ్చుకుని పైకి ఎగబ్రాకి లోపలకు దూకారు. జన ప్రవాహాన్ని అరికట్టడానికి పోలీసు భాష్పవాయు ప్రయోగం, కాల్పులూ కూడా జరిపారు. చివరికి ఆయన దేహాన్ని రాజాజీహాలు మెట్లమీద కూర్చోపెట్టారు—అంతా చూడ్డానికి వీలుగా.

ఆయన భౌతిక దేహాన్ని చూడవచ్చిన మద్రాసు గవర్నర్ సర్దార్ ఉజ్జల్‌సింగ్, ఆయన భార్య రాజాజీ హాలులోకి వెళ్ళడానికి విశ్వప్రయత్నం చేసి, కుదరక వెనుదిరిగి పోయారు. వి. ఐ. పీల దారులుకూడా జనంతో మూసుకుపోయాయి. లోపలికువెళ్ళి ఆయన దేహంమీద పుష్పగుచ్ఛం వుంచాలని వచ్చిన శ్రీ కామరాజ్ లోపలకు వెళ్ళలేక, 'ముడియాదప్పా' అని వెనక్కు తిరగబోయేసరికి ఆయన్ను చూసిన జనం 'సింగ ఉళ్ళ

(చివరి పేజీ చూడండి)




## క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు: అనువాదం: తిరుమల రామచంద్ర

నరవాహన దత్తుడు పెరుగుతూ వున్నాడు; తల్లులిద్దరికీ అమృతనిర్ఝరం లాగ, తండ్రి మనోరథాలతోపాటు పెరుగుతున్నాడు.

కళింగసేన కుమార్తె మదనమంచుకను తమ అంతఃపురంలోనే పెంచుదామని వాసవదత్తకు తలంపు కలిగింది. కళింగసేనకు ఈ సంగతి తెలిపింది. కళింగసేన చాలా ఆనందించింది. తన ప్రియకుమార్తెను వాసవదత్త కోరిక ప్రకారం వాసవదత్త అంతఃపురానికి పంపివేసింది. నరవాహన దత్తుడింకా బాలుడు. - అయినా మదన మంచుకను చూచి అమృతపుజల్లులాడి పట్టు హర్షించాడు. కామపు మొలకవంటి ఆ మదనమంచుక దాది ఒడిలోవున్నా, రాజకుమారుణ్ని ఒక ముహూర్తమయినా వదలివుండేదికాదు.

నరవాహనదత్తుడు ఇలా నిండుచంద్రురుని లాగ సంపూర్ణవిగ్రహుడయ్యాడు. అతనిని యువరాజు చేయడం ఉచితమని భావించాడు వత్సరాజు. ఒక శుభముహూర్తంలో అతనికి యౌవరాజ్య పట్టాభిషేకం చేశాడు. ఆ వుత్సవానికి సామంత, మంత్రి, మంత్రి పుత్రాదులు పలువురు వచ్చారు.

వత్సరాజు ఆ సమయంలో మంత్రి పుత్రులను చూచి 'కుమారులారా మీరు నరవాహన దత్తునికి మొదటి భృత్యులు. మీ పితృ పితామహాదులు మమ్మలను కొలుస్తూ వచ్చారు. ఇప్పుడు మిమ్మలను ఆ స్థానంలో నా కుమారునికి నియమించాను. మీరు అతనికి మీ పితృపితామహపదవీ క్రమంగా సేవ చేయండి' అంటూ తన పుత్రునికి మంత్రి కుమారులను దత్తం చేశాడు. ఈ విధంగా యౌగంధరాయణుని కుమారుడు, మహామతి అయిన మరుభూతి, వసంతకుని కుమారుడు, నర్మవాక్య నిపుణుడు సుమంత్రకుడు, వీరుడయిన హరిశిఖుడు, గోముఖుడు మొదలయిన వారు నరవాహన దత్తునికి సహచరులు, అనుచరులు అయ్యారు.

ఒకమారు కళింగసేనకు తననెచ్చె సోమప్రభను చూడాలని బుద్ధిపుట్టి ఆమెను స్మరించింది. మయసుత అయిన సోమప్రభ తన భర్త నలకూబరుని అనుమతిపొంది కళింగసేనవద్దకు వచ్చింది. కళింగసేన తన కుమార్తె వివాహం విషయమై సోమప్రభతో ఆలోచించింది. ఆమె మదనమంచుక పరిణయోత్సవానికి నలకూబరుని ఆదేశంతో గగనమార్గంలో వెళ్లగల దివ్యవిమానాన్ని ఉద్యానాన్ని సృష్టించింది. వత్సరాజు, అతనిమంత్రులు ఆ విమానాన్ని ఉద్యానాన్ని చాల కుతూహలంతో చూచారు. మన వియ్యానికి కళింగసేన తగిన వియ్యపురాలని, వియ్యాల వారందరిలోను శ్రేష్ఠురాలని వత్సరాజు మనస్సులో అనుకున్నాడు.

ఒకనాడు వత్సరాజు ఏకాంతస్థలంలో ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. అప్పుడు అక్కడికి పెక్కుమంది సుందరులు వచ్చారు. వారి ముఖాలు రాత్రులకు తిలక

ప్రియుడైన చంద్రుడిలాగ వున్నాయి: హాయి దేవ వనితలుగా కనిపించారు. 'ఎవరు మీరు?' అని వారిని అడిగాడు రాజు.

'భూపతే, మేము విద్యలము, కళలము. ధీమంతుడైన మీ కుమారుని శరీరంలో ఇప్పుడు ప్రవేశించదలచాము.' అన్నారు.

వత్సరాజు వారిమాటలు విన్నాడు. వెంటనే శుచియై వారిని పూజించి 'మహాప్రసాదం' అని వారికి మనవిచేసి, మహానందంతో పొంగిపోయాడు. అప్పుడు ఆ కళలు, విద్యలు రాజపుత్రుడు నరవాహన దత్తుని దేహంలో ప్రవేశించాయి. ఆ విద్యలు, కళలు ప్రవేశించగానే రాకుమారుడు; సుధా సిక్తుడైన నక్షత్ర రాజులాగా వెలిగాడు.

సర్వజ్ఞుడు, కళలకు క్రీడా వనంవంటి ఆ రాజకుమారుడు వీణా శుభలక్షణాలను తండ్రినుంచి తెలుసుకున్నాడు. రాజాజ్ఞతో పుష్కరుడనే నృత్తాచార్యుడు కళింగసేన తనయను నృత్తగీతాలలో కోవిదురాలిని చేశాడు.

నరవాహదత్తుడు, కళింగసేన ఒకరి నొకరు చూచుకున్నారు. వారిద్దరిలోను నవ విలాసాలు ప్రేమంత వసంత ఋతువులో పూచిన సొబగులు కలిగాయి. వారిద్దరికీ ఇలా ప్రేమ వారికోరికలతోపాటు పెరుగుతూవుండగా, పుష్పచాపుడైన మన్మథుని విలువిద్య సఫలమయింది.

ఒకమారు నరవాహనదత్తుని సహచరులలో ఒక్కడయిన గోముఖుడు కళింగసేన

# ...బృహత్కథామంజరి

ఉద్యానవనం మీదుగా వెళ్లడం తటస్థించింది. కళింగసేన, అతడు తన కాబోయే అల్లుడి మిత్రుడేకదా అనుకొని అతనిని పిలిచి ఇలా అన్నది :— 'నీ మిత్రుడు నరవాహనదత్తుడు చాల యశస్వి. అతని అనురాగపు చూపు నా కుమార్తె మదన మంచుకమీద పడింది. నాకుమార్తె ప్రీతి కూడా అతనిపై లగ్నమయింది. కాని, రాజ పుత్రుడు తటస్థుడుగా వున్నాడు. కాని ఈ సిగ్గును ఎవరు ఎంతకాలం సహిస్తారు!'

గోముఖుడు ఆమె మాటవిని, అమ్మా, నీవు చెప్పేది సరైందే. యువతీ యువకులకు సమానంగా ప్రేమవున్నప్పుడు ఎవరికి ఆనందం కలుగదు? ప్రీతి అనుగుణమైనది. పూర్వం యోగానంద మహారాజుకు వరరుచికి మధ్య జరిగిన సంఘటనను తెలుపుతాను విను.

'ఒకనాడు యోగానందుడు, వరరుచి వీధిలో వెళ్ళుతున్నారు. అప్పుడు ఒక బరువుమోసేవాడు, ఒక కుమ్మరి ఎదురుగా వచ్చారు. 'మహారాజా, వీరిద్దరినీ మీరు ఎలా చూస్తున్నారు?' అని వరరుచి రాజును ప్రశ్నించాడు. 'ఈ బరువు మోసేవాడిని చంపుదామని వుంది. కుమ్మరిని చూస్తే, స్వబంధువు వచ్చినట్టు అనిపిస్తుంది' అని రాజు సమాధానమిచ్చాడు.

తర్వాత వరరుచి, వారిద్దరివద్దకు వచ్చి, ప్రసంగవశాత్తు, 'రాజు విషంతాగి ఇప్పుడే మరణించాడు' అని అన్నాడు. 'అబ్బ! ఎంత అదృష్టం! జగత్తు నిష్కంటకమయింది' అన్నాడు బరువు మోసేవాడు. కాని, కుమ్మరి కన్నీళ్లతో 'అయ్యో ప్రజలకు ఆధారం శూన్యమయిందే!' అని విలపించాడు. ఈ మాటలను రాజుకూడా మరుగున వుండి విన్నాడు.

వరరుచి రాజువద్దకు తిరిగి వచ్చాడు. 'దేవా, విన్నారుకదా! వీరి మనఃప్రవృత్తి వీరి విషయంలో ఎలావుందో వీరి ప్రవృత్తి కూడా మీ విషయంలో అలాగే వుంది. చూచారు గదా! ప్రాయశః మనస్సు మనస్సును చూస్తుందనుకుంటాను.' అని రాజుతో అన్నాడు.

'మదనమంచుక ప్రీతితో కళ్లు పెద్దవి చేసుకొని రాజకుమారుణ్ని చూచినట్లే, రాజకుమారుడుగూడ 'మదనమంచుకపై బద్ధానురాగుడు. ఈ విషయంలో సందేహం లేదు.'

గోముఖుడు రాజపుత్రుని మనసు విప్పి చెప్పి వెళ్లిపోయాడు. కళింగసేన నరవాహన దత్తునితో తనకుమార్తె వివాహం విషయమై ఆలోచించసాగింది.

ఒకమారు గోముఖుడు నగర వీధిని వెళ్ళుతున్నాడు. అప్పుడొక వర్తకుని వడుచు తన చెలికత్తెను అతనివద్దకు రాయబారం పంపింది. అతడు ఒప్పుకోలేదు. అతని తిరస్కారానికి ఆ వణిగ్యువతి సిగ్గుపడింది. ఆ సిగ్గు క్రమంగా క్రోధంగా మారింది. అతనిని ఏవిధంగానైనా చంపివేయాలనే దుర్బుద్ధి పొడమింది.

ఒకమారు అతనికి ఆతిథ్యమిచ్చి అతనికి విషం కలిపిన తేనె యిచ్చిగాని, ఇతరవిధాలగాని, చంపివేయడానికి ఆలోచించి పాసియంలో విషం కలిపి యిచ్చింది. ఆమె విషం పెట్టిందని గ్రహించాడు. ఇలా ఆలోచించాడు:

'ఆహా స్త్రీల చర్య ఎంత కుటిలం! ఎంత సహజమలినం! స్త్రీలు కోపంతో ఉద్రేకపడి కలుషమనస్కలయితే, మురికి వరదనీటితో మహోద్రేకంతోపారే నదుల వంటివారవుతారు. స్త్రీలంటేనే తప్పుల కుప్పలు. పనిగట్టుకొని వెదికామా,



దొరకరు. పెట్టుకున్నారా, వదలరు. పూర్వజన్మ వాసనవల్ల వారు సంసారమోహరతులు. వారి చేష్టలూ విచిత్రాలు. విషాదంలో నవ్వుతారు. సంతోష సమయంలో విచారంగా ఏడుస్తారు. ప్రేమ వున్నప్పటికీ భర్తను చంపుతారు స్త్రీల చిత్తం ఎవరికి తెలుస్తుంది ! నిజమే కథాకోవిదులు చెప్పే శత్రుఘ్నుని కథ నాకు జ్ఞాపకం వస్తున్నది :

'శత్రుఘ్నుడనేవాడు మహాబలవంతుడు. తన భార్య పరపురుషాసక్త కావడం అతడు చూచాడు. కోపంతో అపారదారికుణ్ని (పరస్త్రీనిపొందే దుర్మార్గుణ్ని) కొట్టి చంపివేశాడు. బలంతో దర్పించిన అతడు ఆ దుర్మార్గుని శవాన్ని బుజంపై వేసుకొని పోయి ఒక పాడుబావిలో పడవేశాడు. ఆ పాడుబావిలో పడిన శవాన్ని వంగి చూస్తున్నాడు. అతని భార్య వెనకనుంచి చెంగు చెంగున అక్కడికి వచ్చింది. అతనిని బావిలోకి తోసింది. అలాటి పాపబుద్ధిగలవారు స్త్రీలు.'

గోముఖుడు ఇలా ఆలోచిస్తూ, రాజకుమారునివద్దకు వచ్చాడు. అప్పుడక్కడ అతనికి ఇష్టులైన మరుభూతి మొదలయినవారు అతనిచుట్టూ మూగివున్నారు. ఏవేవో ముచ్చట్లు చెప్పుకుంటున్నారు. రాజనీతివేత్తలు నానావిధ రాజనీతి విషయాలు చెబుతున్నారు. సేవకవ్రతం గురించిచర్చ వచ్చింది. వారు సేవకవ్రతాన్ని గురించి పెద్దలుచెప్పగా విన్నదాన్ని ఇలా నరవాహనుని ఎదుట చెప్పారు:— రాజులు కోతులలాగా చపలులు. చాల పొగరుపట్టినవారు. ఎంతో కష్టంతోగాని అనుగ్రహించరు. శ్రద్ధగా సేవచేశామా, కోపపడుతారు. మోసంచేశామా, సంతోషిస్తారు, యోగి, రాజసేవకుడు ఒక్కటే. యోగి సకల ప్రాణుల మనస్సులోని విషయాలు గ్రహిస్తాడు. రాజసేవకుడు సమస్తజనం మనస్సునూ గ్రహిస్తాడు. ఇద్దరిపనీ సాహసోపేతమైంది. స్వామిని వంచించనిది. ఆహా ! ఇది ఎంత తీక్ష్ణమైన వ్రతం ! ఇంత పరమ తత్వం తెలిసి రాజులను కొలిచినా, రాజులమనస్సు తెలుసుకోలేము, గాలులను ఎవరయినా పట్టుకోగలడా? సరళ స్వభావులయిన రాజులు కలిసికట్టుగావున్న సేవకులను అదుపులో పెట్టుకోలేరు. కుటిలులయిన భృత్యులు కుటిలబుద్ధులయిన రాజులను మరీ గాసిపెడతారు. భృత్యులు కలిసికట్టుగా వుండకుండా చేసేవాడు, సంహతులయిన (ఐకమత్యంతో వున్న) భృత్యులను చీల్చేవాడు చాల సమర్థుడయిన రాజు. వాడి సిరి స్థిరంగా వుంటుంది.

'పూర్వం మధురా నగరాన్ని శూరసేనుడనే రాజు పాలించేవాడు. అతడు గొప్ప రాజనీతిజ్ఞుడు. తన సేవకులందరూ ఐకమత్యంతో వుండడం గ్రహించాడు. వారిని క్రమంగా విడదీశాడు. ఒకరిని అనుగ్రహించాడు. మరొకరిని తీవ్రంగా దండించాడు. అనుగ్రహించిన వానినికూడా మరొక సమయంలో దండించాడు. ఇలాగే అందరినీ వరుసగా ఒకమారు అనుగ్రహించి, ఒకమారు శిక్షిస్తూ వచ్చాడు. 'రాజకుమారా, ఇలాటి తత్త్వధర్మాల ప్రాజ్ఞులు అయిన రాజులున్నారు. వారందరినీ నీవుచూచి నేర్చుకోవాలి.'

నరవాహనుడు ఇలా మిత్రులతో గోష్ఠి జరుపుతూ గడుపుతున్నాడు.

మదనమంచుక సౌందర్య శోభ విద్యాధర లోకానికి తెలిసింది. మానసవేగుడనే విద్యాధరరాజు మదనమంచుకను చేపట్టాలనే తలంపులో వున్నాడు. కళింగసేనకు ఈ సంగతి తెలిసింది. ఆమె వత్సరాజుకు తన కుమార్తెకు నరవాహనదత్తునితో వివాహం ప్రస్తావించింది. వత్సరాజుకూడా యౌగంధరాయణునితో ఆలోచించి కుమారుని వివాహ ప్రయత్నాలు ప్రారంభించాడు.

రాజాజ్ఞతో దైవజ్ఞులు గ్రహసంపత్తి, దేవతాగణబలం పూర్తిగావున్న ఉత్తమ ముహూర్తం నిర్ణయించారు. మదన మంచుక సకలాభరణభూషితురాలై, వివాహోచితమయిన కంకణం ధరించి, తన శరీరకాంతితో నగలకే సొబగులిస్తూ, వివాహవేదికను సమీపించింది. దేవతలు ఆ సమయంలో పుష్పవర్షం కురిపించారు.

మదనమంచుక, నరవాహన దత్తుల వివాహం విధిపూర్వకంగా, సవైభవంగా జరిగింది. అగ్నిప్రదక్షిణ సమయంలో పెళ్లికూతురు ఓరగా మగనిని చూచింది. అది చూడగా, ఒక నల్లకలువలదండ జారి అతనిపై పడినట్లనిపించింది

ఈ ముహూర్త బలంతోనే నరవాహన దత్తుడు విద్యాధర చక్రవర్తి అవుతాడు. అందువల్ల అందరికీ చక్రవర్తి పదవిని కటాక్షించే లక్ష్మీదేవికి కోపం వచ్చింది, తన అనుగ్రహం ప్రసక్తి లేకపోయింది కదా అని.

వధూవరుల నయనవిలాసాలతో ముచ్చట గొలిపే ముఖాలు చూడగానే. పూవువిలుకాడు రతీదేవిని కలుసుకొన్నాడని స్పష్టమయింది. ఈ నేత్రోత్సవాన్ని మనం చూడవలసిందని విధి విధించాడు — అనే ప్రవాదాలు క్షణంలో దివ్యలోకాలలో వ్యాపించాయి. (ఇంకా ఉంది)



## విడాకులకి కారణమైన గడియారం !

57 ఏళ్ల ఒరిన్ బాబ్ అనేఅతను తనపడక గదిలో వున్న భార్య గడియారం చేసే శబ్దాన్ని భరించలేక ఆ గడియారాన్ని తీసుకెళ్ళి అవతల పడేసి వచ్చి పడుకున్నాడట. అది చూసిన అతని భార్య చివాలున లేచి తన గడియారాన్ని తీసుకుని వేరేగదిలోకి పోయి పడుకుందట. ఆనక తెల్లారాక ఆమె తన భర్తనుంచి విడాకులు కోరిందట తన గడియారాన్ని అవమానించిన కారణానికి. విడాకులకు అనుమతి ఇచ్చిన జడ్జి "విడాకులకు కారణం చాలా చిన్నదీ, హాస్యాస్పదమైనదే అయినా" అనేసి వూరుక్కున్నాడట. ఇది లండన్‌లో జరిగింది.

## కసికి కారణం ?

బర్మారా అనే గ్రామంలో జయదేవ్‌సల్‌హైల్ అనె అతని యింట్లో కొందరు ముష్కరులు ప్రవేశించి నిద్రపోతున్న అతనిని లేపి, కత్తితో పొడిచి చంపేశారట. తండ్రి ఆర్తనాదంవినికొడుకు ఆగదిలోకి వచ్చేసరికి అతన్నీ పొడిచి చంపేసి వెళ్ళిపోయారట. వారెవరు? ఎందుకంత కసివూనారు? అన్నవిషయాల మీద అన్వేషణ ప్రారంభమయింది.

## పుండంజా ?

కుటుంబ నియంత్రణ పథకం అమలుపరచ టంలోవియన్ (ఫ్రాన్స్)లో ఒకదంపతులుబోలెడు పుండంజ వేశారు. 1959 నుంచి 1964 వరకూ తమకు పుట్టిన ముగ్గురు పిల్లలను చంపి, పెరట్లో పాతేశారట. వీరికి 16 ఏళ్ల కొడుకు 13 ఏళ్ల కూతురూ వున్నారట. వారిద్దరితోనే సంత్సస్తి పడాలనుకుంటె కుదరనందువల్ల ముగ్గురు పిల్లలనూ పెరట్లో పాతిపెట్టారట. ఆ మహాతల్లి మిసెస్‌రెనిధిన్ మళ్ళీగర్భవతట. ఈ జంటను ప్రభుత్వం పట్టుకుంది.







## పేలే మాత్రలు !

మందులు కడుపులో చాలా ఆలస్యంగా పని చేయడమనేది సామాన్యంగా జరుగుతున్న విషయమె! కానీ మింగిన మాత్ర కడుపులో ఢాం అని పేలడం మాత్రం సామాన్యవిషయంకాదు. బ్రిటిష్ మెడికల్ జర్నల్‌లో యీ విషయం ప్రకటించారు. లివర్‌పూల్ లోని ఒక ఆసుపత్రిలో నర్సులకువున్న ట్టుండి పిస్టలు పేల్చినట్టు డాం అనే శబ్దం వినబడిందట. చుట్టూ పరిగెత్తిచూస్తే ఆ శబ్దం ఒక నలభై ఏళ్ళస్త్రీ పొట్టలోని మాత్ర పేలుడువల్ల సంభవించిందట. డుయోడినల్ అల్సర్‌తో బాధ పడుతున్న ఆమెకు మాత్రలిస్తే అవి ఏడెనిమిది గంటల తరువాత పేలనారంభించాయట. ఇంకో మాత్ర పేలినపుడు టెలివిజను సెట్టును బాగుచేస్తున్న ఒకవ్యక్తి ఆశబ్దంవిని, తనుకూర్చున్న కుర్చీ స్ప్రింగ్ తెగిపోయిందనుకుని రయమున ఆ కుర్చీని బాగుచేయ బూనాడట. ఇంతకి ఆమెకు మాత్రం ఏమీ హాని జరగలేదట.

## అనుమానం...?

లిమా (పెరూ) లో 10 వ తేదీన—తన భార్య శీలాన్ని శంకించిన ఒకాయన తన భార్యనే గాక, ఆమె ప్రియు లనబడే ఒక నలుగురిని, అదే సమయానికి వచ్చిన ఆమె స్నేహితురాండ్ర నోయిద్దరినీ చంపి, ఆనక తనూ చనిపోయాడట. భార్య ప్రియులకు ఒకపార్టీ యిచ్చి విషం కలిపిన ఒక పానీయం యిచ్చాడట. భార్య, నలుగురు ప్రియులు, ఇద్దరు స్నేహితురాండ్రు వెరసి ఏడుగురూ చనిపోవడం చూసి తనూ ఆ విషాన్నే గుక్కెడు తాగి [illegible].

## ప్రాథమిక హక్కు !

ఒకేజాతికి (పురుషులతో పురుషులు—స్త్రీలతో స్త్రీలు అనుకోవచ్చు) చెందినవారు తమలో తాము కామవాంఛ తీర్చుకోడానికి హోమోసెక్సువాలిటీ అని అంటారు. దీనిని డచ్‌లో నిషేధించారని వందమందికి పైగా హోమోసెక్సువల్ పార్లమెంటు భవనంముందు నినాదాలు చేసి, సభ్యుల మీద "ఒక్క ముద్దుచాలు—ఈరాత్రికి కలుద్దాం—సిద్ధంగా వుండుస్మీ" అని ముక్కలు రాసిన అట్టలు విసిరారట. తమ జాతికి చెందిన తక్కువ వయస్సు పురుషులతో సంపర్కం నిషేధించడానికి ప్రభుత్వానికి హక్కులేదనీ, ప్రేమ ప్రాథమిక హక్కనీ వారు గగ్గోలు చేశారట.

* * *

దక్షిణ వాటాకు 8 మైళ్ళ దూరంలో గల హామీదాబాద్‌లో డిశంబరు 24న స్త్రీ పురుష జననేంద్రియాలు కలిగిన శిశువు జన్మించిందట. ఈశిశువు పెరిగి, యుక్త వయస్సుకు వచ్చేలోగా ఒక జాతి అవయవాలు అణగారి పోతాయని, మగా, లేక ఆడా అన్న విషయం అప్పుడేనిశ్చయంగా చెప్పడానికి వీలవుతుందని డాక్టరన్నారట. ఇదే కుటుంబంలో 30 ఏళ్ళ క్రితంస్త్రీ పురుష జననేంద్రియాలు కలిగిన శిశువుజన్మించి భర్త చనిపోయిన కొంత కాలానికి ఆమె తిరిగి పురుషత్వాన్ని పొంది, ఒక స్త్రీనివివాహం చేసుకుందట. భర్త చనిపోయిన స్త్రీలు టక్కున పురుషులుగా మారి స్త్రీలను పెళ్ళిచేసుకోడం టోకున సంభవిస్తే దేశంలో వివాహ సమస్యలు కొంతవరకు తీరచ్చు—పెద్ద విషయాలు మనకేల!

* * *



## కొడుకుమీద దావా

అనకొడుక్కి డాక్టరు చదువు చెప్పించినందుకు అయిన 19 వేల డాలర్లు తిరిగి తనకు కొడుకు చెల్లించాలని మియామిలో ఓర్వాల్ రాబర్ట్సన్ కేసువేసి గెలిచాడట. చదువు చెప్పించేముందే ఆతండ్రి పైకం తిరిగి యిచ్చేటట్టుగా తన కొడుకు వద్ద నుంచి ఒక పత్రం రాయించి తీసుకున్నాడట. అప్పప్రకారం చెల్లించక పోయేసరికాయన కోర్టు ద్వారా గెలుపొందాడట—




## చెవులకి మొప్పలు...

కళ్లతో మనం చూడాలనుకున్నపుడు చూస్తాం, లేనపుడు కళ్ళుమూసుకుంటాం. ఇలాటి అవకాశం భగవంతుడు మనచెవులకు పెట్టలేదు. ఈగోడవలు శబ్దాలూ అన్ని వింటూ వుండాల్సిందే! ఇది ఎంతో కాలం యిలా వుండదనీ, ఒక వెయ్యి సంవత్సరాలలోగ మానవ శరీరం నుంచి కళ్ళకు రెప్పలు లాగ చెవులకు మొప్పలు వస్తాయనీ తనకు కావల్సిన పద్ధతిలో అవయవ నిర్మాణం చేసుకొనేశక్తి జీవికి వుంధనీ ఎటొచ్చీ యిది జరగడానికి ఒక వెయ్యి సంవత్సరాలు పట్టుతుందనీ లండన్‌లో డొంన్ అలెన్ అనే ఆయన అన్నారట—

## ఉపకారం...!

భర్త పెట్టే బాధలు భరించలేక ఒకామె రైలు పట్టాల మీద తల పెడితే రైలులోంచి ఆదృశ్యాన్ని చూసిన డ్రయివరు ఆమెకు కొన్ని అంగుళాల దూరంలో అతి చాకచక్యంగా రైలాపి, ఆమెను రక్షించి, పోలీసులకు వప్పగించాడట—ఇది త్రికల (ఢిల్లీ) రైలు బ్రిడ్జి మీద జరిగింది. ఆయిల్లాలుకు డ్రయివరు చేసినది ఉపకారమే ననుకోవాలా! పాపం!! అతని ధర్మాన్ని అతన్నెరవేర్చాడు.

● ● ●

## టువిశ్రాలు

రికార్డుల అమ్మకానికి చెప్పుల అమ్మకానికి తన పేరును వుపయోగించుకొని తనను ధాప్స్ మెకన్ షూకంపెనీ అవమానించిందని ప్రఖ్యాత సితార్ విద్వాంసుడు పండిట్ రవిశంకర్ న్యూయార్క్‌లో 7,50,000 డాలర్లకు పరువునష్టం దావా వేశారట. మానవ హృదయం పనిచేసినంత గ్యారంటీగా పనిచేసే రబ్బరు హృదయాన్ని అమెరికాలో ఒక సంస్థ తయారు చేసిందట. కౌమారదశ దాటిన పిల్లలు యువ్వనదశలోగా వుండే వయస్సులో, బాలురంటే బాలికలకూ, బాలికలంటే బాలురకూ అసహ్యత ఏర్పడుతుందనీ, ఒకరంటే మరొకరికి పడదని పాటియాలాలో డాక్టర్ చనానా అన్నారట. డబుల్ మెటర్! యువ్వనంలోకి వచ్చాక ఆ అసహ్యత అతి సఖ్యతగామారిపోతోంది కదా.

* * *

[illegible]

[illegible] ఆమెను అపహరించుకుపోయి [illegible] విశ్వప్రయత్నము చేసి, చెరిచాడట. వారి వివాహ ఎన్నడు చర్య తీసుకోవాలి! [illegible] వారగావుండి విపరీతం.

పెళ్లవడమే గాక రెండున్నర సంవత్సరాల పిల్లాడున్న లక్ష్మణన్ అనే అతను లక్ష్మి అనే, ఆమెతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడట. ఆమె యింటికి వెళ్ళినప్పుడల్లా లక్ష్మణన్ తన కొడుకును తీసుకువెళ్లేవాడట. ఒకరోజున భార్యతో పోట్లాడి, కొడుకును ఉంపుడుకత్తె యింటిలో వుంచి ఎవికి వెళ్లి సాయంకాలం వచ్చి "నాకొడుకేడి?" అనడుగుతే లక్ష్మి నిళ్ళ నమిలిందట. ఈ విషయంలో పోలీసులు జోక్యం కలగచేసుకుని ఓ నీటిమడుగు లాటి దాంట్లో పిల్లాడి శవం కను క్కున్నారట. మర్డర్ విల్ బి అవుట్ అని అన్న దెవరూ! షేక్స్‌పియరేనా!! (ఇది తిరువన్నామలైలో జరిగింది.) ●

# భక్తికి పాండిత్యానికి పట్టుకొమ్మ వారణాశి



సంస్కృత కళాశాల

*ఆంధ్ర యువ చిత్రకారులలో ఒకరయిన శ్రీ మనోహన్ దత్ కొంతకాలంకింద కాశీ వెళ్లి వేసిన బొమ్మలు వేస్తున్నాము.*

—సం.

**బొమ్మలు : మనోహన్ దత్**

ఆ మందాకిని యా త్రివేణీ వరుణం
బా బాహ్య కక్ష్యాంతరం
బా మధ్యంత కక్ష్యలా విమల దివ్యజ్యోతి
రుజ్జృంభణ

శ్రీమద్విశ్వపతీశలింగము మదిం బ్రాంతింప
గాశీ పురీ
గ్రామం బెప్పుడు నా కనుంగవకు
సాక్షాత్కారముం గైకొనున్.
—శ్రీ భీమేశ్వర పురాణము.



దుర్గగుడి



విశ్వనాథ దేవాలయము

కాశి శివుడి ఊరు. ఇక్కడ ప్రాణాలు వదిలినవారికి మోక్షం కలుగుతుందంటారు. హైందవులందరికీ ఇది పరమ పుణ్యక్షేత్రం. బుద్ధభగవానుడు కూడా ఇక్కడికి దగ్గరలో ఉన్న సారనాథ్‌లో తన మొదటి ప్రసంగం చేశాడు.

వారణ, అశి అనే రెండు చిన్న నదుల మధ్య ఉంది కాబట్టి దీనికి వారణాశి అనే పేరు వచ్చింది. కాని ఈ పుణ్యక్షేత్రానికి అవిముక్తకం, ఆనందకాననం, మహాస్మశానమనే పేర్లు కూడా ఉన్నాయి.

జాతక కథలలో కాశికి చాలా ప్రాముఖ్యత ఉంది. (ఒక కథ ప్రకారం శ్రీరాముడు కాశీరాజు కుమారుడే.) కాశీ నగరం నందుల రాజ్యంలో, తర్వాత మౌర్య సామ్రాజ్యంలో ఉండేది. బౌద్ధులకి కూడా కాశి ఒక ముఖ్యమయిన కేంద్రంగా ఉన్నట్లు అశోకుడి శాసనాలు సూచిస్తాయి. పతంజలి మహాభాష్యంలో కాశీ నగరం పేర్కొనబడింది......

గుప్తుల కాలంలో ఇది క్రమంగా శైవక్షేత్రంగా ప్రాముఖ్యతని సంపాదించుకొనటం ప్రారంభించిన దనవచ్చు.

వివిధ సామ్రాజ్యాల కింద ఉన్న కాశి 18, 19 వ శతాబ్దంలో బ్రిటిషు సామ్రాజ్యంలో చేరింది (పేరుకు కాశీరాజు ఉన్నప్పటికీ బ్రిటిషు రెసిడెంటే పాలకుడని వేరే చెప్పనవసరం లేదు)

నలందవలె కాశి ఎప్పుడూ 'విశ్వవిద్యాలయ నగరం' కాదు కాని మహా పండితులెందరో అక్కడ ఉండటంచేత అదొక గొప్ప విద్యాపీఠం అయిపోయింది. బెర్నియర్ అనే ఐరోపావాసి కాశీనగరాన్ని 'ఏథెన్స్ ఆఫ్ ఇండియా' అన్నాడుట అక్కడ వర్చస్సే పాండిత్యాన్ని గమనించి. శంకరాచార్యుడు, భట్టోజి దీక్షితులు, నాగోజీ భట్టు — ఈ పట్నానికి చెందిన కొందరు మహాపండితులు

ఇక్‌బాల్ కవికూడా ఒకసారి, శాశ్వతంగా పారే గంగా జలాన్ని తన 'కారవాన్' నది తీరంమీద ఆగిన రోజుల్ని గుర్తు ఉంచుకొమ్మని పద్యరూపంలో కోరాడుట.

అయితే ఈ ఊరుని గురించి ఎంతరాసినా ఒకసారి చూడటంతో సమానం కాదు. భక్తి ఉన్నా లేకపోయినా ఇక్కడి వైవిధ్యాన్ని, విచిత్రాలని చూసినవారు వాటిని ఎప్పటికీ మరవలేరు. భారతదేశంలో ఉండేవారందరికీ ఇది ఎన్నోవిధాలుగా ఒక కేంద్రం... ●

అటీ_ఇటీ

# కొత్తగూడెం ఎరువుల ఫ్యాక్టరీ

"ఆదిలో అనుకున్న ప్రకారం కొత్తగూడెంవద్ద ఎరువుల ఫ్యాక్టరీ స్థాపిస్తే చాలా సంతోషిస్తా" నన్నారు మన ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి.

'ఎరువుల ఫ్యాక్టరీ పట్ల ఇక్కడ ఇంత ఆందోళన వున్నట్లు నాకు నిజంగా తెలియదు. జనాభిలాషను, ఇచ్చటి సౌకర్యాలను, దేశసౌభాగ్యాన్ని దృష్టిలో వుంచుకొని త్వరలో తగు నిర్ణయం తీసుకుంటాం.' అన్నారు కేంద్ర పెట్రోలియం, రసాయనశాఖ మంత్రి శ్రీ కొత్త రఘురామయ్య మొన్న కొత్తగూడెంలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగసభలో ప్రసంగిస్తూ. (11—1—1969న).

కొత్తగూడెంలో ఎరువుల ఫ్యాక్టరీ స్థాపించాలని రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలపై వత్తిడి తీసుకు రావటానికి ఏర్పడిన 'కార్యాచరణసంఘం'వారు శ్రీ రఘురామయ్యకు సమర్పించిన విజ్ఞాపన పత్రంలో యీ క్రింది విధంగానే పేర్కొన్నారు.

1. కొత్తగూడెం వద్ద ఎరువుల ఫ్యాక్టరీ స్థాపించాలని నిర్ణయించి 1960 సం.లో రాష్ట్రప్రభుత్వం రెండువేల ఎకరాల భూమిని సేకరించింది.

2. ఎరువుల ఫ్యాక్టరీకి కావలసిన విద్యుత్‌ను సరఫరా చేసేందుకుగాను (సుమారు 30 మెగావాట్లు) జపాన్ సహకారంతో సూపర్ విద్యుత్ కేంద్రాన్ని యిక్కడ నెలకొల్పారు. ఇందులో యిప్పుడు 240 మెగావాట్ల విద్యుత్ సరఫరా అవుతోంది. ఇంకా విద్యుత్‌ను సరఫరా చేయగల మరో యూనిట్‌కు పని ప్రారంభించబడింది.

3. ఎరువుల ఫ్యాక్టరీకు కావలసిన అయిదు మిలియన్ గాలన్లనీటిని (రోజుకు) విద్యుత్ కేంద్రానికి కావలసిన మరో 50 మిలియన్ గాలన్లనీటిని సరఫరా చేసేందుకుగాను అయిదుకోట్ల రూపాయలవ్యయంతో కిన్నెరసాని ప్రాజెక్టు నిర్మాణంపూర్తి చేయబడింది.

4. ఎరువుల ఫ్యాక్టరీ, విద్యుత్ కేంద్రాలకు ఉపయోగపడేలా కొత్తగూడెంలోని భద్రాచలం రోడ్డు రైల్వే స్టేషనునుండి ఒక రైల్వే సైడింగు కోటి రూపాయల ఖర్చుతో నిర్మించబడింది.

5. ఎరువుల ఫ్యాక్టరీ, విద్యుత్ కేంద్రాలకు కావలసిన బొగ్గును సరఫరా చేసేందుకు వీలుగా కొత్తగూడెం—యెల్లందు బొగ్గు గనులను అభివృద్ధి చేయటమేగాక, లోతునుండి బొగ్గు త్రవ్వి తీసేందుకుగాను సుమారు 80 లక్షల ఖర్చుతో రెండు షాఫ్టులు హంగరీ దేశసహకారంతో కొత్తగూడెం వద్ద నెలకొల్పబడినాయి.

5. భారతదేశానికి 'ధాన్యాగారమై' అలరారు చున్న ఆంధ్ర కోస్తా జిల్లాలు కొత్తగూడెంకు అత్యంత సమీపంలో నుండుటవల్ల ఎరువులను తక్కువ ఖర్చుతో, తక్కువ వ్యవధిలో, రైతులకు అందచేయుటకు వీలవుతుంది.

యీ పై సౌకర్యాల దృష్ట్యా ఏనాడో నిర్ణయించిన కొత్తగూడెం ఎరువుల ఫ్యాక్టరీస్థాపనకు వెను వెంటనే పూనుకోవాలని ఆనాటి బహిరంగ సభలో మాట్లాడిన వక్తలునొక్కి వక్కాణించారు.

—యం. కె. మూర్తి



కేంద్ర పెట్రోలియం, రసాయన శాఖమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య ఇటీవల కొత్తగూడెం వద్ద నిర్మించాలనుకొన్న ఎరువుల ఫ్యాక్టరీ విషయమై కొత్తగూడెం వచ్చినప్పుడు ఎరువుల ఫ్యాక్టరీ కార్యాచరణ సభ్యులతో వున్నప్పటి చిత్రం.



## జాక్‌పాట్ మోహన్‌కుమార్

చిత్రలహరి మోహన్‌కుమార్ తారాబలం చాలా బాగున్నట్లుగావుంది. ఇప్పుడు అతను పట్టింది బంగార మవుతున్నది. మొన్న రేసుల్లో మళ్లీ జాక్‌పాట్ కొట్టాడు. జాక్‌పాట్ విలువ సుమారు అయిదువేలే అయినా, ఇది అతని అదృష్టానికి మరో ఉదాహరణ. అతన్ని అభినందిస్తున్నాము.

## బిక్సారా ఆంధ్రసంఘం

ఆంధ్రసంఘము, బిక్సారా (హవురా), జనవరి 23 దిని నేతాజీ సుభాష్ చంద్రబోస్ జన్మదినోత్సవాన్ని జరుపుకుంది. (ఒ. వి.)

## వి వా హ ం

ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకి సినిమా వార్తలను అందిస్తున్న చి॥ టి.ఆర్. శ్రీనివాస్‌కి చి॥ సౌ॥ విజయలక్ష్మికి తిరువామూర్‌లో జనవరి 23 వ తేదిన వైభవంగా వివాహం జరిగింది. సినీ పరిశ్రమకి చెందిన కొందరు ప్రముఖులు, తదితర పెద్దలు వచ్చి వధూవరులను ఆశీర్వదించారు.

(ఒ. వి.)

## జ మ్ షె డ్ పూ ర్
## ఆంధ్రనాటక సాహిత్య సంఘం

జమ్‌షెడ్‌పూర్ ఆంధ్రనాటక సాహిత్య సంఘం వారు యిటీవల తమ సంస్థ స్వర్ణోత్సవాన్ని జరుపుకున్నారు. అయిదు రోజుల పాటు జరిగిన స్వర్ణోత్సవ కార్యక్రమాలకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. టాటా కంపెనీ డైరెక్టర్ ఇన్‌చార్జి శ్రీ నానావతి స్వర్ణోత్సవ సంచికను ఆవిష్కరించారు (ఒ. వి.)




ఆంధ్ర అంతటా
కనుపించిన
అద్భుత
ఫలితాలవల్ల
సుఫల

# అన్నిపంటలకూ అమోఘమైన ఎరువని రుజువైంది!

ఖారిఫ్ పంటలు అనూహ్యమైన దిగుబడి నిచ్చాయని రైతులంటున్నారు. దీనికి కారణం సుఫల [అమోనియం నైట్రేట్ ఫాస్ఫేట్] అని సగర్వంగా చెబుతున్నారు. అవును, సుఫల సాటిలేని మేటి రసాయనపు ఎరువు; అన్ని పైర్లకూ పనికి వస్తుంది.

సుఫలను అధిక పరిమాణంలో ఒక్క సంవత్సరం వాడి చూచారు వరి, చెరకు, జొన్న, వేరుశనగ, పొగాకు, మిరప— ఒకటేమిటి — పలురకాల పైర్లనూ పోషించటంలో మేటి ఎరువని రుజువైంది. పంటపైర్లకు సుఫల సంపూర్ణ పోషకాహారం ఎట్టి భూములలోనైనా నిస్సందేహంగా వాడవచ్చు.

ఖారిఫ్ పంటకాలంలో సుఫల సత్ఫలితాలను చూచి రైతులు ఉప్పొంగి పోయారు. కనుకే రాబి పంటలకు కూడా సుఫలనే వాడాలని నిశ్చయించుకున్నారు. అందుకే ముందుగానే సుఫలనుకొని నిల్వ చేసుకొంటున్నారు.

పైర్లు యేపుగా, ఆరోగ్యప్రదంగా పెరగటానికి, పసిడి పంటలు పండటానికీ సుఫలను వాడండి.




ప్రాంతీయ ఆఫీసు
ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా,
లిమిటెడ్, ట్రాంబే యూనిట్
5-10-173, ఫతేమైదాన్ రోడ్డు, హైదరాబాదు
ఫోను : 37610


వరి — చెరకు


పొగాకు — మొక్కజొన్న


అరటి — ద్రాక్ష


వేరుశనగ — మిరప

# అవీ - ఇవీ...

అడ్వర్టయిజింగ్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా వారి 23 వ సర్వసభ్య సమావేశం జనవరి 25 న కలకత్తాలో జరిగింది. ఈ సమావేశంలో సంస్థ కార్యనిర్వాహక వర్గం ఎన్నిక జరిగింది.

అధ్యక్షుడుగా శ్రీ ఆయాజ్ ఎస్. పీర్ భాయి, ఉపాధ్యక్షుడుగా శ్రీ జె. కురీస్, కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా శ్రీయుతులు టి. ఎస్. రామన్, ఎస్. రామచంద్రన్, జె. మైన్‌ధియా, ఇ జి. ఎ. బాధన్, బి. కె. సిన్హా, కైలాష్ సి. జైన్, ఎస్. ఆర్. గుప్తా, పి. సి. రాయి, జె. చక్రవర్తి, వి. కె లాల్, ప్రేమ్‌నారాయణ్, ఇందర్ నారాయణ్ ఉన్నారు.

—(ఒ. వి.)

# మోహన్ రానడే

జనవరి 26 మనదేశానికొక పర్వదినం. ఆనాడు భారత ప్రజలకొక శుభవార్త కూడా పంపింది—భారతదేశం శత్రువులనిపించుకున్న పోర్చుగల్! గోవా స్వాతంత్ర్య యుద్ధవీరుడయిన 39 ఏళ్ల మో హ న రా న డే ని విడుదల చేసింది...

రానడె 1956 నుంచి కారాగృహంలో ఉంటున్నాడు. అజాద్ గోమంటక్‌దళం నాయకుడు కాబట్టి అతన్నిపట్టి, ఉరితీసి గోవా ప్రజలలో భయాందోళనలని కలిగించాలని గోవాలోని పోర్చుగీసు అధికారులు నిశ్చయించుకున్నారు. ఎందుకో తమ ఉద్దేశాన్ని మార్చుకుని రానడేని బందీగా మాత్రమే ఉంచారు. కారాగృహవాసి మోహనరానడే తన జెయిలు సిబ్బందిలోని ఆఫ్రికన్లకి ఇంగ్లీషు, పోర్చుగీసు నేర్పేవాడు. వారికి పోర్చుగల్ ఆఫ్రికాలో చేసే అన్యాయాలని గురించి చెప్పేవాడు. ఇది తెలుసుకున్న అధికారులు అతన్ని 1959 లో పోర్చుగల్‌కి మార్చారు.

అక్కడ రానడెకి వారు పెట్టిన హింస వర్ణనాతీతం. ఆరు నెలలపాటు చేతికి బేడీలు తగిలించి ఉంచారు. ఆరేడు సంవత్సరాలు ఏకాంత కారాగృహవాసం వేశారు. అతు(భమయిన గదిలో మామూలు నేరస్తులతో ఉంచారు. సరయిన దుస్తులు ఇచ్చేవారుకారు. నెలలపాటు స్నానం చెయ్యనిచ్చేవారుకారు...

13 సంవత్సరాల కారాగృహవాసం తర్వాత రానడె పోర్చుగల్ ప్రధానమంత్రి మార్సెల్ కాటెనోకి అప్పీలు పెట్టుకున్నాడు. జనవరి 22 నాడు కోర్టువారు ఆతని అప్పీలు విని అతన్ని విడుదల చేశారు...

రానడె తన విప్లవాత్మక కార్యక్రమానికి కావలసిన తరిఫీదుని అప్పటి నైజాము రాష్ట్రంలో నేర్చుకున్నాడు. అతను అక్కడ రజాకార్లకి ఎదురుగా పోరాడేవాడు. మే 1948 లో గోవా మీద దృష్టి మళ్లింది. గోవాకి వెళ్లి మరాఠీ—హిందీ ఉపాధ్యాయవృత్తి స్వీకరించి స్వతంత్రోద్యమానికి కావలసిన ఏర్పాట్లు చేసుకున్నాడు. ఎన్నో విజయవంతమయిన యుద్ధాలు జరిపి చివరికి బెటెమ్ పోలీసుస్టేషన్‌మీద దాడిలో చిక్కుకుపోయాడు...

'నా అనుభవాలన్నీ చెప్తాను—సత్యాన్ని త్యజించలేను!' అన్నాడు రోషంతో రానడే. 14 ఏళ్ల కారాగృహంలో గడిపిన రానడే చెప్పగలిగినవి ఎన్నో ఉంటాయి...

—తిరుమల్లి వెంకటనారాయణ.

# న్యూఢిల్లీలేఖ

(3వ పేజీ తరువాయి)

## చెక్ అమ్మాయిలు...

చెక్‌లో చాలామంది సోవియట్‌వారిని పట్టించుకోకుండా ఉండటానికి ప్రయత్నిస్తారు. కొందరు సోవియట్ ఆసఫీర్లు, సైనికులు చెక్ అమ్మాయిలని సమీపించగా అల్లర్లు జరిగాయి. కాని అల్లర్లు షాపులలో ఎక్కువ జరుగుతూ ఉంటాయి. అంగళ్లవారు సోవియట్లతో బేరం పెట్టుకోమంటారు. సోవియట్‌వారు కొత్తనోట్లని రెపరెపలాడిస్తూ ఉంటారు. ఈ నోట్లని రష్యన్లే ముద్రించారని అక్కడ వదంతి

## మహాత్మాగాంధీ ఉత్సవాలు

భారతదేశంలో మానవుడి హక్కులపట్ల గౌరవభావం ఉంది. ఈ ఏడు మహాత్మాగాంధి శతజయంతి ఉత్సవాలు జరుపుతున్నారు. కాని, చెకోస్లవాకియాలో రష్యామీద సత్యాగ్రహంతో కొందరు యువతీ యువకులు తమనితాము దగ్ధం చేసుకుంటూవుంటే మనవారు పట్టించుకొనటం లేదు. బహుశః శ్రీమతి గాంధి, ఆమె సలహాదారులు దానిని గురించి మాట్లాడటం మరొకదేశం అంతరంగిక వ్యవహారాలలో కల్పించుకొనటం అవుతుందని భయపడుతున్నారేమో!

చరిత్రకూడా విధిలాగే దేనినీ మర్చిపోదు. శ్రీ నెహ్రూ ఇంగ్లాండు, ఫ్రాన్సులని సూయజ్‌మీద దాడి జరిపినందుకు ఖండించారు,

## అప్పుడు హంగేరీ, ఇప్పుడు చెకొస్లోవాకియా

హంగరీమీద రష్యా దాడిచేసినప్పుడు మౌనంగా ఉండిపోయారు. మళ్లీ ఇప్పుడు రష్యా చెకోస్లోవాకియామీద దాడి చేసినప్పుడు భారతదేశం మాట్లాడలేదు. రష్యా దురాక్రమణ జరిపితేమాత్రం తప్పు లేదన్న మాట.

**కె. ఏ. ఎస్, ఖమ్మం**

మీరుట్టి గ్రాడ్యుయేటే నటగా?

అంతే. ఏ 'ముమువుల' మీదో డాక్టరేటుకి ప్రయత్నిద్దామని చూస్తున్నాను.

**ఎమ్. ఎక్. ఎమ్, ఏటికొప్పాక**

రామలక్ష్మిగారూ, మీరు ఇంతటి గొప్ప రచయిత్రి అగుటకు పునాదిరాళ్లు పుట్టి నింటివా? మెట్టినింటివా?

మేం పెంచిన ఈ సంసారిక భవనం స్వంత కృషి మూర్తిగారూ, పుట్టినింటిదీ మెట్టినింటిదీ ఏం లేదు.

**బి. ఎస్. బి, విజయవాడ**

సాహిత్యంలో మీరెంత కృషీవలులైనా శరత్ చంద్రుని సాహిత్యాన్ని నిందించే, విమర్శించే, శక్తి మీకు లేదు

ఉందన్నానా? నాకు నచ్చలేదన్నాను గాని, శరత్ బాబుగారూ!

**జి. వి. ఆర్. ఎమ్, దోనకొండ**

27—9-68 పత్రికలో ప్రతిసారి మీరే సమాధానాలిస్తున్నారు' అనే ప్రశ్నకి మీ సమాధానం ఎంతో విజ్ఞతతో కూడి ఉంది. విజ్ఞానం నీటి ఊటలాంటిది. ఎంత తోడినా నీరు అందులోంచి పెల్లుబుకుతూనే ఉంటుంది. మీరిచ్చే సమాధానాల్లాంటివే ఢిల్లీనుంచి వెలువడే 'షమా' ఉర్దూ పత్రికలో ఉంటాయి. అయితే షమా చదివి మీరు సమాధానాలిస్తున్నారని నేను భావించడం లేదు. ఏభాషలోనైనా సరే రచయితల అభిప్రాయాలు ఏదో ఒకచోట ఒకే విధంగా రూపొందుతాయేమో? ఏమంటారు?

భౌగోళిక, భాషా విభేదాలున్నా జీవిస్తున్న జీవితంలో జరిగే సంఘటనలలో పోలిక ఉండవచ్చును. మన కళాపూర్ణోదయానికి షేక్స్పియరు నాటకానికి పోలికలున్నాయని కనిపెట్టారు కదా! సమకాలిక జీవిత సమస్యలు, ప్రజల అనుభూతులు, అవస్థలు— ఏ దేశ రచయిత అయినా, అతడి భాషలో రాసినా ఒకలాగా స్పందింప చేయవచ్చును. తప్పేముంది?

**ఎమ్. ఎమ్. టి, కాకినాడ**

కొందరికి అదేమిటో తమవాగితోనే పడదు చూస్తూంటే ఆశ్చర్యంగా ఉంటుంది కదండీ?

గొడ్డలికి కర్రలాగా— స్వసంఘశత్రుత్వం ఉంటుంది కొందరికి!

**ఎస్. ఎస్. ఎల్, శ్రీకాకుళం**

నీకు పురస్కారం రాద్దామంటేనే ఏదో పనితో సరిపోతోందే, అక్కయ్యా, నీకుండే తీరుబాటులో సగం నాకిద్దూ?




తీసుకో చెల్లెలా, కాని పైవాళ్ల తీరుబాటు నువ్వేం చేసుకుంటావు??

**ఎస్. ఆర్, చీరాల**

రామలక్ష్మిగారండీ, నాకథ మీకు నచ్చిందా? నేను ఏనాటికైనా మీ అంతటి దానను (ఎత్తులోకాదు) సాహిత్యంలో కాగలుగుతానా?

నీ 'కాత్యాయిని కలలు' బాగుంది సోదరీ, ఎవరంతటి వారివో అవడం ఎందుకు? నీ అంతటి దానివి నువ్వు. గుడ్‌లక్.

**టి. జె. పి, నగరి**

ఏమండీ మీకు కండ్లు కనిపించటం లేదా పాపం. నేనొక ప్రశ్న రాస్తే ఇంత వరకు బదులీయలేదు. ఇది చాలా మోసం.

కళ్లు కనుపిస్తున్నాయి సోదరా, నీ ప్రశ్నే కనిపించలేదు! వైట్ ఎండ్ హోప్.

**బి. ఎస్. ఎల్, విశాఖపట్నం**

మీరు ఇంటి ఎడ్రసు చెప్పరా?

మీ ఉత్తరాలు అందాయికా? ఇంకా చిరునామా దేనికి?

మీ రెంతవరకు చదువుకున్నారు?

కాలేజి చదువయిపోయింది. ఇప్పుడే 'ఓనమాలు' ప్రారంభించాను!

**వై. ఎస్. ఆర్, సికింద్రాబాదు**

వాళ్లపిల్లను పెళ్లిచేసుకుంటే ఉద్యోగం యిప్పిస్తానని ఒకాయన అన్నారు......

ఉద్యోగం కోసం పిల్లని పెళ్లి చేసుకోవడం, ట్రాన్స్ఫరు కోసం కుటుంబనియంత్రణకి ఒప్పుకున్నట్టుంది. చేసుకోకండి.

బంధువులకంటె స్నేహితులే గొప్ప వారంటాను......

నిజమే...'సృష్టిలో'చల్లనిది' స్నేహమేనోయీ' అన్నారు గాని 'చెల్లనిది' అనలేదు!

**బి. డి. విజయవాడ**

నాకు స్నేహితులంటే అసహ్యం వేస్తోంది రామలక్ష్మిగారూ.

'నువ్వు సృష్టిలో చెల్లనిది స్నేహమే' నంటూ పాడుకో దేవీ.

**ఆర్. ఆర్, మాచర్ల**

మీ పెద్ద కుమారుడా? కూతురా? ఏం చదువుతున్నారు!

నా పెద్ద పెంపుడు కొడుకు. ఉద్యోగం చేస్తున్నాడు.

**పి. ఏ. ఎస్. పి, హైదరాబాదు**

'క్షేమంగా వెళ్లి లాభంగా రా' అని దీవించడం నేటి కాలమాన పరిస్థితుల దృష్ట్యా దోషమేమో?

పోని 'క్షేమంగా వెళ్లి క్షేమంగా రా'అని దీవిస్తే?

**ఎమ్. జె. జె, బరంపురం**

'బ్రాహ్మడినేగాని వడుగు చేసుకో లేదు, పెళ్లి చేసుకొన్నా భార్య మెడలో తాళి కట్టలేదు' అని రాసేరుకదా ఆయన బ్రహ్మ సమాజ మతస్థులా?

వారికీ ఏకేశ్వరోపాసన ఉంటుంది. బ్రాహ్మణ కులంలో పుట్టినా వాదస్తం లేదని, రిజిస్టర్డ్ మేరేజి చేసుకున్నాననీ ఆ వాక్యానికి అర్థం చెప్పుకోవచ్చుగా?

**వి. మ. ల, బరంపురం**

మానవుడు ఈ యూనివర్స్‌లో ప్రాముఖ్యం లేనివాడేఅయినప్పటికీ యింత గర్వమదాంధకారమెందుకు? ముఖ్యంగా పురుషులకి?

మనిషికి లక్షణం అది. తన అల్పత్వాన్ని కప్పిపుచ్చుకుందుకు గర్వమదాంధకారాల మేలిముసుగు ధరిస్తూ ఉంటాడు. దీనికి స్త్రీ పురుష విచక్షత దేనికి? ఎలా ఉన్నారు? చాలా రోజులైంది పలకరించి. అవునా?

**పి. ఎస్. ఆర్. ప్రసాద్, శ్రీకాకుళం**

ఈ ప్రశ్నావళిపై మీ అభిప్రాయం ఏమిటి?

అందరం కలిసి కబుర్లు చెప్పుకుంటున్నాం అని. ఊహలు కలబోసుకుంటున్నాం అని. బాగుంటోందని!

**పి. ఆర్. ఆర్, అనంతపురం**

మీరు పండగలు పబ్బాలు ఆచరిస్తారా?

'నాకు గాదులు లేవు రసస్సులు లేవు' అంటూ కవిగారి లాగా ఊరుకోవటం మీ ఉద్దేశ్యం.. కొత్త బట్టలూ, పిండివంటల కోసమైనా పిల్లలకీ మనకీ పండుగలు ముఖ్యం కదటండీ.

# అసలు కథ

వేష్ణ



'రాజ్యం, ఏయ్ నిన్నే' పిలుపు. పిలుపు విని టకటకమని చప్పుడు. ఒకదానివెంట ఒకటి రాజ్యం చెప్పుల చప్పుడు. పతిదేవుడు రాగానే తెలిసిపోయింది ఉత్సాహంతో చటుక్కున తెక్కుకు తప్పుకొని పక్కన నవ్వేసింది రాజ్యం. తలుపు తీయకుండానే భార్యామణిని కౌగలించుకోవాలనుకొన్న సుబ్బారావు తన ఆశ వ్యర్థంకావటంలో ఉసూరుమని అంతలోనే నవ్వుతెచ్చుకొని రాజ్యం చేతిలో పూలపొట్లంపెట్టి టవల్ తీసుకొని స్నానం చెయ్యటానికి వెళ్లిపోయాడు.

భర్తకి కాఫీ, టిఫిన్ అమర్చి తను పూలమాల కడుతూ కూర్చుంది. సుబ్బారావు తడితువ్వాలుతో మొహం తుడుచుకొంటూ కుర్చీలో కూర్చుని ఉప్మా ప్లేటు అందుకొన్నాడు. 'ఉత్తరాలేమైనా వచ్చాయా ?' అన్నాడు సుబ్బారావు. 'మావాళ్లదగ్గర్నుంచి వచ్చింది' అంది రాజ్యం మాలకట్టటం పూర్తిచేసి జడలో పెట్టుకొంటూ. 'ఏమని రాశారో చెప్పు. ఇప్పుడు నేను చదవలేను' అన్నాడు సుబ్బారావు కాఫీ తాగుతూ. 'నన్ను పంపించమన్నారు నోములకి శ్రావణమాసంలో.'

'మొన్ననేగా వచ్చింది దేవిగారు— ఐనా ఆడవాళ్లకి అంత మమకారం ఉండకూడదు పుట్టిళ్లమీద.'

'మొన్న ఏమిటి మార్చిలో వచ్చాను తెలుసా!' అంది అభిమానంగా రాజ్యం.

'సరేగాని రాజా, ఈపూట ఏదైనా పిక్చర్‌కి పోదామోయ్' అన్నాడు సుబ్బారావు.

'ఇప్పుడా?! వంట ఎవరికి అప్పచెబుదామంటారు?' అంది రాజ్యం నవ్వుతూ.

'వచ్చేటప్పుడు హోటల్‌లో తిందాంలే బయల్దేరు' అన్నాడు. 'ఇదిగో ఐదు నిముషాలు' అంటూ లేచింది రాజ్యం.

* * *

మర్నాడు మబ్బు మబ్బుగా ఉంది ఆకాశం. సన్నగా తుంపర పడుతూనే ఉంది ఉదయం నుంచి. సాయంత్రం భర్త వచ్చే వేళకి తెల్లచీర కట్టుకుంది రాజ్యం. బారుగా వాలుజడ అల్లుకొని సన్నజాజుల మాల పెట్టుకొంది.

నిముషాలు దొర్లిపోతున్నాయి. చాలా ఆలస్యంగా — ఎనిమిది గంటలవేళ వచ్చాడు సుబ్బారావు. రాజ్యం పలకరించకుండా కూర్చుంది కోపంగా. భార్య సింగారం సుబ్బారావు గుర్తించిన జాడేమీ కనిపించలేదు. మాట్లాడకుండా స్నానం చేసి అన్నంతిని పక్క ఎక్కి పడుకున్నాడు. రాజ్యం ఆశ్చర్యపోతోంది. పెళ్లై మూడు నెలలన్నా కాలేదు. ఇంతవరకూ ఈ విధమైన ప్రవర్తన ఎరగని రాజ్యం హడలిపోయింది. ఏమీ అర్థంగాలేదు. ఆలోచనలతో సతమతమవుతూ నిద్రాదేవితో రాజీపడిపోయింది.

పక్కమీద పడుకొన్న మాటేగాని నిద్రాదేవి సుబ్బారావు ఛాయలకు కూడా రాలేకపోయింది.

సుబ్బారావు మనస్సు ఆలోచనలతో కుతకుతలాడిపోతోంది. ఎంతమోసం! ఏమీ ఎరుగని దానిలా రాజ్యం ఎంత మోసం చేస్తోంది. ఈ విషయం పుస్తె చేతుల్లో ఉన్నప్పుడు తెలిసినా తను జాగ్రత్త పడేవాడే! ఐపోయింది. సర్వనాశనం ఐంది తన బ్రతుకు. తనభార్య మనసారా తన్నే వాంఛించాలని ఆశించడమే తననేరమైపోయింది. హు...రామం! కోపంతో పళ్లు కొరుక్కున్నాడు సుబ్బారావు. ఎంతో మంచివాడిగా నటిస్తూ తనతోపాటు తిరుగుతున్న రామం తన జీవితం నాశన మవటానికి కారణం అని ఇప్పుడు తెలిసింది. వెధవ! తడిగుడ్డతో గొంతుకోసే రకం? ఇద్దరూ

ఇద్దరే నటనకి. ఉత్తమనటులు కసితో అనుకొన్నాడు. రేపే అసలు విషయం తేల్చుకోవాలి. అనుకొంటూ రాజ్యం ఏంచేస్తోందో అని పక్కకి చూశాడు. తెల్లబట్టలు, తెల్లటి పూలతో అమాయకంగా నిద్రపోతూ కనిపించింది. మరుక్షణంలో అది అమాయకత్వం కాదు రాక్షసత్వం అనిపించింది. ఆలోచనలతో అలాగే నిద్రపోయాడు సుబ్బారావు.

* * *

ఉదయం లేచిందగ్గర్నుంచి ముభావంగానే ఉన్నాడు సుబ్బారావు. ఆఫీసు టైం కాకపోయినా భోజనంచేసి వెళ్ళిపోయాడు రాజ్యం భోజనం చెయ్యలేదు. చెయ్యలేక పోయింది. రాత్రి నుంచి భర్త తనతో మాట్లాడకపోవటం భయం పుట్టిస్తోంది.

'హల్లో! సుబ్బారావు ఏమిటి నిన్న నేను స్నానంచేసి వచ్చేలోగా మాయమయ్యావు' అన్నాడు రామం ఆప్యాయంగా స్నేహితుడి చెయ్యిపట్టుకొని. ఆపట్టు నాగుపాము పట్టులా తోచింది సుబ్బారావుకి. రామం ఉచ్ఛ్వాస నిశ్వాసలు అతనికి బుసలుగా వినిపించాయి. మొత్తానికి అతని కళ్ళకి రామం మూర్తీభవించిన నాగుపాములా కనిపించాడు. చెయ్యి విడిపించుకొంటూ మామూలుగా నవ్వాడు. 'ఏం లేదోయ్, ఆఁ. అన్నట్టు ఈరోజు నువ్వు మాఇంటికి రావాలి' అన్నాడు సుబ్బారావు.

'ఏమిటి విశేషం.'

'పనుంది' అంటూ తన సీట్లోకిపోయి కూర్చున్నాడు సుబ్బారావు.

సుబ్బారావుని ఓక్షణం చూసి రామం కూడా తన సీట్లో కూలబడ్డాడు.

* * *

సాయంత్రం స్నేహితులిద్దరూ సుబ్బారావు ఇంటికివచ్చారు. రామం బెరుకుగా వరండాలో నిల్చుంటే సుబ్బారావు చనువుగా లోపలికి తీసుకువెళ్ళాడు.

'రాజ్యం, నా ఫ్రెండ్ రామం' అని భార్యకి పరిచయం చేశాడు సుబ్బారావు జాగ్రత్తగా ఇద్దరి మొహాల్లోని భావాలు చూస్తూ.

'నమస్తే' అని రాజ్యం అంటే ప్రతి నమస్కారం చేయబోయిన రామం చేతులు అలాగే మధ్యలో వాలిపోయాయి. అతనికళ్ళు ఆశ్చర్యంతో వెడల్పయినాయి. ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నట్టు పెదవులు అస్పష్టంగా కదిలాయి.

రాజ్యం వైపు చూశాడు సుబ్బారావు. మామూలుగా, చాలా మామూలుగా కుర్చుని 'టీ' కలుపుతోంది. మొహంలో ఎలాంటి భావాలు వ్యక్తం కావటం లేదు. టీ కలపటం పూర్తిచేసి ఒక కప్పు రామానికిచ్చి మరో కప్పు సుబ్బారావు కిచ్చి తనోకప్పు తీసుకొంది. రామం కొంచెం తేరుకొన్నాడు కానీ అతనిలోని ఆదుర్దాను, విస్మయాన్ని, కనిపెడుతూనే ఉన్నాడు సుబ్బారావు. సుబ్బారావు అడిగిన వాటికి అన్యమనస్కంగా జవాబిస్తూ పరధ్యానంగా రాజ్యాన్ని చూస్తున్నాడు. అతని చూపుల్లో పాత జ్ఞాపకాలను త్రవ్వుకొంటున్న సూచనలు కనిపించాయి. ఏవో మామూలు మాటలు తప్పించి పెద్ద సంభాషణ ఏమీ జరగటం లేదు. ఆ పరిస్థితి ముగ్గురికీ ఇబ్బందిగానే ఉంది. మరో పదినిముషాలు నిశ్శబ్దంగా గడిచి పోయాయి. హఠాత్తుగా లేచి నిలబడి 'నేను వెళ్తానోయ్' అన్నాడు రామం. మౌనంగానే గేటువరకు సాగనంపాడు సుబ్బారావు. లోపలికొచ్చాడు సుబ్బారావు. రాజ్యం వైపు చూశాడు. ఏదో ఆలోచిస్తోంది రాజ్యం. మౌనంగా కుర్చీలో కూర్చుని పేపర్ చూస్తూ అనుకున్నాడు సుబ్బారావు. ఈ ఆడవాళ్లెంత తెలివి ఐనవాళ్ళు. ఆహా రాజ్యం నీ నటన మెచ్చుకోతగ్గదే! కానీ నీ రహస్యం నాకు తెలిసిపోయింది కాబట్టి నేను మోసపోను...

హఠాత్తుగా పేపర్ మూసేస్తూ సూటిగా రాజ్యం కళ్ళలోకి చూస్తూ 'నీతో నేను కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి' అన్నాడు. భర్త అంత హఠాత్తుగా అంత కొత్తగా మాట్లాడుతుంటె తెల్లబోయిన రాజ్యం తల ఊపింది అయోమయంగా.

'నన్నెందుకింత మోసం చేశావు?'

అదిరిపడింది రాజ్యం.

'బహుశ ఈ విషయాన్ని నీవంత సీరియస్‌గా తీసుకొని ఉండకపోవచ్చు. అది నా కనవసరం. కానీ కనీసం నా జీవితంలోకి ప్రవేశించేటప్పుడైనా ఈ విషయాన్ని గురించి నీ వెందుకు ఆలోచించలేదు. పసిపిల్లలలానే భావించాలా? ప్రేమా, పెళ్ళి గురించి.'

నిశ్చేష్ట అయింది రాజ్యం. ఆమెకి భర్త మాట్లాడుతున్నదేమిటో అర్థం కాలేదు.

'మీరు మాట్లాడేదేమిటి?' అంది తడబడుతూ.

'తెలుగు' ఆపుకోలేని కోపం వచ్చింది సుబ్బారావుకి. ఐనా తమాయించుకొన్నాడు. కాలాన్ని జరిపి ఆవేశాన్ని చల్లార్చగలరీ ఆడవాళ్ళు. 'ఓహ్. రాజ్యం నువ్వెంత తెలివిగలదానివైనా తప్పటడుగువేశావు. అది ఒప్పుకో అనవసరంగా వృథాప్రయాసపడక.'

'మీరనేదేమిటో నాకు నిజంగానే అర్థం కావటంలేదు. మోసం చెయ్యటమేమిటి? ఏ విధంగా మోసం చేశాను మిమ్మల్ని.' అప్పటికే కన్నీళ్ళు ధారలు కట్టాయి. భయం, దుఃఖం గుండెల్లో కొట్టుమిట్టాడుతున్నాయి.

కాపరానికి వచ్చాక ఇంతవరకు కన్నీళ్ళు పెట్టుకోలేదు రాజ్యం. సుబ్బారావు మనస్సు ఒక్కక్షణం జాలితో నిండిపోయింది. మరుక్షణం తేరుకొని కోపంగాచూస్తూ 'రామం విషయంలో నన్ను మోసగించలేదా నువ్వు?' అన్నాడు

'రామం విషయమా!!!'

'ఔను! ఇంకా నటించకు రాజ్యం, వ్యర్థమౌతుంది. నా కంతా తెలుసు. నీ ప్రణయం నీకు తప్పుకాకపోవచ్చు. కానీ ఆ విషయం నీవు ఒక్కసారన్నా ముందుగా చెప్తే నా బ్రతుకులో నిప్పులు పోసుకొనే వాణ్ణికాదు. నేను సామాన్య మానవుణ్ణి. నా ఆశ తప్పని నేను అనుకోవటం లేదు. నా భార్య నన్ను ప్రేమించాలి అనుకోవటం తప్పని ఎవరూ అనరు. అందులో తన భార్య స్వచ్ఛమైన కన్నెపిల్ల అయిఉండాలని ప్రతి మగవాడు ఆశించుతాడు. ఇంక నీ జవాబుకోసం నేను వేచి ఉండక్కర్లేదు. 'నన్ను క్షమించండి' అంటావు. కానీ అది నావల్లకాదు. నా నిర్ణయం తెలియచేస్తున్నాను. మనం కలిసిఉండటం అనేది కల్ల! ఆ తరువాత నీఇష్టం.' ఆయాసంగా వగర్చాడు. మళ్ళీ పేపర్లో మునిగిపోయాడు.

రాజ్యం బొమ్మలా నుంచున్న దల్లా ఒక్కసారి చైతన్యస్రవంతియై భర్తపాదాల దగ్గరకు పరిగెత్తి 'నాకేం తెలియదండి నన్ను క్షమించండి' అంది ఏడుస్తూ.

ఏవో చల్లని హస్తాలు తనను లేవ

నెత్తుతుంటే భయంగా తలెత్తింది. నిర్మల మైన చిరునవ్వుతో రాజ్యాన్ని దగ్గరకు తీసుకొంటూ 'నిజంగా తప్పుచెయ్యనప్పుడు క్షమాపణ కోరుకోవటం ఒక పెద్ద తప్పమ్మా' అంది ఆవిడ.

ఉలిక్కిపడ్డాడు సుబ్బారావు. ప్రక్కనే రామం. ఆమె రామం భార్య సీత. బిగుసుకుపోయాడు సుబ్బారావు. ఇప్పుడెందుకు వచ్చినట్టు వీళ్ళు. ఐనా ఇప్పుడేగా రామం వచ్చివెళ్ళింది. అయోమయంగా ఉంది సుబ్బారావుకి.

రామం, సీతా కూర్చున్నారు. సీత తన పక్కనే కూర్చోబెట్టుకుంది రాజ్యాన్ని. 'రాజ్యం పరిస్థితి అంతకన్నా ఘోరంగా ఉంది. తమ గొడవల్లో వీళ్ళెందుకు వచ్చారో. అయనమాటలకి తనగుండె ఎందుకు ఆగిపోలేదో, తన ఊపిరి ఎందుకు ఆగిపోలేదో ఆమెకి అంతపట్టలేదు.

చీకటి పడింది. వాతావరణం ప్రశాంతంగా ఉంది. దారుణమైన నిశ్శబ్దాన్ని చీల్చుకొని రామం మాట్లాడాడు. 'సుబ్బారావు నీకు చాలా సంగతులు చెప్పాలోయ్. ఇందాకే నేను చెప్పాల్సింది ఇవన్నీ. కానీ నేను పిరికిగా వెళ్ళిపోయాను. ఇంటి కెళ్ళాక సీత కేకలేసి వెంటనే తీసుకొచ్చింది. సరే ఇంక మొదలుపెడతాను. నేను బి. ఎ. థర్డ్ ఇయర్‌లో ఉండగా గోవిందరావుగారు మా ఇంటిప్రక్కన ఉండే వారు. వారి కుటుంబానికి మాకు చాలా

# అసలు కథ

స్నేహం ఉండేది. గోవిందరావుగారు ఎప్పుడూ అంటూ ఉండేవారు 'నాకే గనక ఓ కూతురు ఉంటే నీకిచ్చేవాణ్ణోయ్' అని. నేను నవ్వేవాణ్ణి. ఇలా రోజుకు ఒకసారన్నా అలా అంటం ఆయనకి ఇష్టం. ఒకరోజు ఆయన భార్య కూడా అక్కడే ఉంది. ఆయన అలా అనేసరికి ఆవిడ నవ్వుతూ 'పోనీ మీకు లేకపోతే ఏం, రాజా నివ్వరాదు. రాజా కూడా మీ కమ్మాయే ఔతుందిగా,' అని అంది. ఆయన ఆలోచిస్తూ 'నిజమే' అన్నారు. నాకు ఆ రాజెవ్వరో అంతుపట్టలేదు. నేను పట్టించుకోలేదు. రోజులు గడిచి పోతున్నాయి. ఒకరోజు ఆయన ఒక ఫోటో తీసుకొచ్చి మా ఇంట్లో వాళ్ళకి ఇచ్చారు. ఆ రాత్రి మా అమ్మ నాకు ఆ ఫోటో ఇస్తూ 'గోవిందరావుగారు ఇచ్చార్రా, వాళ్ళ అన్నగారమ్మాయి' అంది. నేను ఫోటో అలాగే తీసుకొని నా గదిలోకి వచ్చేశాను. చాలాసేపు ఆ ఫోటో చేతిలో పెట్టుకొని చూశాను. కాంతులీనుతూ చూసే చూపులు, రాబోతున్న నవ్వును పెదవులలో బిగించి నవ్వుతూ నన్నే చూస్తున్నట్లనిపించింది. మొత్తానికి ఆ ఫోటోలో అమ్మాయి చాలా బాగుంది. క్రింద రాజా బి. ఏ అని రాసుంది. చాలా సేపు చూసి చివరికి పుస్తకాల బీరువాలో పెట్టాను. రోజులు గడిచిపోతున్నాయి. గోవిందరావుగారు ఫోటో అడగలేదు. మేం ఇవ్వలేదు. నా పెళ్ళి సంగతి కదిపితే ఉద్యోగం రానివ్వండి అన్నారుట మా వాళ్ళు: ఇంతలో పబ్లిక్ పరీక్షలు వచ్చాయి. నేను పరీక్షల గొడవలో ఉండగానే గోవిందరావుగారికి ట్రాన్స్‌ఫర్‌రావటం ఆయన వెళ్ళిపోవటం జరిగింది. అంతే క్రమంగా ఆ విషయం మేమందరం మర్చిపోయాం. నాకు ఇక్కడే యల్.ఐ.సి. లో ఉద్యోగం వచ్చింది. వెంటనే సీతతో నా పెళ్ళైపోయింది. సీత కాపురానికివచ్చిన కొత్తల్లో'...ఆగి సీతవంకచూసి నవ్వేడు రామం. సీత చిరుకోపంతో చూసింది రామంవైపు. రామం మళ్ళీ ఆరంభించాడు, 'ఆ కొత్తల్లోనే ఒకరోజు పుస్తకాల బీరువా తీసి సర్దుతూ ఒకఫోటో బైటపడగా అది చూసి స్తంభించిపోయింది. ఇంక ఆ పరసలో వారంరోజులు నాతో మాట్లాడలేదు. ఆఖిన్ని బతిమాలి ప్రసన్నురాలిని చేసుకునే సరికి బ్రహ్మప్రళయమైంది. నేను ఎంత చెప్పినా నమ్మలేదు. ఆఖరికి మా అమ్మ చేత సాక్ష్యం ఇప్పించక తప్పలేదు. మా మధ్య ప్రళయం తెచ్చిన ఫోటోని నేను చింపెయ్యబోతే సీత వద్దని నివారించింది. 'అది మన కలహానికి చిహ్నంగా ఉంటుంది. ఎవరో ఈ అమ్మాయి నాకు మంచే చేసింది' అంటూ ఆల్బంలో జాగ్రత్త చేసింది. క్రమంగా ఆఫీసులో మన ఇద్దరి మధ్య స్నేహమైంది. నిన్న నీవు వచ్చిన వాడివి నేను వచ్చేవరకైనా ఉండకుండా చెప్పకుండా రావటం మా ఇద్దరికీ చాలా ఆశ్చర్యం కలిగించింది. టేబిల్‌మీద ఆల్బం ఉన్నా అప్పుడు మాకేమీ అనిపించలేదు.

ప్రొద్దుట నీ ప్రవర్తన నాకు చాలా ఆశ్చర్యమనిపించింది. అనుకోని నీ ఆహ్వానం నన్ను సందిగ్ధంలో పడేసింది. దానికి తగ్గట్టు నీవు మీ శ్రీమతిని పరిచయం చేశావు. అంతే నేను ఏమిచూస్తున్నానో నాకే అర్థంగాలేదు. మీ శ్రీమతిని చూసి స్తంభించి పోయాను. నా కళ్ళు నన్నే మోసం చేస్తున్నాయేమో అనిపించింది. అవే కళ్ళు, ఆమే, సందేహంలేదు ఆ ఫోటోలోని అమ్మాయి ఈమే. అంతులేని ఆశ్చర్యంతో దిమ్మెరపోయాను.



నా సందేహం తీరిన కొద్దీ ఆశ్చర్య పోయాను. వెంటనే చెప్పాలనిపించింది. కానీ ఈ సంగతి మీకు తెలియదుకదా? తెలియని వాళ్ళకి ఇందులో భాగమెందు కులే. అదికాకుండా నీవేమైనా అపార్థం చేసుకొంటావేమోనని చెప్పలేదు. వెంటనే ఈ సంగతి సీతకి ఎంత త్వరగా చెబుదామా అని వెళ్ళిపోయాను, తీరా ఇంటికెళ్ళి తనతో చెప్తే రెండు నిమిషాలు ఆలో చించి 'మీరు చాలా పొరబాటు చేశారు మీ స్నేహితుడు బహుశ నిన్న ఫోటో చూసి ఉంటాడు. అపార్థం చేసుకొన్నాడు. అందుకే ఈ పూట మిమ్మల్ని పిలిచాడు కానీ పాపం ఆ అమ్మాయి ఎంతో బాధ పడుతూ ఉంటుంది. ఈపాటికి వాళ్ళిద్దరి మధ్య అవాంతరం వచ్చి ఉంటుంది. వెంటనే మనం అక్కడికి వెళ్ళాలి' అని ఇక్కడి తీసుకొచ్చింది. అంటూ ఆగి దీర్ఘంగా నిట్టూర్చి అందరివైపు చూసి 'వచ్చినందుకు వృథాపోలేదు. నీవు చాలా ఆవేశపరుడవోయ్...' అంటూ స్నేహ పూర్వకంగా నవ్వేడు రామం సుబ్బారావు కేసి చూసి.

ఇంత సేపటికి సుబ్బారావు, రాజ్యం ఆశ్చర్యం నుంచి తేరుకొన్నారు. సుబ్బారావు రాజా కేసి చూశాడు. అమాయకత్వంతో మూర్తీభవించినట్లుంది.

'దీన్నిగురించి నీ కేమి తెలియదు కదమ్మా' అంది సీత రాజ్యంతో.

'ఊహూఁ. ఫైనలియర్‌లో ఉండగా నా ఫోటో ఒకటి పంపమని రాసింది పిన్ని. నేను పంపాను. అంతే ఆ తరువాత నేనా సంగతే మర్చిపోయాను' అంది రాజ్యం.

'చూశావుటోయ్. ఇది అసలు సంగతి!' అన్నాడు రామం. అందరూ ఒక్కసారి నవ్వేశారు.

'అసలుకథ తెలుసుకోకుండా హడావుడి చేస్తారు మీ మగవాళ్ళు' అంది సీత.

మిగతావాళ్ళంతా నవ్వేసుకుని ఊరు కున్నా, నూతన వధువులు మాత్రం ఊరు కోకండి. మీ ఫోటోలు ఏమైనా పాత పెళ్ళికొడుకులదగ్గరుంటే అది మీబాధ్యత కాదని వరులకి చెప్పేసెయ్యండి. లేకపోతే అనక చాలా చిక్కులు వస్తాయి. ●

# వారఫలం

## 14-2-1969 శుక్రవారం మొదలు 20-2-1969 గురువారం వరకు

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభించగలవు. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**వృషభం:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు—బంధువులకు సహాయం చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మిథునం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మ తగదు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి అధికవ్యయం జరుగుతుంది

**సింహం:** వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో అన్నివ్యవహారాల్లోను చికాకులు యేర్పడగలవు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కన్య:** మీకు ముమ్మందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి. పోటీదారులతో వాదప్రతివాదాలు తగవు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు—నూతన వివరాలను తెలుసుకొంటారు. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**తుల:** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది ఆర్థిక వ్యవహారాల్లో మొహమాటాలు తగవు. వారంమధ్యలో వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఇతరులకు సహాయం చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**ధనుస్సు:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మకరం:** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. మీ విలువైన వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారంమధ్యలో అనుకూలత లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మీనం:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సమయానికి రెండింతలుగా డబ్బు చేతికి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. వారంమధ్యలో అన్నివ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—నూతన వివరాలను తెలుసుకొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి

—మహేష్

# మహా నటులు


ఇదేంటి బాబాయ్ ఇట్లా అంటావ్! నేను సిగరెట్ తాగటం నువ్ చూశావా! ఛఛ! అసలు నాకు అటువంటి పాడు అలవాట్లే లేవు!


సారీ లలితా! ఇవాళ కూడా లేటయింది! ఎక్కడా - ఆఫీస్ పని ఎంత సేపు చేసినా అయితేగా!


హాహ్హాహా! అబ్బ పొట్ట చెక్కలైపోతూంది!
ఇదేంటి చెప్మా! నేనేం విట్టు వెయ్యలేదే?!


రాత్రంతా ఒకటే జరం మాష్టారూ! అందుకే పొంయుదవలేకపోయా!


సారీరా! నిన్న పార్టీకి రాలేకపోయాను! నిన్న మా నాన్నకి జబ్బు సీరియస్ గా వుంది. అందుకని....


పెళ్ళయింతరువాత నా ప్రాణం హాయిగా వుంది! పనంతా మావిడే చేసుకుంటుంది!

సీరియల్

# సురేఖా పరిణయం

ఉన్నవ విజయలక్ష్మి

## జరిగిన కథ

సురేఖ లాయరు రమణమూర్తిగారమ్మాయి. సురేఖ కంటె తర్వాత ఇద్దరు ఆడపిల్లలూ మూడ వంచ్చ ఒగా వుంటారు. ఆమె కంటె మూడేళ్ళు చిన్నది ఉమ. సురేఖ మాత్రం చామన చాయగా సామాన్యంగా వుంటుంది. రామకృష్ణ ఆమెకు మేనత్త కొడుకు. చిన్నప్పటి నుంచి అతని మీద ఆశలు పెంచుకున్నది సురేఖ. రుక్మిణమ్మగారు అందంగా వున్న ఉమని కోడలుగా చేసుకోవాలనుకుంటుంది. రామకృష్ణకీ ఉమనే చేసుకోవాలని వుంటుంది. అందుకు తలిదండ్రులు కూడా సమ్మతించడంతో సురేఖ చాలా బాధపడుతుంది పెళ్ళికంటె ఉద్యోగం చేసుకోవడం సుఖమనిపించిన సురేఖ ఎలాగో కష్టపడి ఉద్యోగం సంపాదించుకుంటుంది. ఉమకి పెళ్ళయి పోతుంది. ఆమె పురుడు పోసుకున్నట్టు [illegible]

# 8

అన్నట్టుగానే శ్యామల పదిరోజుల సెలవు సంపాదించింది - శుక్రవారం సాయంకాలం సరికే బట్టలుఅవీ సర్దేసుకుని తయారయి పోయారు.

శనివారం మధ్యాహ్నం మాధవ్ ఆఫీసు నుండి వస్తూ శ్యామలనీ వాళ్ళనీ ఎక్కించుకుని ఇంటికి తీసుకువెళ్ళాడు.

చంద్ర పరీక్షలు కాలేదు కనక అతనింట్లో వుండిపోవాలని మొదట నిర్ణయించుకున్నారు—కాని ఈలోగా— తండ్రికి జబ్బుగావుందని ఇంటినుంచి వుత్తరం రావటంవల్ల వారం రోజులలో వస్తాను అని రెండురోజుల క్రిందటే అతను వూరికి వెళ్ళాడు—ఆ రెండురోజులనుంచీ వంటపని శకుంతలమ్మ మీద పడింది.

'ఇక్కడికి వచ్చి నువ్వు పనిచెయ్యటం ఏమిటి ? క్యారియరు తెప్పిస్తాను.' అని మాధవ్ అన్నాడు కాని,

'వయమే నేనేం పాటుపడాలి — నాకు ఈ కాస్త వంట ఒక లెక్కా — సరోజ మాత్రం రేపు పెళ్ళయితే మొగుడికి వండి పెట్టుకోవద్దూ ?' అంటూ వంటగదిలో నాలుగుమూలలా ఏమేమివున్నాయో చూసుకుని వంటకి వుపక్రమించింది.

'ఈ కూర సరోజచేసింది—మామయ్యకి మరి కాస్త పెరుగుపచ్చడి వెయ్యి.' అంటూ అటు తమ్ముడినీ ఇటు కూతుర్నీ సన్నిహితం చెయ్యాలని చాలా తాపత్రయపడింది — అసలు ఇలాంటి అవకాశం రావటం. సరోజ ఇల్లు ఎంత చాకచక్యంగా దిద్దుకోగలదో తమ్ముడికి తెలియటం శుభసూచకమే అనుకుంది.

'మేమున్నన్నాళ్ళూ నువ్వూ ఇక్కడే వుండిపోరాదుటే.' అని శ్యామలతో మొదటి రోజున అన్నప్పుడు 'ఇక్కడ్నించి మా ఆఫీసుకి బోలెడు దూరం బాబూ, పోనీ మామయ్య దిగబెడతా డనుకుంటే తను ఎనిమిదింటికే వెళ్ళిపోతాడు — అందరం కలిసి సరదాగా తిరుగుతున్నాంగా, ఎక్కడుంటే ఏమిటి.' అని ఆ అమ్మాయి సమాధానం చెప్పడంకూడ బాగనే వుంది అనుకుంటూ సంబరపడింది—

మాధవ్‌వాళ్ళూ వచ్చేసరికి ఇన్నిపూరీలు బంగాళా దుంపల కూరా పెరుగు గారెలూ తయారుచేసి వుంచారు తల్లీ కూతురూ కలిసి.

'నే నివాళంతా ఇంట్లోనే వున్నాను— ప్రొద్దుటే రావలసింది — శ్రమంతా మీ ఇద్దరిదీ, అయింది.' అంది సురేఖ నొచ్చుకుంటూ.

'ఆ ఫరవాలేదు.' అంది సరోజ ప్లేట్లలో వడ్డిస్తూ.

'ఆ గిన్నెల్లో వన్నీ ఇప్పుడు తినటానికేనా.' వెక్కిరింపుగా అన్నాడు మాధవ్.

'తిన్నన్ని తింటారు—మిగిలినవి క్యారియరులో పెట్టుకుందాం.' అంది శకుంతలమ్మ.

'ఏం ? బెజవాడలో అన్నం దొరకదనుకుంటున్నావా ?'

'దొరికినా దొరక్కపోయినా ఇవాల్టికి నా కింకేమీ అక్కర్లేదు. మీ ఇష్టం ఏం తిన్నా సరే.'

'మామయ్య మాటలకేంగాని, అన్నీ పట్టుకెళ్దాం — దారిలో ఆకలేస్తే తినొచ్చు.' అంది శ్యామల కూరలోవేసిన కారానికి ఒగరుస్తూ.

'నీ కసలు బుద్ధిలేదు — నువ్వు తినకుండా వుండాలని వాళ్ళు అంతకారం వేసేసినా ఇంకా అవే తింటానంటావు.' వాళ్ళిద్దరికీ కజ్జా పెట్టబోయాడు మాధవ్.

'కారంలేదు బాగున్నాయి.' అందిసురేఖ.

'ఈ మాత్రం లేకపోతే బాగుండదు.' అంది శ్యామల.

సరదాగా ఖబుర్లు చెప్పుకుంటూ తెమిలేసరికి మరో అరగంట పట్టింది.

విజయవాడ చేరేసరికి రాత్రి ఎనిమిది దాటింది—హోటలుముందు కారాపి మేనేజరుతో మాట్లాడటానికి లోపలికి వెళ్ళాడు మాధవ్ — కాస్సేపటి తరువాత హోటల్ బాయివచ్చి సామాన్లు తీసుకు వెడుతూంటే అందరితో పాటు అతనివెంట బయలుదేరిన సురేఖకి ఏమిటో భయంగా బిడియంగా అనిపించింది.

మాధవ్ బుక్‌చేసినవి రెండుగదులు అని తెలియగానే హమ్మయ్య అనుకుంది— ఆడవారంతా ఒకగదిలో సర్దుకున్నారు—అతనింకొకగదిలో వున్నాడు.

దారిలో మళ్ళీ ఓసారి కడుపునిండా టిఫిన్ తీసుకోటంవల్ల ఎవరికీ ఆకలిలేదు. — ఇంక ఆ పూటకి భోజనం ప్రసక్తి లేదు—మార్చినెలలోనే విజయవాడ పట్నం తన తడాఖా రుచి చూపిస్తోంది—స్నానాలు

చేసి కాస్సేపు అలా చల్లగాలిలో తిరిగిరావా లని బయల్దేరారు.

'కూల్ డ్రింక్సు తీసుకుందాం రండి.' అంటూ ఓ ఐస్ పార్లర్‌లోకి దారితీశాడు మాధవ్—ఒకరు ఆరెంజి—ఒకరు ద్రాక్ష రసం మరొకరు మజ్జిగ ఎవరికి కావలసి వవి వాళ్ళు ఆర్డరిచ్చారు.

ఆఖర్ని బాయ్ బిల్లుతెచ్చి టేబిలుమీద పెట్టగానే గబుక్కున తీసుకుని పిడికిటిలో పెట్టుకుంది సురేఖ.

'ఇదేంపని—మీరు నా గెస్టు.' మాధవ్ బిల్లుకోసం చెయ్యిజాపుతూ అన్నాడు.

'తక్కువే కదండీ.' పర్సు తెరుస్తూ అంది సురేఖ.

'తక్కువైనా, ఎక్కువైనా మీరివ్వ టానికి వీల్లేదు—మళ్ళీ మనం హైదరా బాదువెళ్ళి అక్కయ్యా వాళ్ళూ వూరికి వెళ్ళిపోయేదాకా ఖర్చంతా నాచేతిమీదుగా జరగాల్సిందే—మీ పర్సులో డబ్బు ఎక్కు వుంటే ఇంకే మయినా కొనుక్కోండి.' నవ్వుతూనే అన్నా ఆ కంఠంలో వున్న పట్టుదలని ఎదిరించే సాహసం లేక సురేఖ మాట్లాడకుండా బిల్లు అతని చేతిలో పెట్టేసింది.

మర్నాడు ఉదయమే స్నానాలు ముగించు కుని, సామానంతా సర్దుకునికార్లో వదేసు కుని హోటలు ఖాళీచేసేశారు కాఫిటిఫిన్ ముగించుకుని.

కనకదుర్గ గుడినుండి తిరిగి వస్తూంటే సరోజ అంది 'మంగళగిరి కూడ వెళ్దాం' అని.

'ఇక్కడిలా ఆ కొండమీదికి కారు వెళ్ళదు — మెట్లెక్కగలరా?' అందర్నీ వుద్దేశించి అడిగాడు.

'ఆ ఎక్కుతాం. ఫరవాలేదు.' ఇంచు మించు అంతా ముక్త కంఠంతో సమాధానం ఇచ్చారు.

'అయితే నా అభ్యంతరం ఏం లేదు.' అన్నాడు.

పానకాలస్వామిని దర్శించుకుని గుంటూరు చేరేసరికి మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. ఎండ పేల్చేస్తోంది. ముందు ఉబలాటపడినా మంగళగిరి కొండ ఎక్కి దిగిన అలసట అందరి మొహాలమీదా కనిపిస్తూనే వుంది. హోటల్లో నాలుగు మెతుకులుతిని కాస్సేపు ఎక్కడైనా విశ్రాంతి తీసుకుంటే కాని మరి ప్రయాణం చెయ్య లేమనిపించింది.



'అన్నట్లు మా పెద్దత్తగారికూతురుంది ఈ వూళ్లో — కాస్త చల్లబడిందాకా అక్కడ కూర్చున్నట్లు వుంటుంది—మనల్ని చూసి ఆవిడా సంతోషిస్తుంది.' పుణ్యము పురుషార్థమూ కలిసివచ్చే వుపాయం చెప్పింది శకుంతలమ్మ.

ఆ పెద్దత్తగారి అల్లుడు కేశవరావు మాధవ్‌కి కూడ తెలుసు, ఇవాళ ఆదివారం ఇంట్లోనే వుంటాడు అనుకుంటూ, శకుంతలమ్మ చెప్పిన గుర్తులనిబట్టి దారి పొడుగునా పదిమందిని అడుగుతూ ఎలాగో ఇల్లు చేరారు.

ఆ దంపతులు వీళ్లని చూస్తూనే బోలెడు సంబరపడిపోయి ఆదరంగా అహ్వానించి, కాళ్లు కడుక్కోటానికి నీళ్లిచ్చి ఎంతో మర్యాద చేశారు

'మేం హోటల్లో భోజనం చేసివచ్చాం' అని చెప్పగానే మాత్రం 'అయితే ఎందుకొచ్చినట్లు అసలు—ఇంక నుంచి మేమూ ఇలాగే చేస్తూంటాం' — అదీ—ఇదీ అంటూ గయ్‌మంది ఆ ఇల్లాలు.

అప్పటికి తోచిన క్షమార్పణలు చెప్పుకుని ఆవిడని శాంతపరచి, పరిహారంగా ఆవిడ పకోడీలుచేసే దాకా కూర్చుని అవి తిని కాఫీతాగి బయలుదేరారు.

ఆ రాత్రి నెల్లూరులో ఆగిపోయారు. మర్నాడు ఉదయమే రంగనాధస్వామి దర్శనం చేసుకుని అక్కడ్నించి కాళహస్తి వెళ్లి

# సురేఖాపరిణయం

అక్కడ అర్చనలూ అవీ చేయించి సాయంకాలం సరికి తిరుపతి చేరుకున్నారు. శకుంతలమ్మకి ప్రయాణం ఎంతో నచ్చింది. ఒక్కోగుడిని దర్శించుకున్నప్పుడల్లా ఒక్కోసారి తమ్ముడిని మెచ్చుకుంటూండేది.

'అందరూ చెప్తూంటే వినటమేకాని ఇక్కడికి రావాలని కూడ ఎప్పుడూ అనుకోలేదు —ఎంత మంది యాత్రికులు—ఎలాంటి ఏర్పాట్లు' గార్డెన్ హోటల్లోసుష్టుగా భోజనంచేసి వచ్చి కాటేజి తాళం తీసి సోఫాలో కూలబడుతూ అన్నాడు మాధవ్.

'కలియుగ వైకుంఠం ఇది—ఎన్నిసేవలు ఎంతపూజ జరుగుతోందో చూశావుగా... ఎన్నాళ్ల నుంచో అనుకుంటున్నది ఇప్పటికి నెరవేరింది' భక్తి పారవశ్యంతో పాటు సంతోషం సంతృప్తి కూడ నిండివుంది శకుంతలమ్మ గొంతులో.

'కొన్ని కొన్ని చూస్తూంటే—మరీ వేలం వెర్రేమో అనిపిస్తుంది—అయిదు వందలు ఇచ్చి దేవుడికి కళ్యాణం చేయించే వాళ్లూ ఇంకా పెద్ద పెద్ద పూజలు చేయించేవాళ్లూ—అందర్ని చూస్తుంటే ఆశ్చర్యం వేస్తుంది–రోజూ పది మందయినా వుంటారుట అలా కళ్యాణం చేయించే వాళ్లు—అలా కళ్యాణం చేయించినందు వల్ల దేవుడు సంతోషిస్తాడో లేదో మనకి తెలియదు—అందువల్ల మనకేం పుణ్యం వస్తుందో అంతకన్నా తెలియదు—ఆ అయిదువందలు పెట్టి ఒకబీదపిల్ల పెళ్లి జరిపిస్తే ఆ కుటుంబం ఎంత సంతోషిస్తుందో——'

'చాల్లే—ధోరణి' మధ్యలోనే అడ్డుకుంది శకుంతలమ్మ విస్మయంతో తలమునకలౌతూ. బ్రహ్మచారి జీవితం గడుపుతున్న తమ్ముడింట్లో పూజలు పునస్కారాలూ జరగవని ఆవిడికి తెలుసు—అయినా అతనికీ కాస్తో కూస్తో దైవభక్తి వుంటుందనే తను అనుకుంది–సాక్షాత్తూ వెంకటరమణమూర్తి సన్నిధిలో అతనిలాంటి మాటలు మాట్లాడటం ఆవిడ కెంతో బాధగాకూడ వుంది—తమ్ముడి అపచారానికి దేవుడు కినుక వహించకుండా వుండగలందులకు దేవుడికి ఓ నమస్కారం పెట్టి క్షమార్పణ కోరుకుంటూ రెండు లెంపలూ వాయించుకుంది. అక్కగారి అమాయకత్వానికి నవ్వుకున్నాడు మాధవ్.

'నవ్వొందు కొస్తుంది—అర్థం పర్థం లేకుండా హాస్యంగా మాట్లాడినందుకు లెంబర పడాల్సిందే' చనువుగా మందలించింది.

'హాస్యంకాదు. నిజమే చెప్పాను—'

'ఆ—చెప్పావు— దేవుడికి పూజచేశాం దానికి ప్రతిఫలంగా మనకేం దక్కింది అని లెక్కలు వేసుకుంటారా ఎవరైనా — దైవకార్యం చేయించ గలగటమే ఓ అదృష్టం. ఆ పుణ్యం ఇదీఅని మన కంటికి కనిపించకపోయినా మన్నివెన్నంటి వస్తూనే వుంటుంది — అయినా నువ్వేదో ఓ బీదపిల్ల పెళ్లి చేయించేస్తే ఆ కుటుంబం బోలెడు సంబరపడిపోయి నీ అడుగులకి మడుగులొత్తుతారనుకుంటున్నావేమో — అదంతా వట్టి భ్రమ—ఫలానా ఆయన ఈ సాయం చేశాడు అని చెప్పుకోటం కూడ నామోషీ అనుకునే వాళ్లుంటారు—చేసినమేలు మరిచిపోవటం అనేది మనుష్యులకి చేతనయినంతగా జంతువులకికూడ తెలియదు—' కాస్త దూకుడుగానే వచ్చాయి ఆవిడ మాటలు.

క్షణం విస్మయంగా అక్కగారి మొహంలోకి చూశాడు మాధవ్ 'కృతఘ్నత అనేది మనుష్యుల్లోనే వుంటుంది నిజమే — అంతే కాదు — ఆనాడెప్పుడో నేను సహాయంచేశాను. దాన్ని వాళ్లు కల



కాలం గుర్తుంచుకోవాలి అనుకునే బలహీనత, ఫుహు—కాదు; దురాశ కూడా మనుష్యుల్లోనే వుంటుందేమో...' అంత దూకుడుగానూ మొదలుపెట్టిన అతని గొంతు క్రమంగా మామూలుగా అయిపోయింది. ఏమిటింత ఆవేశపడ్డాను అని సిగ్గుపడుతున్నవాడిలా అయిపోయి అది కప్పిపుచ్చుకోటానికి పెద్దగా నవ్వేసి.

'అయినా ఆ దంపతులు జీవితాంతం నీకు కృతజ్ఞులై వుండాలన్నే పేరాశ ఎందుకు? వధూవరులై పెళ్లి పీటలమీద కూర్చున్న సమయంలో వాళ్ల నిండు మనస్సులోంచి పొంగివచ్చిన సంతోషం సంతృప్తి వాళ్ల కళ్లల్లో ఎలా ప్రతిబింబిస్తాయో ఒక్కసారి చూడగలిగితే చాలు. ఆ అవకాశం లేకపోతే వూహించుకోగలిగితే చాలు. ఆ కళ్లల్లోని మెరుపు ఎప్పుడు గుర్తుకు తెచ్చుకున్న మన మనస్సు అవ్యక్తమైన తృప్తితో నిండిపోతుంది. జీవితంలో ఆ ఒక్క మంచిపనయినా చేశాం అన్న తృప్తి చాలదూ—ఏం? అయినా వాళ్లు మాత్రం మరిచిపోతారని మనం ఎందు కనుకోవాలి' అన్నాడు ముగ్గురమ్మాయిల కేసి చూస్తూ.

'బాగుందిరా నీ వితండవాదన—అయినా నీకు దేవుడిలో నమ్మకంలేదని తెలిస్తే అసలు నిన్ను అడిగేదాన్నికాదు — ఎలాగో మీబావే తీసుకొచ్చేవారు—చిరాకో పరాకో కట్టుకున్న పెళ్లానికి తప్పదుకదా' యాత్ర చేసిన ఫలితంకూడ తనకి తక్కదేమో నన్నట్లు మాట్లాడింది శకుంతలమ్మ—

'దేవుడిలో నాకు నమ్మకం లేకపోవటం కాదు భగవంతుడి అస్తిత్వంలో నాకు విశ్వాసంవుంది—మన మనస్సుకి ఏకాగ్రత కుదరటంకోసం ఆ సర్వాంతర్యామికి మనం ఒకరూపం నామం కల్పించుకుంటున్నాం అన్న దాంట్లోకూడ ఎలాంటి ఆక్షేపణ లేదు—ఎటొచ్చీ ఆదేవుడిపేర మనంచేస్తున్న దంతా కేవలం ఆడంబరంగానూ ఆర్భాటంగానూ పరిణమిస్తోందనేదే నావాదం...'

'ఒకవిషయం మీరు మరిచిపోకూడదు' అప్పటివాకా ఆ అక్కాతమ్ముళ్ల వాదన వింటూ మౌనంగా కూర్చున్న ముగ్గురిలో సురేఖే ముందు మాట్లాడింది 'అదృష్టం కలిసివచ్చిందనో ఆపదల్లో ఆదుకున్నాడనో దేవుడికి మొక్కుబడి తీర్చుకుంటాం—ముఖ్యంగా ఆపదల్లోనేకదా దేవుడు ఎక్కువగా గుర్తువచ్చేది— ఓ తల్లి వుందనుకోండి—తన ఒక్కగా నొక్క కొడుకు ప్రాణంమీదికి వచ్చినప్పుడు ఆ గండం గడిస్తే ఏదో చేస్తానని మొక్కుకుంటుంది— దేవుడి కళ్యాణం చేయిస్తాననో నిలువు దోపిడీ ఇస్తాననో ఏదో ఆవిడశక్తి నిబట్టి అనుకోండి—దేవుడి మహాత్యం ఏంలేదు వాడికి ఆయువుంది బతికాడు అన్నవాదాన్ని కాస్సేపు ప్రక్కకిపెట్టేదాం—ఇంక అలాంటి సమయంలో మీలాంటివారు ఆడబ్బుతో ఓ బీద పిల్ల పెళ్లిచేయించవచ్చు. పదిమంది బీద విద్యార్థులకి చదువు చెప్పించువచ్చు అంటే ఆతల్లి భరించగలదా. మీ వాదంలో సబబు వుండొచ్చు కాని తను మొక్కు తీర్చకపోతే మళ్లీ ఆబిడ్డకేమయినా ఆపద ముంచుకొస్తుందోనన్న భయంతో ఆవిడ ప్రాణాలు తల్లడిల్లిపోతాయి—ఆ డబ్బుతో మరో మంచి కార్యంచేస్తే ఇంకా ఎక్కువ పుణ్యం వస్తుందనీ, చివరికి దేవుడుకూడ ఎక్కువ సంతోషిస్తాడనీ వివారు

## లిటెక్విజ్ నెం 45 — 18 క్లూలు.

1. సంపాదన/వినాశక ప్రేరణకు మనం బలవత్తరమైన ప్రతిబంధకమును కల్గించకపోతే ఘోరమైన మహా మానవ దుఃఖమూలం సర్వదా మావెంట వుంటియుండును.

2. ఏ గొప్ప సౌందర్య శిల్ప/కళాభివృద్ధికైనా సర్వదా సమృద్ధిగా నైతిక ధరాతలం ఉండవలెను.

3. ప్రతి ఆపద/ఆకర్షణం నైతికతాపటిమకు పరీక్ష.

4. మానవుడు మనకు తెలిసినంతవరకు జీవజంతు లోకంలో అన్నిటని మించిన కామాతురుడైన/ప్రమాదకరమైన జంతువు.

5. మనవలె ఆచరణ/విశ్వాసంలేని జనులపట్ల సులువుగా ఓర్పులేకుండా వుంటాం.

6. సభ్యత/వివేకం కలిగియుండుట మన మానవత్వానికి గ్యారంటీకాదు.

7. తన లోపముల / భావముల దయపై ఆధారపడి యుండు మానవుడు అపరిపక్వ మనుష్యుడు.

8. మానవుడు ఎంత చిన్నవాడైనా మరియు తరచుగా ఎంత క్షీణుడు / నిరర్థకుడు అనునది మరపు సంభవనీయం.

9. ఇతర సుందర వస్తువు లన్నిటివలెనే నీలాకాశం పచ్చగడ్డి, మేఘములు, మంచు వలె కళాపరిణామం అంత శోభాయమానం / గంభీరం.

10. విజ్ఞానం, సార్వజనికం, నిష్పక్షపాతం/ అవ్యక్తికతం తేటతెల్లమై, సాంకేతికమైనదిగా వుండవలెను అని నిష్కర్షగా పట్టుదలకలిగియున్నది గనుక అనేది అద్భుత సఫలతను సాధించింది

11. మద్యపాన ప్రియులైన మానవులకు మితము/తృప్తి వంటి విషయమేదీలేదు.

12 ఈనాడు, మనం మొత్తంమీద సామాజిక మరియు ఆర్థిక సమస్యలు నైతిక/రాజనీతిక విషయములనుండి ప్రత్యేకించబడజాలవు అనే మాన్యతను అంగీకరించాము.

13. కాముకత/దమనం హానికరం, అసంతుష్టికరం, మరియు శక్తులను దుర్మార్గ దిశలకు నడిపించవచ్చును.

14. తత్వజ్ఞానిక/వైజ్ఞానిక అభివృద్ధి, విశ్లేషణ, సంశ్లేషణల లయాబద్ధతవల్ల సిద్ధించును.

15. మానవుడు ధర్మం/విశ్రాంతి లేకుండా పని చేయజాలడు అనే విషయం వివాదఅగత్యత లేనంతటి స్పష్టము.

16. మన విశ్వాసములందు, మన జీవన విధానమందు [illegible] మన ప్రథమ అగత్యత సరళత/ [illegible].

17. [illegible] స్థిరత/శ్రేష్ఠత ప్రధానంగా [illegible] ఆధ్యాత్మిక గుణములను [illegible] యుండును.

18. ప్రేరక [illegible] మనలను గతంనుండి [illegible]. మూల్యం/మహోద్దృష్టి [illegible].

## No. 45: 18 CLUES

1. Unless we put strong brakes on the Acquisitive / Destructive urge a tremendous'y big source of human misery will always remain with us.
2. There must always be a rich moral soil for any great Aesthetic / Artistic growth.
3. Every Affliction / Temptation is a test of moral strength.
4. Man, we know, is the most Amorous / Dangerous animal in the zoological kingdom.
5. It is easy to be impatient with people who do not Behave / Believe as we do.
6. The possession of Civilisation / Reason is not a guarantee of our humanity
7. A man at the mercy of his Failings / Feelings is immature.
8. Man is liable to forget how small and often how Feeble / Futile he is.
9. The end of Art is as Glorious / Serious as that of all other beautiful things — of the blue sky and the green grass, and the clouds and the dew.
10. Science has achieved its remarkable success only because it has insisted inflexibly that it must be public, Impartial / Impersonal, explicit, symbolic.
11. With men who are alcoholically inclined there is no such thing as Moderation / Satisfaction.
12. Today we have, on the whole, accepted the notion that social and economic problems cannot be separated from Moral / Political issues
13. Passion / Repression is harmful, unsatisfactory, and may misdirect the energies to perverted ends.
14. Philosophic / Scientific progress is a rhythm of analysis and synthesis.
15. That man cannot do without Religion / Rest is a fact too apparent to need discussion.
16. Perhaps our first need is Simplicity / Sincerity in our beliefs and in our way of life.
17. The Stability / Superiority of a civilisation depends primarily upon the spiritual quality of its people.
18. Motives like to push us from the past, Values / Visions try to draw us into the future.

గమనిక: పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరు వేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లిటక్విజ్ పిక్స్‌లో ప్రచురించబడును.

## సురేఖాపరిణయం

చెప్పినా ఆమెకి ధైర్యం చాలదు. తను అనుకున్నది అనుకున్న విధంగా నిని యోగిస్తేనే ఆమెకి తృప్తి—దానిని మీరు మూఢవిశ్వాసం అనండి, గుడ్డినమ్మకం అనండి...'

'అంతగాఢంగా నమ్మి దేవుడి ముందు కూడ మనం అబద్ధం లాడటానికి వెరపం—అన్యాయాలు చెయ్యటానికి భయపడం—ఏ మంత్రిగారి దగ్గరనుంచో సిఫారసు తెచ్చుకుంటే క్యూ మధ్యలోనే జొరబడి త్వరగా దర్శనం చేసుకుని ఇవతల పడతాం—ఏ పలుకుబడీ లేనివాడు గంటల తరబడీ అలా నిలబడే వుంటాడు...'

'నిజమే మామయ్యా—కాని అలా సిఫారసు సంపాదించి ముందుగా దర్శనం చేసుకు వెళ్ళిపోయే వాళ్ళల్లోనూ కొంతమందికి తాము చేస్తున్నది తప్పు అనిపిస్తుంది—కాదు అంటే నేను ఒప్పకోను—తప్పు అని తెలిసికూడ ఎందుకు చేస్తున్నారు అంటే ఎవరిమట్టుకు వారికే తమపని తెముల్చుకు వెళ్ళిపోవాలనే తొందరేమరి—ఏదో అవకాశంవచ్చినా వినియోగించుకోకుండా మీనమేషం లెక్కపెడుతూంటే నువ్వు అక్కడే వుంటావు—నువ్వొక్కడివి ముక్కుకి సూటిగా వెళ్తానంటే అంతా అలాగే వుండరు—వెనక వచ్చినవాళ్ళు ముందుకు వెళ్ళిపోతూంటారు—మరి ఏమీలేని వాడికి అన్యాయం ఎప్పటికీ జరగాల్సిందేనా అంటే అందుకు అందరిలోనూ పరివర్తన రావాలి—అధికారం చేతిలో వున్నవాళ్ళు అలాంటి సిఫారసులు ఇవ్వకుండాను, తెచ్చినవాటిని లక్ష్యపెట్టకుండానూ వుండాలి—మొత్తం మీద అందరిలోనూ మార్పురావాలి...'

'వస్తుంది—వస్తుంది. ఎవరికివారే అవకాశం వదులుకోటం ఎందుకూ అని అన్యాయానికి వడబడుతూంటే మహ చక్కగా బాగు పడుతుంది దేశం—'

శ్యామల మాటలని మధ్యలోనే తుంచేశాడు మాధవ్.

'నీకంత కోపం వస్తోందికాని, ఎవరో ఏదో చేశారని దుయ్యబట్టే వాళ్ళకినిజంగా ఏదైనా అవకాశం వస్తే చేతులుముడుచుకు కూర్చుంటారంటావా—ఎంతసేపూ ఎదుటివాడిని తప్పు పట్టటానికే ఈ ఆదర్శాలు ఆశయాలు పనికి వస్తాయి కాని తమ దాకా వచ్చేసరికి అన్నీ గాలికి ఎగిరి పోతాయి.' అంది శ్యామల,

**15 భాషలు 175 ఏజెంట్లు 250 పత్రికలలో ప్రకటనలు**

★ సంవత్సర చందా రు. 12 పంపి, 50 లిట్‌క్విజ్ పిక్లు కాపీలు పొందండి.

★ అన్యువల్ సబ్‌స్క్రైబర్స్ క్విజ్‌లో, పాల్గొనుటకు సంవత్సర చందాదారులు మాత్రమే అర్హులు.

★ ఎంట్రీ రుసుముతో చందా రు. 12 పంపి అన్యువల్ సబ్‌స్క్రైబర్స్ క్విజ్ యందు వెంటనే పాల్గొనండి.

LITQUIZ NO 45

Rs 50000

RUNNERS-UP (UPTO 4 ERRORS) Rs 16,000

ANNUAL SUBSCRIBERS' QUIZ Rs 1,500

FIRST PRIZE Rs 25000

EVERY ALL-CORRECT in Mini Quiz will get a [watch] (UPTO 2 ERRORS) Rs. 7,500

## లిట్ క్విజ్ నెం. 45 అధికార ఎంట్రీ ఫారము

ఆఖరు ముగింపు తేదీ 12-2-69 బుధవారం

**ADDRESS: LITQUIZ No. 45, ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)**

గమనిక: (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీ రుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండి పొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరించబడును. (4) I. P. O. క్రాస్ చేయువద్దు. అది లిట్‌క్విజ్ నెం. 45, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| 1 | Re. 1 | |
|---|---|---|
| 1 | ACQUISITIVE | DESTRUCTIVE |
| 2 | AESTHETIC | ARTISTIC |
| 3 | AFFLICTION | TEMPTATION |
| 4 | AMOROUS | DANGEROUS |
| 5 | BEHAVE | BELIEVE |
| 6 | CIVILISATION | REASON |
| 7 | FAILINGS | FEELINGS |
| 8 | FEEBLE | FUTILE |
| 9 | GLORIOUS | SERIOUS |
| 10 | IMPARTIAL | IMPERSONAL |
| 11 | MODERATION | SATISFACTION |
| 12 | MORAL | POLITICAL |
| 13 | PASSION | REPRESSION |
| 14 | PHILOSOPHIC | SCIENTIFIC |
| 15 | RELIGION | REST |
| 16 | SIMPLICITY | SINCERITY |
| 17 | STABILITY | SUPERIORITY |
| 18 | VALUES | VISIONS |

| 2 | Re. 1 | |
|---|---|---|
| 1 | ACQUISITIVE | DESTRUCTIVE |
| 2 | AESTHETIC | ARTISTIC |
| 3 | AFFLICTION | TEMPTATION |
| 4 | AMOROUS | DANGEROUS |
| 5 | BEHAVE | BELIEVE |
| 6 | CIVILISATION | REASON |
| 7 | FAILINGS | FEELINGS |
| 8 | FEEBLE | FUTILE |
| 9 | GLORIOUS | SERIOUS |
| 10 | IMPARTIAL | IMPERSONAL |
| 11 | MODERATION | SATISFACTION |
| 12 | MORAL | POLITICAL |
| 13 | PASSION | REPRESSION |
| 14 | PHILOSOPHIC | SCIENTIFIC |
| 15 | RELIGION | REST |
| 16 | SIMPLICITY | SINCERITY |
| 17 | STABILITY | SUPERIORITY |
| 18 | VALUES | VISIONS |

| 3 | Re. 1 | |
|---|---|---|
| 1 | ACQUISITIVE | DESTRUCTIVE |
| 2 | AESTHETIC | ARTISTIC |
| 3 | AFFLICTION | TEMPTATION |
| 4 | AMOROUS | DANGEROUS |
| 5 | BEHAVE | BELIEVE |
| 6 | CIVILISATION | REASON |
| 7 | FAILINGS | FEELINGS |
| 8 | FEEBLE | FUTILE |
| 9 | GLORIOUS | SERIOUS |
| 10 | IMPARTIAL | IMPERSONAL |
| 11 | MODERATION | SATISFACTION |
| 12 | MORAL | POLITICAL |
| 13 | PASSION | REPRESSION |
| 14 | PHILOSOPHIC | SCIENTIFIC |
| 15 | RELIGION | REST |
| 16 | SIMPLICITY | SINCERITY |
| 17 | STABILITY | SUPERIORITY |
| 18 | VALUES | VISIONS |

| 4 | Re. 1 | |
|---|---|---|
| 1 | ACQUISITIVE | DESTRUCTIVE |
| 2 | AESTHETIC | ARTISTIC |
| 3 | AFFLICTION | TEMPTATION |
| 4 | AMOROUS | DANGEROUS |
| 5 | BEHAVE | BELIEVE |
| 6 | CIVILISATION | REASON |
| 7 | FAILINGS | FEELINGS |
| 8 | FEEBLE | FUTILE |
| 9 | GLORIOUS | SERIOUS |
| 10 | IMPARTIAL | IMPERSONAL |
| 11 | MODERATION | SATISFACTION |
| 12 | MORAL | POLITICAL |
| 13 | PASSION | REPRESSION |
| 14 | PHILOSOPHIC | SCIENTIFIC |
| 15 | RELIGION | REST |
| 16 | SIMPLICITY | SINCERITY |
| 17 | STABILITY | SUPERIORITY |
| 18 | VALUES | VISIONS |

FREE TO SUBSCRIBERS WHO SEND 2 COUPONS — 45 — FREE TO ALL WHO SEND 4 COUPONS

**Annual Subscribers Quiz**

| | | | |
|---|---|---|---|
| ACQUISITIVE | DESTRUCTIVE | BEHAVE | BELIEVE |
| AESTHETIC | ARTISTIC | CIVILISATION | REASON |
| AFFLICTION | TEMPTATION | FAILINGS | FEELINGS |
| AMOROUS | DANGEROUS | FEEBLE | FUTILE |

Annual SUB. No. ................ /NEW

FREE COUPON

**Mini Quiz**

| | | | |
|---|---|---|---|
| FAILINGS | FEELINGS | PASSION | REPRESSION |
| FEEBLE | FUTILE | PHILOSOPHIC | SCIENTIFIC |
| GLORIOUS | SERIOUS | RELIGION | REST |
| IMPARTIAL | IMPERSONAL | SIMPLICITY | SINCERITY |
| MODERATION | SATISFACTION | STABILITY | SUPERIORITY |
| MORAL | POLITICAL | VALUES | VISIONS |

2 కూపనులు పంపు సంవత్సర చందాదారులకు ఉచితం

4 కూపనులు పంపువారందరికి ఉచితం

**45** (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకుచెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/—. ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/— M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రశీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.........

CAPITAL LETTERS

NAME ..............................................

ADDRESS ..............................................

..............................................

— ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను —

ఆఖరు ముగింపు తేదీ: 12—2—69. * లిట్‌క్విజ్ [illegible] 10 [illegible] [illegible]

లిట్‌క్విజ్ ఫలితాలు 16-2-69. * లిట్‌క్విజ్ 8 [illegible] రు. 2/— [illegible]

* లిట్‌క్విజ్ నెం. 42 లో [illegible] 25, [illegible] రూ. 21,000/— గెలుచుకొన్నారు.

'అయితే నువ్వనేదేమిటి—ఇది ఇప్పటికి అలాగే జరగాలనా?'

'ఒప్పుకుంటున్నానులే బాబూ, మార్పు రావాలని—అది అన్నివయిపులనుంచి జరగాలి. లంచం పుచ్చుకున్న వాడేకాదు ఇచ్చినవాడు దోషే అన్నభావం అందరిలోనూ కలగాలి—మనం అందరం మామయ్య చెప్పిన లాంటి మంచి మనుష్యులం అయిపోవాలి. కదు శ్యామా' అంది సరోజ.

'అబ్బబ్బ—ఇంకా ఇదే గొడవా—మరి ఆ కోవెలగుడి అవి చూసిరావాలనుకున్నాంగా—ఇంకా ఎప్పుడు బయలుదేరదాం.' అంది శకుంతలమ్మ, అవి చూడాలని సరదా లేనికి—'వెళ్దాంలే కే, అరగంటపోనీ—సంకోచం వాదించుకోటం అంటావా, మంచి రామరాజ్యం మనకి వాక్ స్వాతంత్రం వుంది. మరో రాజ్యం అయితే అందరం నోళ్ళు మూసుకు కూర్చోవలసిందే.'—పొర్లు నవ్వుకోవాలనికి తన గదిలోకి వెళ్తూ అన్నాడు మాధవ.

* * *

'ఇదంతా ప్రయాణం బడలికేనా!' అయిదుగంటలయినా గాఢ నిద్రలో మునిగి పోయివున్న శ్యామలని చూస్తూ నవ్వింది శకుంతలమ్మ.

'బడలికేమిటి? టైము దొరికితే సరి ఎప్పుడంటే అప్పుడే హాయిగా నిద్ర పోతుంది' లోపలికివచ్చిన శకుంతలమ్మకీ సరోజకీ కూర్చోటానికి కుర్చీలు చూపిస్తూ శ్యామలకి మేలుకొలుపు పాడింది సురేఖ.

# సురేఖాపరిణయం

యాత్రలు అవీ ముగించుకుని ఆ క్రితం రోజే అంతా హైదరాబాదు తిరిగివచ్చారు.

'అప్పుడే అయిదయిందా?' బద్ధకంగా ఆవులిస్తూ చేతివాచీకేసి చూసుకుంది అపనమ్మకంగా.

'త్వరగా లేచి స్నానం అదీ కానియ్యి మరి—మామయ్య ఒక్కడూ ఆ విజిటర్సు రూమ్‌లో కూర్చున్నాడు—అయినా ఏం నిద్ర బాబూ.' విసుక్కుంది సరోజ.

'అయిదంటే అయిదు నిమిషాలు.' అంటూనే హడావిడిగా తయారవటం మొదలుపెట్టింది.

'రేపు వూరికి వెళ్ళిపోదాం అనుకుంటున్నా.' శ్యామల ముడుచుకుంటున్న సిగవంకే చూస్తూ అంది శకుంతలమ్మ.

'అప్పుడేనా, మరో నాలుగురోజులుండ కూడదూ?' ముడి అందంగా కుదిరిందో లేదో అని రెండుఅద్దాలలో చూసుకుంటూ అంది శ్యామల.

'సయమే ఇంకా నాలుగు రోజులా — అక్కడ మీ పెద్దనాన్న చిందులు తొక్కుతూ వుంటారు—ఆ మమ్మమ్మ ఒక్కతే చేసుకోలేదు — రాకరాక వచ్చానుకదా అని పదిరోజులుపైనే వున్నాను — మరోవారం అయితే అయిందికాని వాడి ధర్మమా అంటూ నాలుగు పుణ్యక్షేత్రాలు చూశాను.'

'అనుకోకుండా నాక్కూడ దైవదర్శనం చేయించారు.' అంది సురేఖ.

'ఒకళ్ళు చేయించేదేమిటమ్మా — ఆ దేవుడే నిన్ను తీసుకు వెళ్ళాడు—ఇంటివి ప్రాప్తం వుండాలేకాని మన ప్రయత్నం మీద జరగవు.' శకుంతలమ్మ స్వానుభవంతో చెప్తూంటే సురేఖ చిన్నగా నవ్వేసింది—

'మీ అందరితోటి చాలా సరదాగా గడిచిపోయింది. ఇంటికి వెళ్ళలేదు అన్న ఆలోచనయినా రానివ్వకుండా ఎంతో అభిమానంగా చూసుకున్నారు.' కృతజ్ఞతాపూర్వకంగా అంది.

'ఇంకా అలా కబుర్లుచెప్తూ కూర్చో —. వస్తుంటావు మళ్ళీ.' శ్యామల హడావిడి పడిపోయింది.

'చీర మార్చుకోటమేగా.'—పెట్టె తెరిచి చీరతీసి మంచంమీద పడేసింది—అలమారులోంచి మూడు మంచి గంధం చెక్క పెట్టెలు తీసింది — చిన్న టాయిలెట్ బాక్సు సైజులోవున్న పెట్టెలు నాలుగు బెంగుళూరులో కొంది — పెట్టె నాలుగు ప్రక్కలా సన్నటి లతలూ పువ్వులు చెక్కి వున్నాయి. మూతమీద ముద్దొచ్చేన నెమళ్ళ జంట — కంటికి సొంపుగా వుండటమే కాకుండా మృదువైన సుగంధాన్ని వెదజల్లే ఆ పెట్టెలు వీళ్ళ ముగ్గురికీ ఒక తల్లికీ అనే తీసుకుంది — కాని ఖర్చు లేకుండా అన్ని స్థలాలు తిరిగాను ఏదైనా ఇవ్వాలి అనే వుద్దేశ్యంతోనే వాటిని తీసుకుంది.

వాటితోపాటు గంధం చెక్కతో చేసినవే నాలుగు కుంకం భరిణెలు కూడా. వాటిలో, కాస్త కుంకం వేసి పెట్టెలో పెట్టి.

'మనం ఇన్నాళ్ళు సరదాగా చేసిన ప్రయాణానికి గుర్తుగా వుంచండి,' అంటూ మూడు పెట్టెలూ ముగ్గురి చేతుల్లోనూ పెట్టబోయింది.

'వాళ్ళంటే వూరికి వెళ్ళిపోయేవారు—నాక్కూడ ఎందుకూ?' చెయ్యి వెనక్కి తీసుకుంది శ్యామల.

'ఊరికి వెళ్ళిపోతే మాత్రం ఎందుకిప్పుడూ?' పరాయి పిల్ల దగ్గర్నుంచి అవి తీసుకోటానికి బోలెడు మొహమాటపడిపోయింది శకుంతలమ్మ.

'ఇలాంటి గుర్తులేమీ లేకపోతే మరిచిపోతామనేనా మీ ఉద్దేశ్యం,' అంది సరోజ.



'ప్లీజ్ — అలాంటి అర్థాలు తియ్యకండి — నేను సరదాగా ఇస్తున్నాను — మీరు తీసుకోనంటే నా మనస్సు చాలా బాధపడుతుంది — మనం మళ్ళీ కలుసుకోలేకపోవచ్చు — కాని ఒకసారి కలిసి చేసిన ప్రయాణానికి గుర్తుగా వుంటాయివి' అర్థిస్తున్నట్లు చూసింది సురేఖ.

'అయితే సరే — నేనూ ఒకటి ఇస్తాను — నువ్వు వద్దనకూడదు.' తన పెద్దరికం నిలబెట్టుకుంటూ అంది శకుంతలమ్మ.

'అసలు మరి — వద్దనకూడదు,' వంత పాడారు శ్యామల సరోజా.

'అలాగే —' సురేఖకి ఒప్పుకోక తప్పలేదు.

'వీర సింగారించేసరికి అన్నమాట నిజం చేశారు — చదివిన పేపరు చదువుతూ ఒకట్నీ ఎంతసేపని ఇక్కడ కూర్చుంటాననుకున్నారు?' నవ్వుతూనే విసుక్కున్నాడు మాధవ్.

'పాపం ఈ అమ్మాయిదేంలేదు — నీ ముద్దుల మేనగోడలు నిద్రలేచేసరికే అరగంట పట్టింది' అంటూ సురేఖ ఇచ్చిన బహుమతులు చూసింది 'నేనిచ్చే బహుమతి ఈ అమ్మాయి తీసుకునే కండిషన్‌తోనే తీసుకున్నాను' అంది శకుంతలమ్మ.

'అంతేలెండి — ఆడవాళ్ళంతా ఒక్కటే — మీరూ మీరూ స్నేహాలు కలిపేసుకున్నారు బహుమతులు ఇచ్చి పుచ్చుకున్నారు — ఇన్నాళ్ళూ ఊళ్ళన్నీ తిప్పిన డ్రైవరు బక్షీషుమాట ఎప్పటికీ గుర్తులేదు' హాస్యంగానే నిష్ఠూరంవేశాడు.

మిగిలిన ముగ్గురూ గలగల నవ్వేసారు కాని సురేఖ ఒక్కక్షణం సిగ్గుతో ముడుచుకుపోయి మరుక్షణంలో, 'ఉండండి' అంటూ చర్రున లోపలికి పరుగెత్తింది. 'నేను సరదాకి అన్నాను — ఇప్పుడేం వద్దు' అంటున్న మాధవ్ మాటలు వినిపించుకోకుండా.

పదినిముషాలలో తిరిగివచ్చింది చేతిలో చిన్న అట్టపెట్టెతో — పెట్టె మూతతీసి టీపాయిమీద పెట్టి పదిలంగా పెట్లోంచి తీస్తుంటేనే వాళ్ళకి తెలిసిపోయింది అదేమిటో — మంచి గంధపుచెక్కతో చేసిన చిన్న మండపం — ఒకరిచేతులలో ఒకరు ఒరిగిపోయిన రాధామాధవుల దంతపు విగ్రహం మండపం మధ్య స్క్రూతో బిగించివుంది — అదికూడా బెంగుళూరులోనే తీసుకుంది సురేఖ తనకోసమని.

'తీసుకోండి — అసలు మీరు అడగకుండానే ఇవ్వాల్సింది — కాని, బెజవాడలో మీరు అలా హెచ్చరించిన తరువాత అలాంటి సాహసం చెయ్యలేకపోయాను' అంది టీపాయ్‌మీద పెడుతూ.

'నేనేదో హాస్యానికన్నాను — మీరు సరదా పడి కొనుక్కున్నది ఇవ్వటం బాగుండలేదు — కాస్త పరిచయం అయేసరికే ఏదో సరదాగా మాట్లాడటం నాకలవాటు — వీళ్ళందరికీ తెలుసు నా సంగతి — ఏమీ అనుకోకండి...' యధాలాపంగా అన్నాడేకాని నిజంగా సురేఖ ఇవ్వబోయేసరికి ఎందుకన్నానా అని పశ్చాత్తాప పడసాగాడు.

'అనుకోటానికేముంది ఇందులో — నేనూ సరదాగానే ఇస్తున్నాను. తీసుకుంటే సంతోషిస్తాను' అంతకన్న బలవంతం చెయ్యటం సురేఖవల్ల కాలేదు — తీసుకోమని చెప్పండి అన్నట్లు శకుంతలమ్మవైపు చూసింది — కాని ఆవిడనోరు మెదపాల్సిన అవసరం లేకపోయింది — టీపాయ్‌మీది మండపాన్ని చేతిలోకి తీసుకుని 'సరే తీసుకుంటాను — నిజం చెప్పొద్దూ — మీరు గబుక్కున అలా పరుగెత్తుకు వెళ్ళేసరికి మిగిలిపోయిన ఆ నాలుగో బొట్టుపెట్టె తెచ్చి నాకిస్తారేమో అనుకున్నా...'

అతనిమాటలు పూర్తికాకుండానే అందరూ కిసుక్కున నవ్వేశారు — త్రుటికాలం వాళ్ళముగ్గురి మొహాలలోనూ ఆవరించుకున్న మబ్బుతెరలు మాయం అయ్యాయి. ఒక్కక్షణంసేపు స్తంభించిపోయిన కాలంలో చలనం వచ్చినట్లూ, ఊపిరి సలపక ఉక్కిరిబిక్కిరి అయిపోయినట్లున్న వాతావరణం మళ్ళీ ఉల్లాసంగా మారిపోయినట్లు అనిపించింది.

క్షణం క్రితం — 'ఛ — పొరపాటు చేశానా,' అనుకున్న సురేఖ ఆ భావాన్ని పైకి కనపడనీయకుండా,

'అయ్యో బాబోయ్ — మీరు ఏమీ పట్టించుకోనట్లుంటారే కాని ఎవరెవరు ఏమేం కొన్నదీ కూడా గుర్తు వుందన్నమాట,' అంది సిగ్గుగా నవ్వుతూ.

'అదే మరి నాలో ప్రత్యేకత.' మరోసారి ముచ్చటగా చేతిలో వస్తువు చూసి దాన్ని పెట్టెలో పెట్టేసి, 'ఊఁ రండి త్వరగా,' అంటూ కారువైపుకి నడిచాడు.

'ఎవని ప్రత్యేకం అడిగి పుచ్చుకున్నావు — మరి మమ్మల్నేమంటావు,' అంది సరోజ వెనకే నడుస్తూ.

'నాక్కావలసినప్పుడు చెప్తాలే — ముందు కారెక్కండి,' అన్నాడతను తలుపు తెరచి ఎక్కండి అన్నట్లు పట్టుకుని.

'నేను రాను,' అనాలని నోటి చివరిదాకా వచ్చిన మాటలు అలాగే మింగేసి వాళ్ళతోపాటు కారు ఎక్కింది సురేఖ.

'మీరు వూరికి ఎప్పుడు వెళ్తారు,' అన్నాడు మాధవ్.

'రేపో ఎల్లుండో వెళ్తాను — ఇంకెప్పుడొస్తావు అంటూ ఇవాళ అమ్మ దగ్గర్నించి ఉత్తరం కూడా వచ్చింది,' అంది సురేఖ.

(ఇంకా ఉంది)



# ఉడుపతి ని గురించిన ఊహాలు

బులుసు వేంకటరమణయ్య



తక్కిన గ్రహాలన్నింటికంటే చంద్ర గ్రహానికి యిప్పుడు ప్రాధాన్యం కానవస్తున్నది. చంద్రమండలంలో ప్రవేశించడానికి ఈ నడుమ మానవుడు జరుపుతున్న ప్రయత్నాలు ప్రత్యేకాభివృద్ధిని పొందుతున్నాయి. కొద్ది దినాల్క్రిందట ముగ్గురు అమెరికనులు భూమి యొక్క గురుత్వాకర్షణ శక్తిని అతిక్రమించి చంద్రుడి పరిధిలో ప్రవేశించి, చంద్రుని చుట్టూ ప్రదక్షిణాలుచేసి తిరిగి సురక్షితంగా భూమండలం చేరుకోవడం ఘనవిజయంగా ప్రపంచం అంతా ప్రశంసించింది.

కొద్దికాలంలో మానవుడు చంద్రుడిపై అడుగు మోపవచ్చు. అలా జరిగితె ఆశ్చర్యపడ నక్కర్లేదు

అంగారక గ్రహంలో జీవరాసులుంటే ఉండవచ్చునని, చంద్రుడిలో వుండడానికి అవకాశం లేదనీ శాస్త్రవేత్తల ఊహ. చంద్రుడిలో ప్రాణులున్నాయా లేవా ? మానవుడు అక్కడ జీవించగలడా, లేడా అనేది వేరే విషయం.

మన పురాణాలను బట్టి చూస్తే భూలోకంవలెనే తక్కిన లోకాలు ఉన్నాయనీ, చంద్రలోకంలో ప్రజలు ఉన్నారనీ తెలుస్తున్నది. అవి అతిశయోక్తు లయినా కావచ్చు.

ఇక—

పురుషసూక్తంలో భగవంతుణ్ణి వర్ణిస్తున్నప్పుడు.

'చంద్రమా మనసో జాతః
చక్షోః సూర్యో అజాయత
ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ
ప్రాణాద్వాయు రజాయత.'

అని ఆయన మనస్సునుండి చంద్రుడు పుట్టినట్లు చెప్పబడింది. భగవంతుని మనస్సు చల్లనిది. అందులోనుంచి చల్లని కాంతులు వెదచల్లే చంద్రుడు పుట్టడమూ, తేజోరూపమైన చక్షుస్సునుంచి సూర్యుడు ఉద్భవించడమూ ఉచితంగానే ఉన్నది

చంద్రుడు పాలసముద్రంనుంచి ఉద్భవించాడని మనవారు తెలిపినారు తెల్లని కాంతులను వెదచల్లే చంద్రుడు పాల సముద్రంనుండి పుట్టడం సబబుగానే ఉన్నది. ఈ విషయం మన కవులకు బాగా




వచ్చినట్లున్నది. ప్రభువులనూ, కృతిభర్తలనూ వర్ణించినప్పుడూ, తమ ఆధిక్యాన్ని తెలిపేడప్పుడూ '...వంశపయః పారావార రాకా సుధాకర' అని వ్రాస్తూ చంద్రుడి పోలికను స్వీకరిస్తారు.

చంద్రుడు అమృతకరుడు. చంద్ర కిరణాల్లో అమృతం వుండడంవల్ల ఆ పేరు వచ్చిందట ! దేవతలకు ఆ కిరణాలే ఆహారమట ! ఈ విషయాన్నే ఒక కవి కుమారుడు,

కలువల పాలి పంట సుర
కాండవు టాకటి వంట బల్వియో
గుల కరకాలి మంట రవి
కూరిమి జంట...'

అని గానం చేసివున్నాడు.

సూర్యుడు ఆరోగ్యకారకుడని 'ఆరోగ్యం భాస్కరా దిఛ్ఛేత్' అనే సూక్తి తెలుపుతున్నది. అతని సహచరుడైన చంద్రుడో — ఓషధీశుడు ! చంద్రుడి చల్లని కిరణాలు ప్రసరించినప్పుడే ఓషధులు వృద్ధి పొందుతాయి. చంద్రుడిచ్చే ఓషధులను సేవిస్తేనే భాస్కరుడు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాడు.

కవుల కావ్యాలకు చంద్రుడు జీవనౌషధం ! చంద్రుడి ప్రసక్తిలేనిదీ ఏ కావ్యమూ తయారు కాలేదు. ముఖ్యంగా శృంగార కావ్యాలలో చంద్రుడు ఉండితీరాలి. అందమైన ముఖానికి ఉపమానం కావాలంటే చంద్రుడే రావాలి. చంద్రుడు అంత చక్కని దేవత ! అందువల్లనే చక్కని చుక్కలైన అశ్విన్యాదులయిన తారలు అతన్నే వివాహమాడారు. వారికి భర్త కాబట్టే అతడు ఉడుపతి అయ్యాడు.

మహాకవి కాళిదాసు ఒక అందకత్తెను వర్ణిస్తూ—

'ఝడితి ప్రవిశగేహే మా బహిస్తిష్ఠ కాంతే,
గ్రహణసమయ వేళా వర్తతే శీతరశ్మేః,
తవముఖ మకళంకం వీక్ష్యనూనం సరాహుః
గ్రసతి తవ ముఖేందుం పూర్ణమిందుం
విహాయ.'

అని అన్నాడు. 'ఓ యువతీ ! నీవు బయటి స్థలంలో ఉండక వెంటనే యింట్లోపలికి వెళ్లిపో ! ఏమంటే — ఇప్పుడు చంద్ర గ్రహణ సమయం ! నీముఖం మచ్చలేని చంద్రుడివలె ఉన్నందున, రాహువు అసలు చంద్రుణ్ణి విడిచిపెట్టి నీ ముఖమే చంద్రు

జనుకొని పెట్టుకోగలడు సుమీ!' అని దీని అభిప్రాయం!

వినోదంకోసం హాస్యంగా కవిత్వం చెప్పినప్పుడు కూడా చంద్రుడి తోడిపోలిక రాణిస్తుంది—ఒక దరిద్రబ్రాహ్మణుడు, కవి పక్షపాతి అయిన భోజమహారాజువద్ద చదువుటకై—ఎలాగో పదాలు కూర్చి

'భోజనం దేహి రాజేంద్ర
ఘృతసూప సమన్వితమ్'

అని సగంమాత్రం చెప్పి—ఆ మీద చేతగాక ఊరుకుంటే కాళిదాసు

'మాహిషంచ శరచ్చంద్ర
చంద్రికా ధవళం దధి'

అని రసవంతంగా పూర్తిచేశాడట! పప్పు నేతులతో భోజనం పెట్టాలని బ్రాహ్మణుడు కోరగా, మహాకవి 'శరత్కాల చంద్రుని వెన్నెలవలె తెల్లనైన బర్రె పెరుగునుకూడా దానితో చేర్చాడు.

నాలో మచ్చలకు కారణం
ఇదే...!!



అందమైన ముఖానికి చాదుచుక్క శోభను ఇనుమడింపజేస్తుంది. ఆ విధంగానే చంద్రునిలోని మచ్చ అతనికి అందాన్ని చేకూరుస్తుంది.

ఆ మచ్చను గురించిన్నీ అభిప్రాయభేదాలున్నాయి. కవుల ఊహల్నూ ఆభేదాల్లో చేరాయి. చంద్రుడిలో ఉన్న మచ్చ సముద్రపు బురద అని జింక అని కొందరూ, చెవులపిల్లి అని కొందరూ, భూచ్ఛాయ అని కొందరూ అంటున్నారు. అది ఆయా రూపాలతో కానవస్తుందని అర్థంకాని, నిజంగా జింకగాని, కుందేలుగాని ఉన్నాదని అభిప్రాయం కాదు. ఒకకవి 'రాత్రి సమయంలో వుండే చీకటిని అంతటిన్నీ చంద్రుడు తాగివేసి కడుపులో ఉంచుకున్నాడు; ఆ చీకటే ఆ మచ్చ అని మా వూహ' అని చమత్కరించాడు—ఆశ్లోకం యిది—

'అంకం కేపి శశంకిరే
జలనిధేః పంకం పరే మేనిరే
సారంగం కతిచిచ్చ
సంజగదిరే భూచ్ఛాయ మైచ్ఛన్ పరే,
ఇందౌ యద్దళితేంద్ర నీల
శకల శ్యామం దరీదృశ్యతే
తత్సాంద్రం నిశిపీత
మంధ తమసం కుక్షిస్థమాచక్ష్మహే.'

కవుల ఊహలకా లెక్కలేదు:

'హస్తినాపురంలోని రాజసౌధాలు చంద్రమండలాన్ని మించిన ఎత్తున ఉండడంవల్ల చంద్రుడికి గమన నిరోధం కలిగి, ఆ భవనాల చంద్రశాలల్లోని కిటికీలగుండా దూరివెళ్లాడు. అప్పుడా గదుల్లో వుండే దీపాలమసి, తెల్లటి అతని శరీరానికి అంటుకుని నల్లనిమచ్చ ఏర్పడింది. అతనిలో జింక వున్నదని మూర్ఖులు మాత్రమే అనుకుంటారు' అని అనంతభట్టు చంపూ భారతంలో.

'యస్యాము, దగ్గ నృపమందిర చంద్రశాలా వాతాయనే గతివశా ద్వపుషి ప్రసక్తామ్, దీప్రాగ ధూమమషికాం శిశిరాంశు బింబే మోహాత్ కురంగ ఇతి ముగ్ధజనా వదంతి.'

అని వర్ణించాడు. అయితే— ఆ మచ్చ ఏమిటో, చంద్రునిపై స్వేచ్ఛా విహారం చేసి, భూ మండలానికి తిరిగి వచ్చిన వైజ్ఞానికులే నిర్ణయించాలి:

చంద్రుడు లేకపోతే రాత్రే లేదు, అంధకార బంధురమైన రాత్రి నిశాకరుడు ఉండడంవల్లనే శోభిస్తుంది.

'యత్రాకృతి స్తత్రగుణాః' అని, చక్కనిరూపం ఉన్నచోట మంచిగుణాలు ఉండక తప్పదు. ఉడుపతి తన శరీరాన్నే దేవతలకు ఆహారంగా యిచ్చి, తాను క్షీణిస్తున్న ఉదారమూర్తి. అట్టివాడు—ఎంతో కష్టపడి—ప్రాణాలకు తెగించి మానవుడు తన దగ్గరకు వస్తే ఆదరం చూపకుండా వుంటాడా?

తప్పక స్వాగతం యిస్తాడనే ఊహించవచ్చును.

## దేవుడ్ని దాక్కోమని చెప్పు!

అందాల చందమామ వని
ప్రబంధాలు కీర్తించాయి
అందానికి అద్దంలా
అందరూ నిన్ను కొనియాడాట.
దూరపు కొండలు నునుపులాగా
దూరపు చంద్రుడు తెలుపు అనుకుంటే
చరిత్రనంతా తిరగ రాసెయ్యాలి
సాహిత్యాన్నంతా తిరగతోడెయ్యాలి.
ఎడారిలాంటి ఇసుక దిబ్బలతో నీ
బండారం బయటపడిపోయిందని,
మిట్టపల్లాలతో వికారంగావున్న—నీ
గుట్టు తెలిసిపోయిందని
అపురూపంగా ఎంచుకున్న మానవులే—నీ
స్వరూపం కనిపెట్టేశారని
సిగ్గుపడి పారిపోతున్నావా?
దయనీయమైన నీ పరిస్థితి
దహించి వేస్తోంది సుమా!
చూస్తున్నావుగా, నువ్వెంత
చోద్యమైపోతున్నావో?
'చందమామ రావె
జాబిల్లి రావె'—అని
జోకొడుతుంటె
నువ్వేవరో తెలిసిపోయిన బిడ్డ
గొంతెత్తి గీరపెడుతోంది!
అందమైన అమ్మాయితో
'చంద్ర బింబాననా—' అని
సరసమూడజూస్తే
విరసంచేస్తున్నది, హవ్వ!
కాదూ, కాయితంమీద రాద్దామంటే
కలం కదలడంలేదు!
మానవుని తెలివితేటలకు
తెలతెల్ల బోతున్న నీ ముఖం చూసి
తెల్లని వెన్నెలని భ్రమసి
మృగతృష్ణలో దాహంతీర్చుకునే
ప్రేయసీ ప్రియులు మాత్రం
ప్రేమ గుడ్డిదని మరోసారి
ప్రయోగాత్మకంగా చూపిస్తున్నారు!
మానవుడికి అసాధ్యం లేదనే
మాటకి సాక్షివయ్యావు!
నీ గుండెల్లో గుబులురేగి
అగ్ని పర్వతాలు బద్దలవుతున్నాయా?
అనంతయానం చేస్తున్న నిన్ను
మానవులు భయపెట్టేస్తున్నారని
మబ్బుల ముసుగులో
మాయమైపోదామనుకుంటున్నావా?
సృష్టికి ప్రతి సృష్టి చేస్తున్న, ఈ
మా 'నవ విశ్వామిత్రులు'
దేవుడ్ని కూడా జయించగలరని
దారిలో కనపడితే చెప్పు
దాక్కోమని చెప్పు!
దేవుడ్ని దాక్కోమని చెప్పు!! —సీతరాం




'మైనమ్మ జాతర ఎల్లుండి.'

అప్పుడే వచ్చి కూర్చున్న భర్తకు అన్నం పెడుతూ చెప్పింది లక్ష్మమ్మ.

ఆకలితో వున్నట్లున్నాడు రాఘవయ్య, భార్య మాటలు వినిపించుకోకుండా గబ గబా తింటున్నాడు.

'అంత తొందరేమొచ్చింది, మెల్లగా తినరాదు.'

భార్య మాటలిన్నాడో లేదో గాని, గబ గబ తినటం మానివేసి గ్లాసుడు మంచి నీళ్ళు త్రాగినాడు.

లక్ష్మమ్మ భర్తకు ఎన్నో సంగతులు చెబుదామనుకున్నది గాని, భర్త తొందరగా భోజనం చేయటం చూచి మెదలకుండా గడపమీద కూర్చుని కావలసింది వడ్డించటం మొదలుపెట్టింది. మజ్జిగపోస్తూ మళ్ళీ మైనమ్మ జాతర గుర్తుకు తెచ్చింది.

రాఘవయ్య తలూపాడు గుర్తుకు వచ్చినట్లుగా.

'సాయంత్రము రమ్మని నాగరాజుకు కబురు పంపుతాను' భర్తకు తాంబూల మిస్తూ చెప్పింది.

భార్య యిచ్చిన తాంబూలం నోట్లో వేసుకుంటూ 'మళ్ళీ నాకోసం చూడటం దేనికి, అతనికిచ్చేవి యిచ్చి, అమ్మవారి దగ్గర చెయ్యవలసిన యేర్పాట్లు చెయ్యమని చెప్పు' దండెంమీద పంచెను భుజం మీద వేసుకుని వాకిట్లోకి వెళ్ళిపోయినాడు.

ప్రతి సంవత్సరము జాతరకు నాలుగు రోజులు ముందరనుంచే అన్ని పనులు అవత లకునెట్టి, స్వయంగా గుడి దగ్గర పనులు చేయించే భర్త, ఈ యేడు ఆ బాధ్యత నంతా తనపై పెట్టేటప్పటికి లక్ష్మమ్మ ఆశ్చర్యపోయింది. 'కలికాలం వచ్చింది, ఎన్నికలు వస్తున్నాయిట, పార్టీ గొడవల్లో తిరుగుతూ, కులదేవతనే మర్చిపోయినారు' అంటూ లక్ష్మమ్మ వాకిట్లోకి వెళ్ళిన భర్తను చూస్తూ నిల్చుంది.

* * *

మైనమ్మ జాతర గూర్చి ఆ గ్రామం లోను, చుట్టుప్రక్కల గ్రామాలువారికి తప్ప బయటప్రపంచానికి నామ మాత్రంగా గూడ తెలియదు. ఆంధ్రదేశంలో ప్రతి గ్రామంలోను ఏదో నామంతో గ్రామదేవతలు కొలవబడుతుంటారు. అక్కడ ప్రతిరోజు పూజలు జరగవు. ఒక్క జాతర రోజున మాత్రమే భక్తులు తమ కానుకలను, ముడుపులను అర్పించుకుంటారు.

మైనమ్మ గుడి ఊరిబయట తుమ్మ చెట్ల మధ్య వంటరిగా నిలబడి వున్నది. జాతర రేపనగా, గుడి పెద్ద వూరిలోని రంగులువేసేవానిని పిల్చి, క్రొత్త గుడ్డలు పెట్టి, బియ్యం, పప్పు, ఉప్పు మొదలగు సామానుయిచ్చి, అమ్మవారి ద్వారానికి అడ్డంగా కట్టటానికి ఒక పట్టు తెరను యిస్తారు. సంప్రదాయానుసారము అమ్మ వారికి రంగులువేసి, అచ్చట జరగవలసిన కార్యము జరుపవలసిందిగా కోరతాడు కుల పెద్ద. అందుకు సమ్మతించినట్లుగా ఒక్క తాంబూలం మాత్రమే అక్కడ వేసుకొని, వస్తువులు తనవెంట తీసుకువెళ్తాడు.

అమ్మవారికి రంగువేసేరోజున కుమ్మరి చాలా మడి ఆచారములతో ఉండవలెను. మద్యము కాని మరేది ముట్టకూడదు. ఊరు మాటుమణిగిన తరువాత ఊరి బావి దగ్గర స్నానంచేసి, గుడి పెద్ద యిచ్చిన

క్రొత్త గుడ్డలు కట్టుకొని, పెట్రొమాక్సు దీపం తీసుకొని వంటరిగా గుడి దగ్గరకు వెళతాడు. ఆ సమయములో పెద్దలు కాని, పిల్లలు గాని ఎదురు రాకూడదు. అందుకు తగిన యేర్పాట్లు ఊరి పెద్దలు చేస్తారు.

రాత్రిపూట వంటరిగా ఆ ప్రదేశానికి పోవటానికి దడుస్తారు గాని, ఆ రోజు మాత్రము కుమ్మరి, ఏ విధమైన జంకు గొంకులు లేకుండా ముందుకు సాగిపోయి, నిశ్శబ్దం తాండవిస్తున్న ఆ గుడి ముందర దీపం పెట్టగానే, ఆ వెలుతురికి గబ్బిళాలు ఒక్కసారి కిచ కిచ మంటూ గోలచేస్తాయి. నామ మాత్రంగా చెక్క తలుపులకు చుట్టిన తీగెను తొలగించి లోపలికి అడుగు పెట్టగానే గబ్బిళాలు ముఖంనిండా కప్పివేస్తాయి.

*　　*　　*

యింటినుండి బయలుదేరిన రాఘవయ్య మునసబుగారితో మాట్లాడి పొలానికి వెళదామని రోడ్డు మలుపు తిరిగేసరికి ఎదురుగా హైస్కూలు హెడ్‌మాష్టరుగారు దర్శనమిచ్చారు. ఆయనతోపాటు ఒక యువతికూడ వున్నది. రాఘవయ్యను చూడగానే మాష్టరుగారు 'నమస్కారం' అంటూ చేతులు జోడించారు. రాఘవయ్యకూడ ప్రతి నమస్కారంచేస్తూ ప్రక్కనామె ఎవరన్నట్లు చూచాడు. 'క్రొత్తగా మన స్కూలుకు వచ్చిన టీచరుగారు' అంటూ ఆమెను పరిచయము చేసినాడు. ఆమెకుకూడ రాఘవయ్య నమస్కారంచేస్తూ 'ప్రస్తుతము ఎక్కడ వుంటున్నారని' ప్రశ్నించాడు. 'రాజుగారి యిల్లు చూపించుదామని తీసుకెళుతున్నాను' వెంటనే పంతులుగారు సమాధానమిచ్చారు. పనుందని రాఘవయ్య ముందుకు సాగిపోయినాడు.

దారి పొడుగునా హెడ్‌మాష్టరుగారు, రాఘవయ్య స్థితిగతులు, మంచి చెడ్డలను గూర్చి క్రొత్తగా వచ్చిన పంతులమ్మగారికి చెప్పుకుంటూ నడక సాగించాడు.

*　　*　　*

రాఘవయ్య పొలం చేరేసరికి, వీరాయి గొడ్లకు పచ్చిగడ్డి కోస్తున్నాడు కాబోలు, దొరను చూడగానె 'దణ్ణం బాబు' అంటూ చేతులు కట్టుకొనివచ్చి నిలబడ్డాడు.

దగ్గిరలోనేవున్న నూతి గట్టుపై కూర్చుని జేబులోంచి పొగాకుపాయ ఒకటి తీసి చుట్ట చుట్టటం మొదలుపెట్టినాడు. యెప్పుడె వస్తాడని వెళ్ళి వీరాయి కోసిన గడ్డిని మోపుకట్టి, గొడ్లకేసే కుర్రాడి నెత్తినబెట్టి తిరిగివచ్చి దొరకు దగ్గరగా కూర్చున్నాడు.

వాడితో కాసేపు పొలం విషయాలు, పైరుసంగతులు మాట్లాడుతూ కూర్చున్నాడు. చాలా కాలానికి పొలంమీదకు వచ్చిన దొరనుచూచి వీరాయి సంతోషంగా అన్నిటికి సమాధాన మిస్తున్నాడు. పొగాకు మంచిది కానట్లుంది చుట్ట బాగా కాలలేదు. దూరంగా విసిరివేసాడు.

'చొప్పమ్మ దగ్గర మంచి సరుకు వుందిరా?' రాఘవయ్య ఏదో ఆలోచిస్తున్న వీరాయిని ప్రశ్నించాడు:

'వున్నదనుకుంటాను దొర, ఇప్పుడు అక్కడనుండి దుకాణంతీసి తూర్పువైపున మన వాములదగ్గర పెట్టింది దొర.'

'అక్కడ బాగా సాగటంలేదా ?'

'ఏమోదొర, ఈ మధ్య పోలీసోళ్ళ గొడవ ఎక్కువయి పోయింది దొర. అదిగాక రాజుగారేమో అక్కడనుండి తీయకపోతే పోలీసు రిపోర్టు యిస్తానని చెప్పినారుట.'

రాజుగారిపేరు వినగానే దారిలో హెడ్ మాష్టరుగారి ప్రక్కనున్న అమ్మాయి గుర్తుకొచ్చింది.

'రాజుగారియింట్లో ఇదివరకున్న కాలువ గుమాస్తా ఖాళీ చేసాడేమిరా' నొప్పి పుట్టినట్లున్నాయి కాలు బార జాపినాడు రాఘవయ్య.

'అవుననుకుంటాను దొర, ఈ మధ్య బండిమీద సామాను తీసుకొనివెళ్ళటం చూచాను. అక్కడ ఎవరో పంతులమ్మ వస్తుందని విన్నాను.'

రాఘవయ్య మొఖంమీద కాస్త చిరునవ్వు తెచ్చుకుంటు 'అమ్మాయి బాగుంటుందను కుంటాను.'

'ఏమోదొర ! నేను చూడలేదు. అదిగాక ఈ రోజు ఆడపిల్లలు అందంగానే వుంటారు దొర' తనకుకూడ ప్రపంచ జ్ఞానం తెలుసునన్నట్లుగా రాఘవయ్యవంక చూచాడు వీరాయి.

రాఘవయ్య ఏదో గుర్తుకు వచ్చినట్లు 'రాజుగారి యింట్లో మీ ఆడదేగదా పని చేసేది, దానిద్వారా కదిలించు. పిట్టేమన్న పడుతుందేమో'

పచ్చిగడ్డి మొక్క పీకుతున్న వీరాయి తల ఎత్తకుండానే 'చిత్తం దొర' అంటూ మెదలకుండా తనపని చేయసాగాడు.

వీరాయి ఒక్క జీతగాడి క్రిందనేగాక రాఘవయ్యకు ఇతర విషయాల్లోకూడ సహాయపడ్తాడు. ముఖ్యంగా అవసరమైనప్పుడు ఆడవాళ్లనుకూడ సరఫరాచేస్తూ తన స్వామిభక్తిని వెల్లడిస్తూ ఉంటాడు. చొప్పమ్మకూతురు పెద్దమనిషి అయిందని చెబుదామా ? వద్దా ? అని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

'మైనమ్మ పెద్దదయింది దొర'

రాఘవయ్య మైనమ్మ ఎవరో అర్థం కానట్లు ఎవర్రా? అంటూ ప్రశ్నించాడు.

'చొప్పమ్మ కూతురు దొర ?'

'అప్పుడే పెద్దదయిందా' ఆశ్చర్యాన్ని ప్రకటించి 'అయితే చొప్పమ్మ పంట పండిందన్నమాట' అంటూ లేచి నిలబడ్డాడు.

రాఘవయ్య లేవటంచూచి వీరాయి గూడ లేచి నిలబడ్డాడు.

'కాలువపైన బద్దవుందిరా?' భుజంపైన పంచెను సరిచేసుకుంటు అడిగాడు.

'మొన్ననే క్రొత్తది వేశాము దొర'

రాఘవయ్య మెదలకుండా నూతి గట్టు దిగి, కాలువపై బద్దెదాటి మెరక పొలం మీదగా వాముల దొడ్లవైపుకు సాగిపోయినాడు.

యజమాని కనుమరుగైనదాకా చూచి, వీరాయి కూడ చేలమధ్యగా తన గుడిసెవైపు సాగిపోయినాడు.

*　　*　　*

పడమర కొండల్లోకి సూర్యుడు విశ్రమిస్తున్నాడు. పొలానికివెళ్ళిన పశువుల మందలు తిరిగివస్తున్నాయి. వాటి వెనక నెత్తిన గడ్డిమోపులు పెట్టుకొని కుర్రాళ్ళు తొందర తొందరగా నడుస్తున్నారు. ఇంటి దగ్గరవున్న లేగదూడలు తల్లులకోసం అరుస్తున్నాయి.

దొడ్లో పనిచేసుకుంటున్న లక్ష్మమ్మ దూడలు అరుపునిని పశువులొస్తున్నాయని గ్రహించి దొడ్డితలుపులు తీసింది. తలుపులు లీసితీయటంతోనే పశువులన్నీ ఒక్కసారి నీళ్లతొట్లదగ్గరకు పరిగెత్తినాయి. వాటి వెనకనే రొప్పుకుంటూ కుర్రాడు గడ్డిమోపు నెత్తిన పెట్టుకువచ్చాడు. లక్ష్మమ్మ

పడినెత్తి మీద బరువుదించి, పశువులను కట్టివేయటం ప్రారంభించింది.

'అయ్యగారు పొలందగ్గర వున్నారమ్మ గారు' పశువుల కుర్రాడు చెప్పింది విన్నదో లేదోగాని లక్ష్మమ్మ మాత్రము తలవంచుకొని దూడలని దూరంగా కట్టివేసి వచ్చింది.

కుర్రాడుపని అయిపోయింది వెళతా నన్నట్లుగా నెత్తిన పంచెతీసి దుమ్ము దులిపి భుజంపై వేసుకున్నాడు.

'నీవుపోయి నాగరాజుని పిల్చుకురా, గడ్డి నేవేస్తాలే' అంటూ లక్ష్మమ్మ కుర్రాడికి పని తగిలించింది.

నాగరాజు అంటే మొదట అర్థం కానట్లుంది. 'ఏ నాగరాజు అమ్మగారు' అంటూ ప్రశ్నించాడు.

'అదేరా ప్రతియేడు మైనమ్మకు రంగు వేయదు జయరాజు కొడుకు'

తెలుసన్నట్లు తలూపుకుంటూ కుర్రాడు వాకిట్లోకి పరిగెత్తాడు.

కుర్రాడు బయటకు వెళ్ళగానే దొడ్డి తలుపులువేసి, గొడ్ల ముందర గడ్డివేసి వంటపని చేసుకోటానికి యింట్లోకి వెళ్ళింది.

* * *

పొలం నుండి బయలుదేరిన రాఘవయ్య నరాసరి చొప్పమ్మ సారా దుకాణం దగ్గరకు చేరుకున్నాడు.

రాఘవయ్యను చూడగానే సారా డబ్బా ముందు కూర్చున్న చొప్పమ్మ 'దండం దొర! చాలా రోజులకు మాపై దయ

# మైనమ్మ దేవత

కలిగింది' అంటూ రెండు చేతులు జోడించింది నవ్వుతూ,

చిరునవ్వుతో 'వ్యాపారం బాగా సాగుతున్నట్లుందే, ఇక్కడికి మార్చావు.'

'మామూలుగానే వుందిదొరా, అక్కడ పోలీసోళ్ల గోల ఎక్కువయింది దొర.'

'వాళ్ళకు మామూలు యివ్వటం లేదా.'

'యిస్తునే వున్నాను దొర, అదిగాక యింటికి కూడ దూరమైంది దొర.'

రాఘవయ్య చొప్పమ్మకు పది అడుగుల దూరంలో కూర్చుని, పాల డబ్బాలో పోసి యిచ్చిన సారాను రెండుమూడు డబ్బాలు పట్టించాడు.

మానవుడు ఎంత వింత పనులు చేస్తాడోకదా, ఊర్లో పెద్దమనిషిగా, సంఘసంస్కర్తగా చెలామణి అవుతూ, ఊరికి దూరంగా పశువులు తినే గడ్డి వాముల మధ్య, కిరసనాయిలు డబ్బాలో నిల్వ ఉంచిన సారాను అమృతంలాగా సేవిస్తూ కబుర్లు చెబుతున్నాడంటే.

సాధ్యమైంతవరకు తెలుగుదేశంలో ఈ వ్యాపారాన్ని ఎక్కువగా ఆడవాళ్లు నడుపుతుంటారు. భర్త సారా బట్టీలతో కుస్తీ పడుతుంటే, భార్య చిరునవ్వులతో వచ్చిన వారికి కబుర్లు చెబుతూ, పాల డబ్బాలో మధువును పోసి అందిస్తుంది. ఖర్మకాలి ఒకవేళ భర్త కనుక జైల్లో కూర్చుంటే,




భార్య దిగులు చింతా లేకుండా వ్యాపారం జాగ్రత్తగా నడుపుతూ భర్తకోసం ఎదురు చూస్తూ కాలం గడుపుతుంది.

ఇదే రకానికి చెందిన చొప్పమ్మ భర్త మాత్రము ఎప్పుడూ త్రాగి తందానాలు ఆడుతుంటే వాడి జీవాన వాడిని వదిలేసింది. పొరుగు ఊరిలోని బట్టీ దగ్గర నుండి రహస్యంగా సారా తెచ్చి యిక్కడ అమ్ముతూ ఒక్కగా నొక్క కూతురు కోసం ఈ పాడుపని చెయ్యాల్సి వచ్చిందని అప్పుడప్పుడు అనుకుంటూ వుంటుంది. ఒకటి రెండుసార్లు పోలీసులు పట్టుకొని కేసులు పెట్టారుగాని రాఘవయ్య జరిమానా చెల్లించి విడిపించుకొచ్చాడు.

'సరుకు ఎట్లావుంది దొర' పరధ్యాన్నంగా వున్న రాఘవయ్యను అడిగింది.

'సరుకుకేం బ్రహ్మాండంగా వుంది, ఒక్కదానివే వున్నావు మైనమ్మేది'?

'అమ్మాయి పెద్దదయింది దొర, అందుకని యింటి దగ్గరే వుంటుంది.'

రాఘవయ్య సూటిగా చొప్పమ్మ కళ్లలోకి చూస్తు 'మేం చూస్తే దిష్టి తగులుతుందా' అని అడిగాడు.

చొప్పమ్మ సిగ్గుపడుతూ 'పెద్దోళ్లు మీ దయ లేకుంటే ఎట్ల దొర.

చొప్పమ్మ మర్యాద యిచ్చినందుకు రాఘవయ్య సంతోషించాడు. ఇంకా మాట్లాడుదామని ప్రయత్నించాడుగాని, సరకుకోసం వచ్చేవాళ్లు ఎక్కువయినారు. కాసేపు కూర్చుని అక్కడనుండ మెల్లగా లేచి మునసబుగారింటికి బయలుదేరినాడు.

* * *

వంటింట్లో కూర్చున్న లక్ష్మమ్మకు ఎవరో వీధివాకిలి తీస్తున్న శబ్దం వినవచ్చింది. బహుశ భర్త వచ్చాడేమోనని మెదలకుండా వూరుకుంది.

'అమ్మగారు' అంటూ కుర్రాడుకేక వేసేసరికి చేస్తున్నపని వదలి బయటికి వచ్చింది.

'నాగరాజుగారు వస్తున్నారమ్మగారు' లక్ష్మమ్మను చూడగానే చెప్పి, యింటికి వెళతానన్నట్లుగా నిలబడినాడు.

అది గ్రహించిన లక్ష్మమ్మ వాణ్ణి పంపివేసి లోపలనుండి నాగరాజుకోసం కుర్చీ తెచ్చి వాకిట్లోవేసి గుమ్మంవంక చూస్తు నిల్చుంది.

'నమస్కారం' — అంటూ నాగరాజు

లోపలికిరాగానే, లక్ష్మమ్మ కూర్చోమని కుర్చీ చూపించి లోపలికి వెళ్లింది.

ఈ సంవత్సరమే నాగరాజు అమ్మవారికి రంగువేయటం ప్రారంభము. ఇంతవరకు వాళ్లతండ్రి వేసేవాడు. ఆయన చనిపోవటంతో పెద్దకుమారుడయిన నాగరాజు ఆ కార్యమునకు పూనుకోవలసి వచ్చింది.

కావలసిన వస్తువులన్నీ ఒక పళ్లెంలో పెట్టి మరొక పళ్లెంలో పట్టుతెర, క్రొత్తగుడ్డలుతెచ్చి నాగరాజు ముందర వుంచింది లక్ష్మమ్మ.

పాపం ! తండ్రి గుర్తుకు వచ్చాడు గాబోలు నాగరాజుకి ఒక్కసారి కళ్ల వెంబడి నీళ్లు తిరిగినాయి

లక్ష్మమ్మ కళ్లనీళ్లు తుడుచుకుంటూ 'పెద్దవాళ్లయిన తర్వాత ఏంచేస్తాం బాబూ! ధైర్యంగావుండి మనపెద్దలు మన మీదవుంచిన భారాన్ని ఎటువంటి అరమరికలులేకుండా నడపాలి బాబు'

అవునన్నట్లుగా తలూపుతూ వణికే చేతులతో తాంబూలం అందుకొని, బియ్యం, పప్పులు సంచిలో పోసుకొని 'వెళ్లొస్తా' నంటూ గడపదిగినాడు

గడపదిగి వెళుతున్న నాగరాజునుచూస్తు లక్ష్మమ్మ అట్లాగే స్తంభాన్ని ఆనుకొని మైనమ్మనుగూర్చి ఆలోచిస్తున్నది.

'దాదాపు రెండు శతాబ్దముల క్రిందట రాఘవయ్య వంశములోని రామచంద్రయ్య, త్రాగిన మైకములో మైనమ్మనే కన్నెపిల్లను బలత్కరించాడు. రెండురోజుల క్రితమే ఆమె వివాహము బొమ్మలుచెక్కే మల్లయ్య రాజుతో నిశ్చయమై పోయింది. కామాంధుడైన రామచంద్రయ్యను మైనమ్మ ఎన్నోవిధాల బతిమాలింది కాని, అవన్నీకూడ వ్యర్థమైపోగా, ఆమె ఊరిబయట చెరువులోబడి ఆత్మహత్య చేసుకుంది. తన శీలాన్ని చెరిచినందుకు శాపఫలితంగా రామచంద్రయ్య వంశము నామరూపాలు లేకుండా చేస్తానని ప్రతిన బూనింది. కాని అతని తల్లిదండ్రుల ప్రార్థనవలన శాంతించి, ఆ నాటినుండి కులదేవతయై వారిచేత ప్రతియేడు పూజలందుకొనటం మొదలుపెట్టింది.

'అట్లా నుల్చున్నావు దేనికి' అంటూ భర్త లోపలికి వెళ్లేసరికి లక్ష్మమ్మ తల వంచుకొని భర్త ననుసరించింది.

* * *

# మైనమ్మ దేవత

మరునాడు సంజవేళ నాగరాజు క్రమం తప్పకుండా స్నానంచేసి వంటరిగా లైటు తీసుకొని మైనమ్మ గుడివైపు బయలు దేరినాడు. ఊరు దూరమవుతున్న కొద్ది మైనమ్మగుడి దగ్గరవుతుంది. లైటు వెలుతురు పడటంలోనే చెట్లపైనుండి పక్షులధ్వని ఆగిపోతున్నది. గుడిదగ్గర జరిన నాగరాజు లైటు క్రిందపెట్టి ఒక నిట్టూర్పు విడిచాడు. నామమాత్రంగా వున్న తలుపులకు చుట్టిన తీగనుతీసి గుడిలో లోపలికి అడుగుపెట్టగానే గబ్బిలాలన్నీ చప్పుడుచేస్తూ లైటుచుట్టూ ముసురుకున్నాయి. నాగరాజు మైనమ్మకు నమస్కారంచేసి, పాదాల దగ్గరవున్న ఆకు అలములను తీసివేసి శుభ్రపర్చినాడు. చెయ్యి వెయ్యగానే అమ్మ మెడలోని పూలదండలు చేతిలోకి ఊడివచ్చినాయి. నిన్నటివీ మొన్నటివీ సంవత్సరం నాటివి. బయట పంపు నుండి నీళ్ళుతెచ్చి విగ్రహాన్ని శుభ్రంగా కడిగి, మక్కపోయిన వేళకు రంగులు దిద్ది తెచ్చినపాత చాపను గుడిబయట నున్న బలిపీఠముపైకి ఉంచి, పట్టుతెరను వాకిలికి అడ్డముగా కట్టాడు. నిన్నటిదాక నిద్రపోతున్న విగ్రహము, యిప్పుడు ప్రళయ తాండవము చేస్తున్నట్లు భయంకరముగా వున్నది.

నాగరాజు అమ్మవారిదగ్గర పూజచేసుకొని బయటకు వచ్చేసరికి తూర్పున తెల్లవారుతుంది. అప్పుడే వర్తకులు జాతరలో అమ్మటానికి రకరకాల సరుకులతో గుడి చుట్టూతా దుకాణాలు సిద్ధం చేస్తున్నారు. మాట్లాడకుండా తల వంచుకొని నాగరాజు ఊరివైపుకు సాగిపోయినాడు.

ఎప్పుడూ ప్రశాంతముగా వుండే మైనమ్మ గుడి, ఆ రోజు యిసుకవేస్తే రాలని జనంతో కిట కిట లాడుతున్నాది. భక్తులు బయటనుండే తమ ముడుపులను అమ్మకు చెల్లించుకుంటున్నారు రాఘవయ్య దంపతులు బలిపీఠముపై వడ్లు పోయటంతో, వచ్చిన భక్తులుకూడ బలిపీఠముపై వడ్లు పోయటం మొదలుపెట్టారు. సాయంత్రానికి దాదాపు పది అడుగుల యెత్తున ధాన్యపురాసి నిలబడివున్నది. అందరిని పంపించి, నాగరాజు అమ్మకు ధాన్యపురాశికి అడ్డగావున్న తెరను తొలగించి యింటికి వెళ్ళిపోయినాడు. ఆ రోజు రాత్రి ఊళ్ళో జరుగుతున్న కథ వినటానికి గ్రామం, గ్రామం అక్కడే కూర్చుని ఉన్నది ఒక్క చొప్పమ్మ తప్ప.

జాతరలో హుషారుగా తిరిగిన రాఘవయ్య సాయంత్రము చొప్పమ్మ దగ్గర సారా దిట్టంగా పట్టించి మైనమ్మను పొందటానికై చొప్పమ్మ యింట్లో దూరాడు. తల్లితో కథ వినటానికి సిద్ధమవుతున్న మైనమ్మ త్రాగుతూ వస్తున్న రాఘవయ్యను చూడగానే దిక్కుతోచక దొడ్డి గుమ్మంలోంచి బయటకు పరిగెత్తింది. నిషాలోవున్న రాఘవయ్య ఏ మాత్రం జాగు చెయ్యకుండా వెంబడించాడు. మైనమ్మ తల్లి దగ్గరకు పోదామనుకుంది కాని అడ్డంగా ముళ్ళకంచె వుండడంచేత జాతర జరిగిన వైపుకు పరిగెత్తింది, మానరక్షణ కోసం. కాని అప్పటికే అక్కడ నిశ్శబ్దం తాండవిస్తుంది. మైనమ్మ మొదట గుడి వెనక దాక్కుంది. రాఘవయ్య వచ్చి చుట్టూరా వెతికాడు గాని మైనమ్మ కనపడలేదు. నిషా తలకి ఎక్కుతుంది. ఆడదాన్ని పొందలేకపోయాననే పౌరుషం గుండెలో రాసుకుంటుంది. గుడి వెనుక నున్న మైనమ్మ మెల్లగా బలిపీఠముపై వున్న ధాన్యపు రాశివెనక దాగటానికి పరిగెత్తింది. పాదాల శబ్దం విన్న రాఘవయ్య మైనమ్మను పట్టుకుందామని, అమ్మవారికి ధాన్యపురాశికి మధ్యగా పరిగెత్తాడు. రెండడుగులు దాటాడో లేదో 'అమ్మో' అంటూ బిగ్గరగా అరుస్తూ నెత్తురు కక్కుకుంటూ ధాన్యపురాశి ముందర పడిపోయ్యాడు. బిత్తరపోయిన మైనమ్మ ఏమి చెయ్యాలో తోచక, మెదలకుండా యింటికి వెళ్ళిపోయింది.

అనాదిగా వస్తున్న ఆచారము ప్రకారము తెల్లవారేసరికి ధాన్యపురాశి అమ్మవారి చూపుల వలన ముత్యపువ్వులు లాగా విచ్చుకొని పేలాలు కావలిసింది. కాని రాఘవయ్యను బలికొన్న మైనమ్మ ధాన్యపు రాశిని ఏ మాత్రం ముట్టుకొనలేదు.

తెల్లవారిన తర్వాత ప్రసాదం తీసుకు వెళదామని వచ్చిన భక్తులు రక్తం మడుగులో వున్న రాఘవయ్యను చూచి ఆశ్చర్య పడినారు. చెక్కు చెదరని ధాన్యపు రాశిని చూచి ముక్కుమీద వేలేసుకున్నారు.

లక్ష్మమ్మ గుండెలు పగిలేటట్లు ఏడ్చింది. రాఘవయ్యకు సరైన శాస్తి జరిగిందని చొప్పమ్మ సంతోషించింది. రాత్రి సంగతి తెలియని ప్రజలు రాఘవయ్య మరణం గూర్చి అనేక విధాలుగా చెప్పుకోవటం ప్రారంభించారు.

పసుపు కుంకుమ పోగొట్టుకుంది లక్ష్మమ్మ. కన్నెరికం కాపాడుకుంది మైనమ్మ. అన్ని చూస్తున్న వీరాయి మాత్రము మైనమ్మ నిజంగా దేవతే అనుకుంటూ వచ్చిన వాళ్ళలో తాను గూడ కలిసి పోయినాడు. ●



యధార్థం కాని దాన్ని; మనం తెలియక యధార్థమనే అనుకుని దృఢ సంకల్పంతో మన విహిత కృత్యాన్ని జరిపినట్లయితే — అది యదార్థంగానే పరిణమిస్తుంది. అంటే — యదార్థమైన దానివల్ల కలిగే ఫలం కలుగుతుంది. అయితే — అది యదార్థమనే సందేహం వుండకూడదు.

లౌకిక విషయాలపైని విరక్తి గల ఒక వ్యక్తి ముక్తి ఎలా కలుగుతుందా? అనే ఆలోచనలో పడ్డాడు. ఒకప్పుడు ఆతడు ఒక గొప్ప విద్వాంసుణ్ణి చూడడం తటస్థించింది. ఆయనతో తన కోరికను తెలుపగా — ఆ విద్వాంసుడు 'అయ్యా! పావనమైన గంగానది ఒడ్డున కొంతకాలం నియమంతో తపస్సు చేస్తే ముక్తి లభిస్తుంది' అని చెప్పాడు.

ఈ ముముక్షువు తన వూరి నుంచి చాలా దూరం వెళ్ళగా వెళ్ళగా ఒక యేరు కనబడింది. అదే గంగానది అనే నిశ్చయంతో దాని తీరాన ఆశ్రమం నిర్మించుకుని అయిదేళ్ళు తపస్సు చేశాడు. ఒకనాడు ఒక సన్యాసి ఆ దారంట పోతూ, యితన్ని చూచి అక్కడ వుండడానికి కారణం అడిగాడు. మోక్షార్థి ముక్తికోసం తాను గంగాతీరాన తపస్సు చేస్తున్నట్లు చెప్పాడు. ఆ సన్యాసి నవ్వి 'అయ్యో! మీ శ్రమ వ్యర్థమైంది, ఇది గంగానది కాదు, అది పెద్ద నది. ఎప్పుడూ ప్రవహిస్తూ వుంటుంది' అని చెప్పి వెళ్ళిపోయాడు.

తర్వాత ఆ ముముక్షువు మనసులో చాలా విచారించి, అక్కడి నుండి బయలుదేరి చాలా దూరం వెళ్ళగా, ఒక పెద్ద జీవనది కనిపించింది. అదే గంగ అనే నిశ్చయంతో దాని వొడ్డున కొన్నేళ్ళు తపస్సు చేశాడు. ఒకప్పుడు ఒక మహాయోగి ఆ మార్గాన వస్తూ యితనినిచూసి, తపః కారణాన్ని ప్రశ్నించాడు. ఆయన తన వృత్తాంతాన్ని తెలియజేశాడు. ఆయోగి 'అయ్యా! నీవు భ్రాంతిపడ్డావు. ఇది గంగా నది కాదు. అది ఉత్తరదిక్కున చాలా




దూరంలో ఉన్నది. దానివొడ్డున విశ్వేశ్వరుని నివాసమైన కాశీక్షేత్రం ఉంది. నీవు కాశీకిపోయి, గంగవొడ్డున కూర్చుండి కొద్ది కాలం తపస్సుచేసినా నీకోరిక సిద్ధిస్తుంది' అని చెప్పి వెళ్ళిపోయాడు.

మోక్షార్థి ఈ మాటలు విని క్రుంగిపోయాడు. రమారమీ పాతిక సంవత్సరాలు చేసిన తపస్సు వ్యర్థమైపోయిందని విచారించాడు. అప్పటికే అతడు మిక్కిలి ఛ్పరించిపోయాడు. నడిచే శక్తి లేదు. ఐనా పట్టుదలతో ఎలాగో కొన్ని నెలలకు కాశీ నగరం చేరుకున్నాడు. దూరంగా గంగా భవాని కనబడుతున్నది. ఎందరో స్నానాలు చేసి నదీతీరంలో జపాలు చేసుకోవడం కనిపించింది. కాని, బలహీనతచే, ఆయన నడవలేక అక్కడే గంగను తలచుకుంటూ ప్రాణాలు విడిచాడు.

అతన్ని యమభటులు తమ లోకానికి తీసుకొని పోతూవుండగా, శివభటులు అడ్డం వచ్చి 'అయ్యలారా! ఇతడు పాతికేళ్ళపాటు గంగానదిలో స్నానంచేస్తూ, నదీతీరంలో తపస్సు చేశాడు. ఇతనికి పరమేశ్వరుడు మోక్షం అనుగ్రహించాడు' అంటూ తమ వెంట తీసుకుపోయారు.

ఆ యదార్థాలయిన ఏళ్ళను గంగానదిగా భావించడంవల్లనే అతనికి గంగాస్నానఫలం, తత్తీర ప్రదేశ తపఃఫలం లభించాయి. కోరిన ముక్తి కైవసమయింది. ●

---






## జరిగిన కథ

భవానీప్రసాద్ జడ్జిగారు. రిటయిరయి విశ్రాంతి తీసుకుంటున్నారు. పట్టుదల, స్వాభిమానం ఆయనకి పుట్టుకతో వచ్చాయి. ఆయన భార్య లలితాంబ. కుమార్తె సంధ్యకి భర్త చని పోవడంతో పుట్టింట్లోనే వుంటున్నది. కొడుకు భవానీ శంకరం. అతని భార్య దుర్గ. దుర్గకి చాలా కాలం వరకు సంతానం కలగలేదు. ఇక కలుగుతుందనే ఆశ కూడా లేదు తల్లికి జబ్బు చేయడం వల్ల, ఆమెను చూడ్డానికని తండ్రితో పాటు యింటికి వెళ్తుంది దుర్గ. భవానీశంకరం డాక్టరీ చదువుకున్న గోవిందని మళ్లీ పెళ్లిచేసుకున్నాడు. సంధ్య ఎంతో బాధ పడింది. ఆ బాధ నంతా వుత్తరం ద్వారా దుర్గకి తెలియపరిచింది.

## 3

గోవిందకి యేడవమాసంలో హాల్లో వుయ్యాల బల్లమీద కూర్చోబెట్టి పండు ముత్తైదువలు పదిమందిలో గాజులు పెట్టిస్తూంటే మేడమీద తనగదిలోంచి చూసి చిన్నగా నిట్టూర్చింది సంధ్య. తల్లి పెత్తనం అంతా తన పైనే వేసుకుని వుత్సాహంతో కలియ తిరుగుతూంటే విల విల్లాడి పోయింది ఆపిల్ల హృదయం.

అన్నగారున్న గదిలోకివచ్చి చాలారోజుల తరువాత సంధ్య నెమ్మదిగా అన్నది: 'నీ కిప్పుడు యేమనిపిస్తోం దన్నయ్యా. ఆ వదిన్ని చూడాలని పించడం లేదూ ? యిప్పుడేం చేస్తున్నారో యేమైపోయారో అనే వూహే రావడంలేదూ.'

భవానీ శంకరం కళ్లుపైకెత్తి చెల్లెలి వైపు చూశాడు. అతని గుండెల్లో దిగులు కళ్లల్లో కొట్టొచ్చినట్లుగా ప్రతి ఫలిస్తోంది.

'అన్నయ్యా', సంధ్య దిగులుగా చూసింది.

భవానీ శంకరం గ్రహించాడు : 'నాకు తెలుసు సంధ్యా. యిప్పుడైనా వెళ్లి పిలుచుకు రమ్మనమనా అనుకుంటున్నావు. మీ వదిన రాదు సంధ్యా. ఆవిడ స్వాభిమానం గల అయినింటి ఆడపడుచు. నేను చేసిన పనికి మరొకరైతే నా బ్రతుకు నవ్వుల పాలు చేసేవారు. రెండు మూడు సార్లు రమ్మనమని రాశాను. అక్కడికి వెళ్లేవాళ్లతో చెప్పి పంపించాను. కానీ రాలేదు ... యెందుకు వొస్తుంది ? నేను దౌర్భాగ్యుడిని. సహనంగా మరికొన్నాళ్లు యెదురు చూసివుంటే దుర్గ కడుపు ఫలించి వుండే దేమో ? నేను వెడితే తను వస్తుం దంటావా ?'

సంధ్య తల వాల్చేసింది. గుండెల్లో దుఃఖం సన్నటిసెగకి కరిగిపోయే వెన్నకు మాదిరి అన్నగారి మాటలకి వెల్లువలా పైకి వచ్చేసింది. క్రింద శుభంగా పిల్ల చేతికి గాజులు తొడుగుతూంటే తనుకంట తడిపెట్టడం సబబుగా తోచలేదు. గోవింద పైని ద్వేషం కారుచిచ్చులా దహించివేసినా ఈ క్షణాన మాత్రం సంధ్యలో సంస్కారం తాలూకు బీజాణువులు సగర్వంగా పనిచేయ ప్రారంభించేయి. నిశ్శబ్దంగా కన్నీళ్లురాలి చీరకుచ్చెళ్లో ఐక్య అయిపోతున్నాయి. అంత బాధలోనూ నవ్వువచ్చింది సంధ్యకి. తను రాల్చే కన్నీరు పృధ్విలో పడిపోయి శాపంలా మారిపోరాదనే కాబోలు అవి చీరలో కలిసి పోతున్నాయి. మెల్లని స్వరంతో అన్నగారి వైపు దృష్టిని నిలిపి : 'నువ్వు ఒకసారి వెళ్లి వదిన్నిచూసి స్వయంగా క్షమాపణ కోరుకో అన్నయ్యా. వదిన రాకుండా వుండదు', అన్నది.

భవానీశంకరం లేచి నిలుచుని యెదురుగా తోరణాల్లా వ్రేల్లాడుతున్న బట్టల్ని సూట్‌కేస్‌లోకి సర్దేశాడు. క్రింద సన్నాయి పాట చెవిగూబల్ని చీల్చుకుంటూ పోతోంది. అతనికి ఆ క్షణంలో గడపదిగాలనిపించడం లేదు. అయినా భార్యకోసం, తను మనస్ఫూర్తిగా ప్రేమపెట్టిన యిల్లాలిని చూడాలనే కోరికలో అతను త్వర త్వరగా ప్రయాణానికి సిద్ధం అయేడు. సంధ్య మొహంలో కోటి మెర్క్యురీ లైట్లు ఒక్కసారి వెలిగాయి.

వెడుతూ వెడుతూ గోవిందని దగ్గరికి పిలిచి భవానీశంకరం జరిగింది చెబుతూ 'మరి వెళ్లనా,' అన్నాడు.

గోవింద నిండుగా నవ్వింది: 'వెళ్లిరండి' అంటూ.

* * *

మేఘంలేని వర్షాన్ని చూసి ఆశ్చర్య

పాయియి అవధానగాయి. అల్లుడిగారి ఆయన్ని నోటమాట పెకిలించనీయలేదు. సర్వమంగళ కాళ్ళకి నీళ్ళిచ్చి సంప్రదాయంగా జరిగే అలవాట్లలో లోపాన్ని రానివ్వలేదు. గంటా, రెండూ, మూడుగంటలు దాటిపోయినా దుర్గని అతను చూడలేకపోయేడు. అత్తగారిని నెమ్మదిగా అడిగాడు: 'దుర్గలేదా అత్తా',

సర్వమంగళ చాలా సేపటి వరకూ జవాబు యివ్వలేదు. దుర్గ అతనురావడం చూసిందనీ, తను భర్త యెదుటకు రానన్నదనీ చెప్పాలనిపించలేదు ఆవిడకి. కూతురు గది ద్వారాన్ని చూపిస్తూ 'ఆ గదిలో వున్నది వెళ్ళండి', అన్నది.

గదిద్వారం వరకూ వెళ్ళిన అతని అడుగులు లోపలికి వేస్తూంటే తడబడ్డాయి. తలుపు తెరిచి యెదురుగా చిక్కి శల్యంఅయిపోయిన భార్యని చూస్తూనే వుండేల్‌దెబ్బ తగిలిన పక్షిలా విలవిల్లాడిపోయాడు. రెండు చేతులూ చాపి కళ్ళతోనే సందేశాలు పంపేడు.

దుర్గ మంచందిగలేదు. గుడ్లప్పగించి భర్తవైపు చూస్తుండి పోయింది. భవానీశంకరం మంచందగ్గరగావచ్చి, భార్య పక్కనే కూర్చుని ఆవిడ తలమీద చేయి వేశాడు. అప్పటికీ దుర్గలో చలనంలేదు. అతనికళ్ళు అవిరామంగా వర్షిస్తున్నాయి! 'నాకు ఒక్కవుత్తరం రాయవలసింది దుర్గా. యెంతపని జరిగిపోయింది. నువ్వు మామూలు మనిషివి కావని నాకు చెప్పడం కూడా పాపమేనా దుర్గా. నేను చేసింది తప్పు. నా తప్పుని, క్షమించి నాతో మద్రాసు వచ్చేయి. గోవిందకి వేరే యేర్పాట్లు చేస్తాను. నిన్ను జీవితంలో వదిలిపెట్టను. నా తప్పిదాన్ని దేవుడు కూడా మన్నించడు. గోవిందని వదిలేసి...

దుర్గ అపరకాళిలా శివం యెత్తిన దానిలా వూగిపోయింది: 'యెంత సిగ్గులేని మాటన్నారు. గోవిందకి మరో యేర్పాటు చేస్తారు. కాకపోతే వదిలేస్తారు. నిండు చూలాల్ని వదిలిపెట్టి మీరు బావుకునేది యేముంది? పిల్లలు, పిల్లలనే నెపంతో ఆ పిల్లని అన్యాయం చేశారు.. యిప్పుడు ఆ కోరిక తీరగానే వదిలిపెట్టేస్తానంటున్నారు.

'నాకు తలితండ్రులున్నారు. ఆత్మీయులున్నారు. బ్రతికేందుకూ; సంఘంలో తలెత్తుకుని సగర్వంగా తిరిగేందుకూ ప్రపంచం సానుభూతి వుంది. నామీద మీకున్న ప్రేమకి కృతజ్ఞురాలిని గోవిందని యిప్పుడు కాదు మరెప్పుడూ వదిలిపెట్టకండి. మిమ్మల్ని నమ్ముకుని వచ్చింది. మీకు హృదయంవుందా అని ఆశ్చర్యంగా వుంది? యెంత చిత్రంగా ఆడుకుంటున్నారు జీవితాలతో.

'నేనా ?'

'ఆశ్చర్యం యేమీలేదు యిందులో. గోవిందని మభ్యపెట్టి పెళ్ళిచేసుకున్నారు. ఆ భ్రమలోనే ఆ పిల్లని సుఖంగా బ్రతకనివ్వండి. పాపం ఆ పిల్ల యీమాట వింటే యెంత బాధపడుతుంది'

'అయితే నువ్వురావా ?' భవానీశంకరం కళ్ళు అగ్నిగోళాల్ని ధిక్కరిస్తున్నాయి.

'రాను'

'యెంత ధైర్యం. నేను... నేనేవచ్చి నిన్ను ప్రాధేయపడుతున్నాననా నీకే అహం



కాలం.'

'అదేమీలేదు. నా భర్త ఒక్కగా నొక్క హృదయం చీలికలై ముక్కలైపోయింది. అదీ జన్మకి అతుక్కోలేదు. ఆ చీలికల మధ్య నేను బతకలేను. నాకు తల్లి తండ్రు లున్నారు. నేడోరేపో పుట్టబోయే పిల్లాడు...' దుర్గ రెండు చేతుల మధ్య మొహాన్ని దాచుకుని బావురుమంది. భవానీ శంకరం మారు మాట్లాడలేదు.

భార్యని ప్రేమగా కౌగలించుకుని ఓదార్చాలనీ, తన మనసుని విప్పి ఆవిడముందు పరచాలనీ యెన్నో అనుకున్నాడు. కానీ యేదీ చేయలేకపోయాడు. దుర్గ అతనికి దూరంగా జరిగి కూర్చున్నది. కొండంత ఆశతో, కోటి కోర్కెలతో, గతించని మమతతో అతను వచ్చాడు, రెట్టింపు నిరాశతో; రిక్తహస్తాలతో అత్తమామల దగ్గర సెలవు తీసుకున్నాడు. అతను రావడమూ వెళ్ళడమూ జరిగినా దుర్గలో మార్పు తీసుకురాలేకపోయేడు. నిండుగా గోవిందనుమించిన సౌందర్యంతో చిక్కినా తన రూపానికి చిహ్నంగా కదిలే దుర్గని తలుచుకున్నా అపురూపంగానే చూసుకుంటూ మెడ్రాసు చేరుకున్నాడు భవానీ శంకరం.

* * *

టాక్సీలోంచి దిగిన అన్నగారినీ, అతని వాలకాన్నీ చూసి సంధ్య హృదయం ద్రవీ

# అడకత్తెరలో మనిషి

భూతం అయిపోయింది. హాల్లో చిరకాలంగా తిష్టవేసుకున్న తల్లితండ్రులు యెదురేగి పరామర్శించలేదు. టాక్సీ డ్రైవరుకి డబ్బిచ్చి పంపేసి సూట్‌కేస్‌గదిలో పడేసిన అతనిమొహాన్ని చూస్తూంటే నీరు కారి పోయింది సంధ్య. గది గుమ్మందగ్గర ప్రతిహారిలా నిలుచున్న గోవింద భర్త చేతిని సానునయంగా అందుకుని గదిలోకి తీసుకు వెళ్ళింది. వెడుతూ వెడుతూ సంధ్య వైపు చూపువిసిరి, రమ్మన మన్నట్లుగా కదిలింది.

సంధ్య సోఫాలో కూర్చుంది. భవానీ శంకరం నిస్పృహగా అన్నాడు: 'విన్నావు కావు నువ్వు బలవంతంగా పంపేవు. అదిరాలేదు. యింక రాదు కూడా. అక్కడికీ గోవిందని వదిలేస్తాననీ, లేదా యేదో యేర్పాటుచేస్తాననీ గట్టిగానే చెప్పేను. మెత్తగా చివాట్లు వేసింది. యిప్పుడు మావదిన గర్భిణి సంధ్యా!'

సంధ్య కణతలకి గురిచూసి యినుప గుండు విసిరినట్లయింది. ఎదురుగా గోవింద క్షణకాలం స్థాణువుకు మల్లే స్తంభించి పోయింది. ద్వారందగ్గర నిలుచున్న భవానీ ప్రసాద్ దిమ్మెరపోయేరు. లలితాంబ కొయ్యబారిపోయింది. యెవరికివారే భయాందోళనలతో విచలితులైపోయేరు.

'నువ్వు బలవంతంగా తీసుకురావలసింది. వెళ్ళేముందు నాతో చెప్పివుంటే నేనూ వచ్చేదాన్ని; మీతండ్రీ కొడుకుల మనసుల్లో యేముంటాయో వూహించలేం.' లలితాంబ పెదాలచాటున దుఃఖాన్ని అపుకునే ప్రయత్నం చేయసాగింది.

భవానీప్రసాద్ భార్య భుజంమీద చేయి వేసి క్రిందికి నడిపించుకు వెళ్ళేరు. ఆయన హృదయం అతలాకుతలం అయిపోయింది.

రెండుచేతుల మధ్యా తలని దాచుకుని వౌనంగా వుండిపోయాడు భవానీ శంకరం.

సంధ్య గదిలోకి అడుగుపెట్టి తలుపులు బిగించుకుని భర్త మొహంలోకీ, సజీవంగా పలకరిస్తున్నట్లుండే అతని కళ్ళల్లోకీ చూస్తూ నవ్వుకుంది అంతదుఃఖంలోనూ!' అమ్మానాన్నా బజారుకి వెళ్ళేరు. అన్నయ్య లేడు. మీరు అడిగేరు గుర్తుందా ... ఈ టైఫాయిడ్‌లో నేనేపోతే పిల్లాడిని పెంచుకుని ఆస్తిని వాడికి అప్పగించు అని. యిన్నాళ్ళా ఆ కోరికకి జవాబు యివ్వలేక పోయేను. మీరు వెళ్ళిపోయేరు. మీరే ఒకవేళ బాబురూపంలో వదిన గర్భంలో ప్రవేశించలేదుకద. నేనువెళ్ళి వదిన్ని చూసివస్తాను.' అనుకుంటోంది తనలో తనే. రాత్రి లోకాన్ని చీకట్లో మూసేసింది. మంచంమీద వాలిన సంధ్య కళ్ళుతెరిచేసరికి తెల్లవారింది.

గోవింద వంటయింట్లో పనిలో నిమగ్నురాలై పోయింది. దుర్గ వెళ్ళిపోయాక సంధ్య ఆ చాయలకే వెళ్ళేది కాదు. ఎనిమిదిగంటలకి ఫలహారం, కాఫీ, పన్నెండుగంటలకి భోజనం యిలా అంచలంచెలుగా గుమ్మంలో హాజరుగా వుండేవి. గోవింద నెలలునిండి భారంగా తిరుగుతున్నా సంధ్య గమనించనట్లే వూరుకునేది. తండ్రి అస్వస్థత కారణంగా తల్లి ఆయన్నివదిలి గదిదాటి వచ్చేదికాదు అత్తమామలకీ, ఆడబిడ్డకీ, డిస్పెన్సరీకి వెళ్ళే భర్తకీ వేళకి టిఫిన్ కాఫీలు అందించే గోవింద విశ్రాంతిగా వూపిరి పీల్చుకునేందుకు టైము లేదని గ్రహించినా సంధ్య జోక్యం చేసుకునేదికాదు. కానీ... యివాళ్టిరోజున వదినగారికన్నా ముందుగా వంటయింట్లోకి జొరబడి పనంతా చకచకా చేస్తూంటే గోవింద పరుగున వచ్చేసింది. భయంతో, బెంగతో నేలమాపులు చూస్తూ వారగా నిలుచుంది. 'ఆలస్యం అయిపోయింది.



తొందరగా లేచే అలవాటు యెలా మారి పోయిందో ఈ రోజు. నేను కావాలని చేయలేదు సంధ్యా. ఒట్టు నన్ను నమ్మండి.'

సంధ్య తలెత్తి చూసేసరికి దొంగతనం చేసినదానిలా బాధపడే గోవింద సాక్షాత్కరించింది. సంధ్య కాఫీగ్లాసు చేత్తో అందుకుని గోవింద చేతిలోవుంచి:' యివాళ్టినుంచి మీరు చేయద్దు. నేనున్నాను. పొద్దు పోయిందని కాదు నేనులేచింది. రేపు బాబు నామీద నేరం వేస్తాడు. అమ్మ పక్కని పిన్ని, నాన్నపక్కన అత్త యేమై పోయారు. మా అమ్మలేస్తూ, కూర్చుంటే సాయం చేయకుండా, అనుకుంటూ. మీరు వెళ్లండి వదినా,' అన్నది నవ్వుతూ.

'వది...నా', గోవింద ఆశ్చర్యంగా చూసింది సంధ్యవైపు.

గోవింద భుజంమీద చేయివేసి ఆప్యాయంగా కళ్లల్లోకి చూస్తూ నవ్వింది సంధ్య:' మీరు కాలుపెట్టిన వేళావిశేషమే అయి వదిన నిండుమనిషైందని నాకు నమ్మకంగా తోస్తోంది. తెలిసో, తెలియకో మిమ్మల్ని కష్టపెట్టాను. అందుకు యిప్పుడైనా బాధపడుతున్నాను. మీరేం చేశారు మధ్య. దుర్గవదిన మనింటికి తప్పకుండా వస్తారు. ఆరోజేవస్తే మనకి అంతకుమించి కావలసింది యేముంటుంది?'

గోవింద దీర్ఘంగా నిట్టూరుస్తూ పీట మీద కూర్చుంది: 'అసలు విషయం మీకు తెలియదు. నన్ను చదివించింది మీ అన్నగారే. నా కెవరూ లేరు. ఆయన చెప్పినట్లు చేయడంతప్ప నాకింకేమి గత్యంతరం లేదు. బాబు పుట్టాక నేను వేరేచోట డిస్పెన్సరీ తెరిచి...

సంధ్య కనుబొమ్మలు ముడిపడి పోయాయి గోవింద చెప్పుకుపోతోంది: 'అన్నయ్య మీకు వేరే యేర్పాట్లు చేస్తే వన్నాడా?' అన్నది మధ్యలో అడ్డువస్తూ.

'యిన్నాళ్లూ అక్కయ్యని చూడాల్సిన అవసరం తోచలేదు. యిప్పుడు ఆవిడ పరిస్థితి కూడా అర్థంచేసుకోవాలి కద.'

'అయితే మీరు వూరుకున్నారా?'

'నవ్వింది గోవింద: 'యిందులో వూరుకోక పేచీ పెట్టవలసిన విషయాలేమున్నాయి సంధ్యా ఆవిడ యీ యింటి కోడలు. ముందు ఆవిడ తరువాతే నేను'

'కాదని నేనడంలేదు వదినా. మీరు భయపడవలసిన అవసరంలేదు. యిద్దరూ యీ యింటి కోడళ్లే. వదిన చదువుకోకపోయినా ఆడదానివేదన అర్థం చేసుకోగలదనే అనుకుంటున్నాను. మీరు పిరికిగా వెళ్లిపోవద్దు మీరు ప్రేమించి అన్నయ్యని లోపరచుకున్నారనే అపోహపడ్డాను నేను. మిమ్మల్ని అడ

కత్తెరలో పోకలావుంచే పరిస్థితులు అన్నయ్య కల్పిస్తున్నాడు. అతనే జవాబు చెప్పుకుంటాడు. మీగురించి వదనకి నేను సంజాయిషీ యిస్తాను.'

'ఆవిడ యేమీ అనరా నన్ను'

'అంటే అనగలదు. అసలు ఆవిడ స్వభావమే వేరు.'

'నేనోపని చేయదలచుకున్నాను సంధ్యా'

'యేమిటది?'

'చెబితే మీరు 'కా'దంటారేమో అని భయంగా వున్నది'

'మరేం భయంలేదు. చెప్పండి. నేనేమీ అనను. మీరు చదువుకున్నారు. పైగా నాకన్న పెద్దలు'

'నాకు అక్కయ్యను చూడాలని వుంది'

'నిజంగనా!' ఆశ్చర్యంగాఅన్నది సంధ్య'

'అబద్ధంకాదు'

'అయితేయెలా'

'నేనే వెడతాను'

'మీరా'

'తప్పేంవుందీ?

'అక్కడ ఆవిడ యేమైనాఅంటె'

'అనేమనిపైతే మీఅన్నయ్యని ఆవిధంగా కోపవుండరు. ఒకవేళ ఆవిడ బాధలో రెండు మాటలన్నా భరించేందుకు నేను సిద్ధంగా వున్నాను'

'ఈవూహ యెప్పుడు కలిగింది?'

'రాత్రి'

'అన్నయ్యకి చెప్పేరా ?'

'ఆఁ'

# అడకత్తెరలో మనిషి

'యేమన్నాడు ?'

'సరే అన్నారు'

'అమ్మా, నాన్నా వెళ్లనిస్తారా ?'

'అందుకే మి మ్మ ల్ని ప్రాధేయపడుతున్నాను. యెలాగో మీరు సర్దిచెప్పాలి. ఒక్కసారి ఆవిడని చూడనిదే నాకు మన శ్శాంతి వుండదు.

సంధ్య యెం తో సే పు చూస్తుండి పోయింది గోవిందవైపు. చేసిన ద్రోహాన్ని భరించలేని కుమిలింపులో దిగ్గళ్లిపోతున్న ఆవిడ వచ్చిన రోజుకన్నా సగమైపోయింది. పశ్చాత్తాపం ని లు వు నా చీల్చేసినట్లే. ఆందోళన, ఆవేదనా కలగాపులగం అయిపోయి మనిషిని కాల్చేస్తున్నాయి. 'బహుశా అన్నగారే తీసుకు వెళ్లవచ్చు' సమాధానం చెప్పుకుంది.

* * *

వీధిలో కళ్లాపుచల్లుతున్న సర్వమంగళ ముగ్గు అదరా బాదరాగావేసి జట్కాదిగిన అల్లుడినీ, కూతురిస్థానాన్ని ఆక్రమించుకున్న గోవిందనీ రె ప్ప వే య కుం డా చూస్తూండి పోయింది. గోవింద ఆవిడ వైపుచూసి భర్త వెనకగా రెండడుగులు వేసింది.

సర్వమంగళ అల్లుడివైపు చూస్తూ దుఃఖం చెరువు అవుతూంటే అన్నది : 'ఈ విషయం గాలికబురుగా సరిపెట్టుకుని గుట్టు చప్పుడుగా బ్రతుకుతున్నాం అల్లుడుగారూ. మీరు యిదికూడా చూపించేందుకు వస్తారని మేము అనుకోలేదు. మా పిల్లని మీ యింటికి యివ్వడమే తప్పు అనిపిస్తే అందుకు మేము సిగ్గుపడుతూనే వున్నాం. మమ్మల్నెందు కిలా రచ్చకీడుస్తారు ?'

'అమ్మా!' దుర్గ గా లి దు మా రంలా వచ్చేసింది. సర్వమంగళ తల దించేసుకుంది. అత్తగారింటి మనుషులమీద దుర్గకున్న అభిమానం ఆవిడకి తెలియనిదికాదు. కడుపు మంటలో తండ్రి పదే పదే అంటూంటే తను వెళ్లిపోయేందుకే సంసిద్ధురాలైంది. పరుషంగా ఆయింటి పరిసరాల్ని సైతం అననీయని దుర్గలో సహనం యెక్కడి నుంచి వచ్చిందో అర్థంకాలేదు.

'రండి', దుర్గ నవ్వుతూ లో ప లి కి దారితీసింది.

'నిన్ను చూడాలని గోవింద వచ్చింది దుర్గా,' భ వా నీ శం క రం నెమ్మదిగా ఒ క్కొ క్క మాటేకూడబలుక్కుంటూ అన్నాడు.

దుర్గకి యిప్పుడు తొమ్మిది నెలలు దాటేయి. గోవిందవైపు రెప్పవేయకుండా చూస్తూంటే యేమేమో ప్రశ్నలు వేయాలనిపించినా, కంఠాన్ని పెదాలు దాటనివ్వడంలేదు.

'నన్ను క్షమించండక్కా,' దుర్గపాదాలంటుకుని భోరుమంది గోవింద. భవానీ శంకరం, దుర్గ అచేతనంగా వుండిపోయేరు.

'నన్ను మభ్యపెట్టి మీతోచెప్పి చేస్తానని ఆయన యింతపని చేశేరు. నాకసలు యే విషయమూ తెలియదు చదువుకున్న దాన్నని అందరూ నన్నే చులకనచేసి అంటున్నారు. మీరు మెడ్రాసు రావాలి.'

పచ్చని చీరకి యెర్రంచు జరీవున్న ఆచీర దుర్గకి పంచప్రాణాలూ అని తెలిసీ బీరువాలోంచి యెంచి కట్టుకున్నది గోవింద. ఆ చీరలో సవితిని మరిచిపోయి రెప్పవేయకుండా చూస్తోంది దుర్గ. పక్కనే నిలువెత్తు విగ్రహం. తను చూసిన తిరుపతి వేంకటేశ్వరస్వామి సరసన పద్మావతి జ్ఞప్తికి రాగా కళ్లు మెరమెరలాడాయి క్షణం. మహామహాత్మైన దేవుళ్లకే సవత్తుల పోట్లాటలు తప్పలేదు. తనకిమాత్రం తప్పుతుందా ? రాజీపడిన హృదయంతో మంచంమీద



వెనక్కివాలి అరనిమిషం కళ్ళుమూసుకుంది. మామగారి హయాం నాటి పట్టెమంచం మరో స్టూలు వేసుకుంటేగానీ ఆడంగులు యెక్కలేరు. అప్పుడప్పుడు భర్తతో దుర్గ వేళాకోళం ఆడేది. 'తెలుసును నాకు. అత్తగారు మరీకురుచ. మామగారి కాళ్ళమీదినుంచి యెక్కేసి...,' అని కిలకిలా నవ్వేది. ఆ మంచంమీద యెక్కి దిగడమే గగనం అయిపోయేది. అక్కడ యిప్పుడు అనునిత్యం గోవింద తిష్ఠవేసుకుని భర్త గుండెల్లో తలని ఆన్చి చెవిలో గుసగుస లాడుతూంటే, ఆ మెత్తని బూరుగు దూది తలగడ దాంపత్య కథలన్నిటినీ జీర్ణం చేసుకుంటూవుంటే తగుదునమ్మా అని తిరిగి ఆ మంచంమీదికి తనెలా యెక్కగలదు? యేనాడైతే తండ్రితో పుట్టింట కాలుమోపిందో ఆనాటితోనే ఆ ఋణాలూ బంధాలూ తెగిపోయాయి. అనవసరం అయిన ఈ రాకపోకల అంతర్యం ఒకవిధాన అంతు చిక్కలేదు దుర్గ మనసుకి. రాయిగా మార్చేసుకునే గుండె అతో భర్తవైపో చూపునిసిరి గోవిందని చూస్తూ అంది: 'నా యింటికి యింత అపేక్షగా వచ్చేవు గోవిందా. నాకు చాలు ఈ తృప్తి. ఆయింటి మనుషులు చీటికీ, మాటికీ యిక్కడికి రావడం యిరుగు పొరుగులు కళ్ళు వెడల్పుచేసుకుని, చెవులు రిక్కించుకుని కాపువేయడం ఒకవిధంగా మాయింటి పరువు బజారు పాలు అవుతున్నది. ఆడదానికి పునర్జన్మలాంటిది యిది. మా అత్త పురిటిలోనే సంధికమ్మి చచ్చిపోయింది. ఒకవేళ నాకూ అంతటి అదృష్టమే పడితే...' దుర్గ దిగులుగా భర్త మొహంలోకి మరోసారి చూసి బలవంతంగా దృష్టిని తప్పించుకుంది. పన్నెండేళ్ల చెలిమికాడు రక్తంలో రక్తం ప్రాణంలో ప్రాణంగా మెదిలిన భర్తపట్ల కాఠిన్యంగా ప్రవర్తించేందుకు వ్యవధి పట్టింది. గోవిందవైపు తిరిగి అన్నది: 'నాకూ పిల్లడో పిల్లో పుడతారనే ఆశతో జీవం పోసుకుంటున్నాను. యేదైనా జరిగితే సంధ్యతో చెప్పు గోవిందా నాబిడ్డని తనతో వుంచుకోమని'

'అక్కా' గోవింద కళ్ళు చెరువులయేయి: 'యెంతమాట అంటున్నారు మీరు యిందుకు నేను కారణం,' నుదురు కొట్టుకుంటూ భర్తవైపు తిరిగింది: 'చూశారా మీయెదుటే ఆవిడ యెలా అప్పగింతలు చెబుతున్నారో. అలాచూస్తూ వూరుకుంటారేం మీరు శాసించలేరా? అక్కయ్యని తీసుకు వెళ్ళే హక్కు మీకులేదా.'

జీవంలేనట్లుగా నవ్వేడు భవానీశంకరం. తొందరపడి చేసినపనికి అతను పశ్చాత్తాపంతో దగ్ధం అయిపోతున్నాడు. భార్యని శాశించే అధికారాన్ని పోగొట్టుకుని రాజ్యాన్ని కోల్పోయిన మహారాజులా నిస్పృహలో జవసత్వాలుడిగి పోయినట్లు బాధపడుతున్నాడు. అతనికళ్ళల్లో దుర్గపైన కరుణ, కంఠంలో మమత, హృదయంలో అపేక్ష పెల్లుబికి పైకిరావడం లేదు. నిర్జీవ శిలలా గుడ్లప్పగించి చూస్తూండిపోయేడు చాలాసేపు, అత్తగారు కానీ, మామగారుకానీ అతడున్నగది పరిస

నా గాథలు చూచి అమ్మా నాన్నా క్షోభని భరించేరు. చచ్చికూడా నా గుర్తుని వాళ్ళకళ్ళయెదుట నిలిపి యింకా చిత్ర హింస చేయలేను. నామాట మన్నించి నా బిడ్డని నువ్వు తీసుకువెళ్ళి పెంచగలవా?'

'ఏం మాటలక్కా అవి నేను...నేనా ఆయన్ని తేరిగ వరిచేది. మీబిడ్డకి గురించిన బెంగవద్దు. భగవంతుడున్నాడు. మీకే భయంలేదు. మిమ్మల్ని వాడ్డకు చేరు స్తాడు,' దుఃఖంతో గోవిందకి మాటలు పెగిలి రాలేదు.

అంతకంతకు దుర్గ ముహం నీలంరంగుకి మారిపోతోంది. డాక్టర్లని హడావడిగా పిలుచుకు వస్తున్నాడు భవానీశంకరం. ఆఖరిలో కౌగిగట్టని దీపంలాంటి ఆశ మొలకెత్తి అతన్ని పుత్తేజంతో పరిగెత్తి స్తోంగి.

కళ్ళు భారంగా తెవనెత్తింది దుర్గ. మసకమసకగా తల్లీ, తండ్రీ ఆ పక్కనే మరోపరిచయం వున్ననీడ కనిపిస్తోంది. తెల్లనిపీర అస్పష్టంగా కదిలి జ్ఞాపకాల కొలబద్దలో సంధ్యగా గుర్తుకురాగానే అంధ కారంలో తడుముకుంటున్నదానిలా 'సం...ధ్య క...దూ,' అన్నది బలవంతంగా పెదాలు విప్పి పలుకుతూ.

వదినగారిని వాటేసుకుని ఘొల్లుమంది సంధ్య.

'సంధ్యా నేను వెళ్ళిపోతున్నాను బాబు జాగ్రత అమ్మానాన్నా, వేడుతున్నాను. గోవిందా ఆయన...బాబు' దుర్గమాటలు గాలి కెరటాల్లో కలిసిపోయేయి. అంత కంతను శ్వాస పీల్చడమే భారం అయి పోయింది, పసిపిల్లడి మీదనుంచి చేతుల్ని దూరంగా విసిరేసింది. బలవంతగా పీలు స్తున్న శ్వాసనాళాలు పుటుక్కుమన్నాయి. దుర్గప్రాణం అనంతాకాశంలోకి కలిసి పోయింది.

భవానీ. శంకరం తలబాదుకుని పసిపిల్ల వాడిలా యేడ్చాడు. అతని హృదయాన్ని అర్థం చేసుకునేందుకూ, పరిస్థితుల్ని గ్రహించేందుకూ, అతన్ని క్షమించేందుకూ దుర్గలెదు.

దుర్గని పుట్టింటినుండి స్మశానవాటి కకి తరలించి భార్యతోటే, చెల్లెలితోటే, పసిబిడ్డడితోటే, అంతులేని దుఃఖ భారంతోటే ప్రయాణం అయేడు భవానీ శంకరం.

(ఇంకా ఉంది)




డాక్టర్లయితే స్టెతస్కోపు, లాయర్లు నల్లగౌను, టీచర్లు పేం బెత్తమూ, లెక్క రర్లు బైండు వాల్యూములు, కంపెనీ ప్రతి నిధులు కిట్—బాగ్స్, తాలూకాఫీసు గుమ స్తాలు పెండింగ్ ఫైల్స్— ఇలా ప్రతి జీవు డికీ ఏదో ఒక హస్తభూషణం ప్రసాదించాడు. భగవాన్.

ఇవన్నీ వృత్తిరీత్యా సంక్రమించిన చేత్య లంకారాలు. మరి తక్కిన వాళ్ళమాటేమిటి? మగవాళ్ళయితే పంచెచెంగు, ఆడవాళ్ళు చీర కొంగు— సంతసమయంలో కూరల సంచీ చేతుల్లో కనబడుతూనే వుంటాయి. కుర్ర కుంకలు జేబుల్లో చేతులిరికించుకు నడుస్తారు. ఆడపిల్లలు జోడుజడలు సరుదుకుంటారు.

చేతిలో ఏమీ లేకుండా నడవలేని ఆశక్తి ప్రాణుల్లో నే నొకణ్ణి. ఇంకా చెప్పాలంటే ఉత్తచేతులూపుకుంటూ నడిస్తే, నడకకాస్త వంకరటింకర అవుతుందన్న సంగతి దీర్ఘ కాలం పరిశోధించి స్వయంగా కనిపెట్టి తెలు సుకో గలిగాను. కావాలంటే మీకూ రుజూ చెయ్యగలను.

మా పక్కింటి మామ్మగారమ్మాయి అరి మేలు నడుస్తూ, నడుస్తూ, తెలీకుండానే ఎన్ని మెలికలు తిరిగిపోతుందనీ?— అందు క్కారణం లేకపోలేదు. చేతిలో ఏదేనా వస్తువు ఉంటే, మనదృష్టిని ఆవస్తువుమీద కేంద్రీ కరించవచ్చును. కాగా— మనం ఎలా నడుస్తు న్నామో అనే బెంగకూ, మన వంకర నడక ఎవరేనా గమనిస్తున్నారేమోననే గుబులుకీ అవకాశం ఉండదు.

దీన్నిబట్టే కాబోలు— ఎక్కడికైనా వెళ్లే టప్పుడు రిక్తహస్తాలతో వెళ్లరాదని పెద్ద లంటారు. ఈమధ్య ఇటువంటి విషయంలోనే నాకో ధర్మసందేహం వచ్చింది.

ఒకానొక పెద్దమనిషిని దర్శించాలి. చాలా జరుగురు పని. కాస్తోకూస్తో కలంఆడిస్తున్న వాడిని, ఉత్తచేతులతో ఎలా బయల్దేరడం?

—ఊహూ—

పుస్తకం హస్తభూషణం అన్నారు. బాగానే వుంది. నా దగ్గరున్న ఉద్గ్రంథ—సద్గ్రంథ —బృహద్గ్రంధాల్లో ఏది చేతబట్టుకోవడం? విశ్వనాథా, కొడవటిగంటా, ముప్పాళా, రాచ కొండా?—ఇది సందేహమే.

నా చేతిలో పుస్తకం చాలాకు చగంగాత లేదా రచయిత ఆ పెద్దమనిషికి నచ్చుతాడో, లేదో. నచ్చకపోతే, నేవెళ్ళిన్న ఆవనికాస్తా ఆరుమ్మడి కావచ్చు. ఏమంటే — రచయితల్లో కన్నా ఈనాడు పాఠకుల్లో భేదాభిప్రాయాలు మరీ ఎక్కువగా ఉంటున్నాయి.

ఈ సాధకబాధకాలన్నీ యోచించిన మీదట, మెరికలా ఒక ఐడియా తట్టింది అందుక్కారణం— నాలుగే నాలుగు నంబర్లలో తప్పిపోయిన నా లాటరీ టిక్కెట్లు.

వెంటనే కళ్ళు మూసుకున్నా. టేబిల మీదున్న పుస్తకాల్లో ఒకటి తీశా.

ఇంతలోనే —

'ఏం చేస్తున్నారక్కడా, పిచ్చిలా కళ్ళు మూసుకునీ?—'అంటూ శ్రీమతి.

'అమ్మా!— నా. . . . .' కుర్రకుంక.

ఎవర్నీ ఖాతర్ చెయ్యకుండా ఆ పుస్తకంతో సహా వీధిలోకొచ్చా, గుమ్మందాటి నాలుగడు గులు వేశా, అంతే—

వెనకనించి పెద్ద కేకలు! గావుకేకలు!!—

'మిమ్మల్నే. . . . .'

'నాన్నా!—'

'బావా!—'

అరె!— చూసుకునేలోదే, ఏ స్కూలు రైలు దిగాడో మా బావమరిది— మా రాణి గారి తమ్ముడు.

వెనక్కి తిరిగా.

'పిలుస్తున్నా వినిపించుకోకుండా, ఎక్కడికీ బయల్దేరారూ?—'

'అమ్మా!—నా. . . .'

'నువ్వుండరా. కుర్రగాడి ఎక్కాలబుక్కు పట్టుకు బయల్దేరారెక్కడికీ?—'

'ఎక్కాల పుస్తకమా!—' బిత్తరపోయా.

'ఈమధ్య ప్రైవేట్లేమైనా చెబుతున్నావా యేమిటి, బావా?—' బావమరిది ప్రశ్న.

'అమాత్రం ప్రయోజకత్వం ఉంటే ఇహనేం?— చిన్నప్పుడు చదువు ఎరిగ్గా ఒంటబట్టలేదుకాబోలు, ఇప్పుడు మళ్ళీ మొదలెట్టించి. . . . . .!' రాణిగారి ఉడుం కింపు.

# నాడు రాజధాని నేడు పల్లె



నంది

ఫొటోలు, వ్యాసం : ఎన్. రామకృష్ణ.

తంజావూరులోని బృహదీశ్వరాలయం నేటికీ చెక్కుచెదరకుండా నిలిచి ఉంది కాని ఈ గుడిని కట్టించిన వారిలో ఒకరయిన రాజేంద్రచోళుడే గంగయి కొండ చోళపురంలో నిర్మించిన పెద్దగుడి పరిస్థితి అంతబాగా లేదు. శిథిలావస్థలోకి వెడుతున్నదనే అనాలి. అయినా అందం మాత్రం తగ్గలేదు. ఆనాడు చేసిన శిల్పాలు, నేటికీ నిలిచి ఉన్నాయి.



జ్ఞాన సరస్వతి

రాజేంద్రచోళుడు పదకొండవ శతాబ్దంలో పెద్ద విజయయాత్ర చేశాడు. ఉత్తరాదిలో గంగానదీ ప్రాంతం దాకా వెళ్ళి అక్కడి రాజుని ఓడించాడు. ఓడిపోయిన రాజులు తమ తలల మీద గంగా జలపాత్రలని మోసి ఇతని రాజధానికి తీసుకువచ్చారుట. ఈ ఆలయ ప్రాకారంలో ఉన్న 'సింహతీర్థం' అనే నూతిలో గంగ నీటిని పోశారుటకూడా...ఇదంతా సుమారు తొమ్మిది వందల, వెయ్యేళ్ళ కిందిమాట. అప్పుడు గంగయికొండ చోళపురం ఎంతో వైభవంగా ఉండి ఉండాలి. నేడు అది ఒక శిథిలాల నగరం...



శిల్ప సౌందర్యం

గంగయికొండ చోళపురం గుడి కూడా తంజావూరుగుడి పద్ధతుల మీదనే కట్టబడిన గుడి. దీని వైశాల్యం సుమారు 240000 చదరపు అడుగులు (600×400) విమానం ఎంతో ఉన్నతమయినది. గోడల మీద ఎన్నో శిల్పాలు; వాటిలో చాలా అందమయినది జ్ఞానసరస్వతి శిల్పం.......

ఆలయంలోపలి భాగాలలో ఎక్కువ చెక్కడాలు లేవు. అర్జునుడి తపస్సు, మీనాక్షి కళ్యాణాలకి సంబంధించినవి మాత్రం కొన్ని ఉన్నాయి.

గర్భగుడిలోని లింగం చాలా పెద్దది. తంజావూరులో కూడా ఇంత పెద్దది లేదుట. దీనికి అభిషేకం చెయ్యవలసి వచ్చినప్పుడు అర్చకుడు నేలమీదకాక కొంచెం ఎత్తుగా ఉన్న కట్టడంమీద నుంచే చేయవలసి



**212 అడుగుల ఎత్తు విమానదృశ్యం**

వస్తుంది. ఈ లింగం ఒకేరాతినుంచి చెక్కబడినది. ఈ గుడిలో నవగ్రహపూజ జరుగుతుంది.

బయట పెద్ద నంది ఒకటి ఉంది. ఇది ఇటిక, సున్నాలతో కట్టినది—కాని, లోపల పెద్ద రాతినంది వేరే ఉందంటారు.

విమానశిఖరం ఎత్తు 212 అడుగులు. ప్రాకారం కోట గోడలవలె కట్టబడినది...

ఒకనాటి సామ్రాజ్యం రాజధాని నేడు విలాసయాత్రికులు చూసే వినోదస్థలం అయిపోయింది. దీని పునరుద్ధరణ ఎంతయినా అవసరం. ●

# ప్రొఫెసర్ పి.సి. మహలనోబిస్

**స్టాటిస్టిక్స్‌లో ఎఫ్. ఆర్. ఎస్. సంపా**యించిన మొదటి భారతీయ శాస్త్రవేత్త ప్రొ: పి. సి. మహలనోబిస్, మనదేశంలో ఈ శాస్త్ర విభాగానికి సుమారు 30 ఏళ్ల క్రితం పునాదులు వేసిన మూలపురుషుడు. ఈనాడు ఈ రంగంలో మనదేశం మంచి పేరు సంపాయించిందంటే ఆ ఘనత చాలా మటుకు ఈయనకే దక్కుతుంది. కలకత్తాలో యిండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూట్‌ని 1931 లో స్థాపించి అక్కడ అనేకమందిని తర్ఫీదు చేసారు. వీరిలో చాలా మంది యిప్పుడు అంతర్జాతీయ రంగంలో ప్రముఖస్థానాల్ని అలంకరిస్తున్నారు. విదేశ విశ్వవిద్యాలయాల్లోను, పరిశోధనా సంస్థల్లోను ఉన్నత పదవుల్లో వున్నారు... ప్రొ: మహలనోబిస్ ప్రణాళికాసంఘంలో సభ్యులుగా వుండి మన ప్రణాళికలు తయారు చేయడంలో స్టాటిస్టిక్స్‌ని విశేషంగా వినియోగించడానికి దోహదం చేసారు.



ప్రొ: మహలనోబిస్ కలకత్తాలో 1893 లో పుట్టారు. కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజిలో బి. యస్.సి (ఆనర్సు), కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ ట్రైపాస్, కలకత్తా, సోఫియా (బల్గేరియా) యూనివర్శిటీల గౌరవ డాక్టరేటు, విశ్వభారతి వారి దేశికోత్తమ, కేంబ్రిడ్జి యూనివర్శిటీ కింగ్స్ కాలేజి ఆనరరీ ఫెలో వీరికున్న డిగ్రీలు. వీరు కాలేజీలో చదివింది ఫిజిక్స్, సర్వీస్ అంతా ఫిజిక్స్ ప్రొఫెసర్‌గానే. అయితే స్టాటిస్టిక్స్‌ని హాబీగా మొదలెట్టి, అందులో అనేక కొత్త విషయాలు కనిపట్టి, పేరు గడించారు.

ఒక్క శాస్త్ర పరిశోధనలలోనే గాక వీరు యితర రంగాల్లో కూడా చాలా కృషి చేసారు. విశ్వకవి రవీంద్రునితో కలిసి బ్రహ్మసమాజంలోను, విశ్వభారతి కార్యకలాపాల్లోను చాలా ప్రముఖ పాత్ర వహించారు.

"సాంఖ్య" అనే స్టాటిస్టిక్స్ పత్రికను 1933 లో స్థాపించి అప్పటి నుంచి దానికి తామే సంపాదకులుగా వుంటున్నారు. వీరు స్టాటిస్టిక్స్‌లో అనేకరకాల సమస్యలను గురించి పరిశోధనలు జరిపారు.

ఈయనకి మనదేశంలోను, విదేశాల్లోను లెక్కలేనన్ని సన్మానాలు లభించాయి. వీటిల్లో ముఖ్యంగా చెప్పవలసినవి: పాకిస్తాన్ స్టాటిస్టికల్ కాన్ఫరెన్స్ ప్రెసిడెంట్ (1956), యునైటెడ్ నేషన్స్ స్టాటిస్టికల్ కమీషన్ చేర్మన్, ఇంటర్నేషనల్ బయోమెట్రికల్ సొసైటీ ప్రెసిడెంట్, రష్యన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ విదేశ సభ్యత్వం, ఇంటర్నేషనల్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూట్ గౌరవ అధ్యక్షులు.

వీరు ప్రచురించిన వ్యాసాలు, గ్రంథాలు 200 దాకా వుంటాయి. వీరు 35 దేశాల్లో ఉపన్యాసాలిచ్చారు. అనేక అంతర్జాతీయ సమావేశాల్లో పాల్గొన్నారు. 75 ఏళ్ల వయస్సు పైబడ్డా, యిప్పటికీ తమ కార్యకలాపాలని మామూలుగానే నిర్వర్తిస్తున్నారు.

**—డా॥ ఆర్.ఎల్.ఎన్. శాస్త్రి**



### మాలతి చెప్పిన కథ

మా రాజీపెళ్లి శుభలేఖ చూడగానే నాకెంతో ఆశ్చర్యం కలిగింది. దానికి పెళ్లి అవుతున్నందుకు కాదు నా ఆశ్చర్యం. ఆ శుభలేఖలో వరుని పేరు వసంతరావు యం. బి. బి. యస్. అని చూడడంతోటే కలిగింది నాకా ఆశ్చర్యం. 'మరయితే యింతకాలం జరిగిన రాజీకథ తారుమారు అయిందన్నమాట! ఎటువంటి పరిస్థితులు ఎదురైతే, ఏమి జరిగితేనూ రాజీ దీనికి ఒప్పుకుందో? తెలుసుకుంటే బాగుండును.' అని అనుకుంటూ పెళ్లి తారీఖు చూశాను. నా ఆశ్చర్యం మరింత హెచ్చింది. సరిగ్గా మా పరీక్షల్లోనే దాని పెళ్లికి ముహూర్తం! అంటే రాజీ పరీక్షలకి రాదన్నమాట! ఏడాదిపాటు చదివిన చదువుకు—ఫలితాన్ని ప్రసాదించే పరీక్షలకి కూడా రావడానికి వీలులేనంత హడావిడిగా దాని పెళ్లి నిర్ణయం జరిగిపోయిందన్నమాట! అయితే దీనినిబట్టి రాజీకథ వాళ్ల నాన్నగారికూడ తెలిసిపోయిందన్నమాట!

ఇంతకీ ఆ కథ ఏమి టంటారా? ఇదిగో చెబుతున్నా.

రాజీ పూర్తి పేరు రాజేశ్వరి. అయినింటివారి బిడ్డ. అందాలభరిణె అంటె సామాన్యంగా చెప్పినట్టే అవుతుంది. ఐశ్వర్యానికి ఐశ్వర్యం, అందానికి అందం, చదువుకు చదువు—ఈ మూడూ ఎక్కడో గాని సమకూడవు. మా రాజీలో ఆ మూడు లక్షణాలు సమకూడడమే గాక, ఆ మూడింటి సంయోగంవల్ల యేర్పడే విపరిణామం — అహంకారం — ఆమెలో రవ్వంతైనా లేకపోయి, అతి సామాన్యంగా, సౌమ్యంగా, సహృదయంతో ఉండే ఆమెని చూస్తే, ఆమె స్నేహితురాళ్లమైన మాకే ఎంతో ఆనందం ఆశ్చర్యం కలిగించేవి. మేం నలుగురం స్నేహితురాళ్లం ఉన్నప్పటికీ నాకూ రాజీకి కలిసినట్లు మరెవ్వరికీ కలియలేదు. కొంచెం దురుసుగా మాట్లాడినప్పటికీ, నా నిర్మొహమాట లక్షణం తనకి బాగా నచ్చిందని అంటూ ఉండేది రాజీ తరచు నాతో. అంతేకాకుండా, నా సలహా ఎప్పుడూ తనకెంతో ప్రయోజనకరంగా ఉంటుందని రాజీ విశ్వాసం కాబోలు, తనకి సంబంధించిన అన్ని విషయాలూ నాకు చెప్పేది. అతి సున్నితమైన మనస్సు కలది కాబట్టి మా రాజీకి ప్రతిదానికి సందేహమే! ఏ విషయంలోనూ ఒక నిర్ణయానికి వెంటనే రాలేకపోయేది. నా మనస్తత్వం అందుకు పూర్తిగా భిన్నం. అందుకనే మా యిద్దరికీ అంత అన్యోన్యత ఏర్పడి ఉంటుంది, విభిన్న ధృవాలకే కదా ఆకర్షణ!

కాలేజీకి ఎప్పుడు వెళ్లినా మా స్నేహితురాళ్లం నలుగురం కలిసే వెళ్లేవాళ్లం. వచ్చినా అంతే. ఎక్కడికేనా వెళ్లినా నలుగురం కట్ట కట్టుకు పోయేవాళ్లం!

అందరికీ మా అంతా ఐకమత్యం చూసి మాకు 'చతుష్టయం' అని పేరుకూడా పెట్టారు. కాలేజీనుంచి తిరిగి వచ్చేటప్పుడూ, ఖాళీగా ఉన్నప్పుడూ, అనేక విషయాలను గురించి ముచ్చటించుకునే వాళ్ళం. ఒకప్పుడు గట్టిగా వాదనలు కూడా పెంచుకునే వాళ్ళం. అలా వాదనలకి వచ్చే విషయాల్లో ప్రేమ విషయం వచ్చేటప్పటికి మా రాజీ, అంతవరకూ ఎంతో చలాకీగా ధాటిగా వాదించే మా రాజీ—మూగనోము పట్టేది. మేం గట్టిగా కారణం అడిగితే తనకి అటువంటి విషయాలంటే అసహ్యం అనీ, నమ్మకం లేదని మొహం కుంచించుకుని చెప్పేది.

అటువంటి మా రాజేశ్వరి ప్రేమలో పడిందంటే, విూకే కాదు నాకే ఆశ్చర్యం కలిగింది. ఇటువంటి విషయాల్లో ఇంతకు ముందు ఓడిపోయిన అనేకమందిలో మా రాజీకూడా ఒకర్తె పోయిందని తృప్తి పడుదునుకాని ఆ నాటి ఘట్టం చూసి నాకు మతి పోయినంత పనైంది.

ఏదో నోట్సు అర్జంటుగా కావలసి, ఆ వేళ రాజీ యింటికి హడావిడిగా వెళ్ళాను. నా అలవాటుప్రకారం తిన్నగా దాని గదికి వెళ్ళి చూద్దునుగదా!—అప్పటి కప్పుడే స్నానం చేసిన రాజీ పూజలో మునిగినట్టు స్పష్టంగా తెలుస్తోంది, అగరువత్తుల వాసనల గుబాళింపుతో. 'దేవుడన్నా, పూజలన్నా, వితండ వాదానికి దిగే, మా రాజీని ఈ విధంగా మార్చిన ఆ ఆరాధ్యదైవం ఎవరా?' అనే ఉత్సుకతతో ఆమె వెనకాలచేరి తొంగి చూచాను. అంతే! ఎవరో వీపువిూద చెళ్ళుమనిపించినట్లు ఫీలయ్యాను.

మా రాజీ ఆరాధ్యదైవం—ఒక మానవుడు.!

నోట మాటరాక అలాగే గుడ్లప్పగించి చూస్తున్నాను. తనకి ఎదురుగా ఉన్న ఫోటోకి—షోడశోపచారాలు చేయక పోయినా అందులో కొన్ని అయినా చేసిందనే చెప్పాలి మా రాజీ. అంతకన్నా ఆశ్చర్యం కలిగింది—ఆ ఫోటోలోని వ్యక్తి పాదాలకి పూలతో పూజచేసి, వాటిని తీసుకుని కళ్ళకి అద్దుకుని, తన తలలో ధరించిన మా రాజీని చూడడం.

తలలో ధరించడానికి పూలతోకూడిన చేయిని, వెనక్కి ఎత్తి దింపుతూండగా, అతి సవిూపంలోనే ఉన్న నాకు తగలడం—ఒక్కసారి ఉలిక్కిపడినట్టు వెనక్కి తిరగడం—ఏకాగ్రంగా, కొంచెం తీక్షణంగా చూస్తున్న నా చూపులను కలుసుకోలేక తల దింపడం—అన్నీ ఒకదానివెంట చక చకా సాగిపోయాయి. అంతలోకే మొహాన్ని నవ్వు పులుముకుంటూ, నా దగ్గరకి వచ్చి 'ఎంత సేపయిందే మాలతీ నువ్వు వచ్చి?' అని అడుగుతూ మాట తప్పించబోయింది.

నేనా ఒక పట్టాన వదిలేది!

సమాధానంగా మాటలకి బదులు వాడి చూపులు వదిలాను. ఇంక లాభం లేదనుకుంది కాబోలు, నా ప్రక్కని కూర్చుంటూ అంది, 'నన్ను క్షమించు మాలతీ! ఇంతవరకూ ఈ విషయం నీ దగ్గర దాచినందుకు. ఏమిటో ధైర్యం చాలలేదు.'

'ఆరాధనా ఘట్టందాకా వచ్చిందంటే గ్రంథం చాలా జరిగేఉండాలి. ఎప్పుడు ఎలా ప్రారంభమయింది? ఇంతకీ ఎవరా దేవతామూర్తి? కరుణించి వరము లొసగేనా? వలదన్న—'

నాకు తెలియకుండానే నా కంఠధ్వనిలో హేళన, కర్కశత్వం కనిపించాయి కాబోలు.

'అబ్బ! ఎందుకే అంత కోపం మాలతీ! నీకు చెప్పకుండా యింతవరకూ దాచానని? ఎప్పుడు చూసినా వాళ్ళుకూడా ఉండేవారు. నువొక్కత్తెవూ ఉన్నప్పుడు చెబుదామని చూస్తే యింతవరకూ వీలు చిక్కలేదు. వాళ్ళంతా ఉండగా చెప్పడానికి—'

'ధైర్యం చాలలేదు అవునా? అంటే నువ్వు చేసినది అంత మంచిదికాదని నీకూ తెలిసిందన్నమాట! అవును మరి ముందు మహా గొప్ప కబుర్లు చెప్పి, ఆ తరువాత ఆ బురదలోనే దిగితే ఎదటివారు ఆక్షేపించరూ? మన అంతస్సాక్షిమాట ఎలా ఉన్నా?'

'నాకూ అదే ఆశ్చర్యంగా ఉంటుంది మాలతీ! ఇంతవరకూ కనిపించిన ఈ బలహీనత ఈ విషయంలోనే నాలో ఎందుకు బయల్పడిందో అర్థంకాలేదు. అక్కడికీ నాలో నేను ఎంత వితర్కించుకున్నానో? చివరికి 'విధి ప్రేరితం' అని సర్దుబాటు చేసుకున్నా. అప్పటినుంచి, నాకు తెలియకుండా నా యీ బలహీనత విజృంభించి, నన్ను ఈ స్థితికి తీసుకువచ్చింది.'

'ఇంతకీ ఎవరీ మహానుభావుడు?'

'నటరాజన్ అని—'

'మనవాళ్ళు కాదన్నమాట.'

'ఒబ్బే! వాళ్ళ పూర్వీకు లెప్పుడో ఆ ప్రాంతానికి వెళ్ళిపోయి సెటిల్ అయిపోవడంవల్ల అ పేర్లు పెట్టుకోవడం అలవాటయిందిట.'

'ఉద్యోగం?'

'...కంపెనీకి మేనేజర్‌ట. పాలుగైదు వందల జీతం—'

'ఉండవచ్చునని నీ ఊహ! సరే ప్రథమ పరిచయం?'

'సరిగ్గా జ్ఞాపకం లేదు కాని బస్సులోనే జరిగింది. కాలేజీకోసం నేను ఎక్కే బస్సులోనే అదే స్టాపులో ఎక్కేవారు. ఒక రోజున హడావిడిగా బస్సు ఎక్కుతూ కాలుజారి పడబోతూంటే, సమయానికి వచ్చి ఆదుకున్నారు, ఆ తరువాత—'

'మామూలుకథే జరిగి ఉంటుంది. మొదట చిరునవ్వులు, తరువాత చిరు పలకరింపులు, ఆ పిమ్మట దీర్ఘ సంభాషణలు, పిదప విహారములు ఆ తదుపరి ఉత్తరాలు వానితో హృదయాలు యిచ్చి పుచ్చుకోడాలు ఆ పిమ్మట—'

'ఎంత వేళాకోళంగా ఉందే మాలతీ నీకు? స్వానుభవం అయినప్పుడుగాని—'

'తెలిసి రాదంటావ్! అప్పుడే వద్దులే. మరి అంతవరకు వచ్చినతరువాత విూ వాళ్ళకి చెప్పి, ఆ మూడుముళ్ళు వేయించేసుకుంటే—'

'వారి తల్లిదండ్రులను కూడా వప్పించిన తరువాత చేసుకుందామన్నారు. ఏదో ట్రయినింగుకని వెళ్ళారు, అలాగే వారిని కూడా కలుసుకువస్తామని చెప్పారు. ఆయన రాగానే—'

'నా కెందుకో అనుమానంగా ఉందే రాజీ! పూర్తి వివరాలు తెలియకుండా తొందరపడ్డావేమో ననిపిస్తోంది. అతనిపై నీవు ఏర్పరచుకున్న ఈ అంధవిశ్వాసంతో అతను ఆటలాడుతున్నాడేమో నని ఎందుకో నాకు భయంగాఉంది. అయినా నీ ధోరణి కొంచెం మార్చుకుని పరిస్థితులని అవగాహన చేసుకో. కాలుజారకముందే జాగ్రత్త మంచిది. ఇంత నిష్కర్షగా చెబుతున్నందుకు మరోలా అనుకోకు. నీకు మేలు కలి

అంచమని ఆ భగవంతుణ్ణి నేను కూడా గిరిస్తాను.'

తిరిగి వచ్చేస్తుంటే నా హృదయం ఎందుకో బరువెక్కినట్లనిపించింది. 'అతను మా రాజీకి ద్రోహంచేస్తే —' ఆ వూహే భరించలేక పోయాను. కాని తరతరాల నుంచీ వస్తున్న సామాన్య గాథేకదా యిది!

అయినా మా రాజీ ధోరణి చూస్తుంటే ఏమనుకోవాలో అర్థం కావడం లేదు. ఎప్పుడో పురాణాల యుగంలో ఉన్నట్టు విన్నాం కాని ఈ ఆధునాతన యుగంలో — ఒక విద్యావతి ప్రేమించాననే భ్రమతో ఆ ఫోటోకి పూజలూ పునస్కారాలూ చేయడమా? ప్రేమావేశం స్త్రీని అంత వివక్షణా శూన్యురాలిని చేస్తుందా? యుగాలు గడిచినా స్త్రీ ప్రకృతి మారలేదా? మారదా?

ఈ ఆలోచనలతో సతమతమై పోతూ, యింటికిరాగానే, ఎదురుగా ఉన్న భగవంతునికి చేతులు జోడించి మనస్సులోనే నివేదన చేసుకున్నా 'మా రాజీ జీవితం సుఖమయం చేయి భగవాన్' అని.

ఈ కథంతా జరుగుతుండగానే, మాకు ప్రిపరేషన్ సెలవలు యిచ్చారు. నేను మావూరు వచ్చేశాను. ఆ తరువాత కొన్నాళ్ళకి మా రాజి శుభలేఖ వచ్చింది.

మరి నాకు ఆశ్చర్యం కలగడంలో ఆశ్చర్యం ఏముంటుంది? కథ నేను భయపడినట్టే తిరిగిందేమో! పరీక్షల హడావిడిలో పెళ్ళికి వెళ్ళలేక గ్రీటింగ్స్

# వసంతరాజీయం

పంపాను. ఆ తరువాత రాజీ దంపతులు హనిమూన్‌కి వెళ్ళారని తెలిసింది. రాజీనాకు ఉత్తరాలు రాసేది.

కాని నా అనుమానం తీరలేదు. మరి ఆ నటరాజన్‌ని అంతగా ఆరాధించిన ఈ రాజేశ్వరి యిప్పుడు అగ్నిసాక్షిగా తాళికట్టిన ఈ వసంతరావుగారిని ఎలా స్వీకరిస్తుంది? సమయానుకూలంగా మారిపోయే లక్షలాది అబలలో మా రాజీకూడా ఒకతె అయిపోతుందా? లేక మనస్సులోని మూర్తిని మరువలేక, మగనిని సంతుష్టి పరచలేక, నటనతో జీవితం గడిపే దురవస్థ మా రాజీ పాల్పడుతుందా? పై దాన్ని నాకే యిలా ఉంటే, నిరంతరమూ ఈ విధమైన క్షోభను అనుభవించే రాజీ బతుకు ఏవిధంగా గడుపుతుందో తెలుసుకోవాలని ఉంది; ఉత్తరంద్వారా నయినా!

## రాజేశ్వరి చెప్పిన కథ

మా మాలతి ఉత్తరానికి ఏమని సమాధానం రాయను? నాలో నిరంతరం ప్రజ్వరిల్లి, దహించివేసే ఈ వ్యథాగ్నిని ఏవిధంగా అక్షర రూపంలో పెట్టాలో అర్థంకావడం లేదు. నన్నింత ఆప్యాయంగా చూసే, మా శ్రీవారిపట్ల తీరని ద్రోహం చేస్తున్నానేమోననే ఆవేదన నన్ను నిలువునా దహించివేస్తుంటే, లేని సంతోషాన్ని ప్రకటించి ఎంతకాలం ఈ నటన సాగించాలి భగవాన్? పోనీ సాహసించికైనా మనస్సులోని ఆవేదన ఆయనకి చెప్పితే, — ఏమో అతి సున్నితమైన మా సంసారజీవితం, అద్దంలాటి ఆయన మనస్సు ముక్కలైపోతే ఆ తరువాత అతుక్కోవడం వీలవుతుందా? ఆయన క్షమాగుణం చూసినప్పుడల్లా ధైర్యం కలుగుతోంది. కాని యింకా కొంతకాలం ఓపికపట్టి, అదును వచ్చినప్పుడు, ఆయన కాళ్ళమీద పడి, ఉన్న విషయం అంతా చెప్పేస్తేగాని నాకు మనశ్శాంతి ఉండదు.

అసలు నా జీవితంలో జరిగిన పరిణామాలు, ఒకదాని వెనుక ఒకటిగా, ఏదో అదృశ్యశక్తి త్రోసుకు వచ్చినట్టుగా అనిపిస్తుంది. ప్రథమ ప్రణయ విషయంలో సంభవించిన ఘోర పరిణామానికి యింకా నేను తట్టుకుంటూంటోనే, మా వాళ్ళు నా పెళ్ళి సెటిల్ చేయడం, ముహూర్తం పెట్టించి, ఆ పెళ్ళి దూర ప్రదేశంలో దైవసన్నిధిన చేయడం, ఆ తరువాత హనీమూన్‌కి వెళ్ళడం, అంతాఅయ్యాక యిక్కడ సెటిలై అయి సంసారాన్ని సాగించడం, యివన్నీ నా యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా జరిగిపోవడం ఆశ్చర్యంగానే ఉంటుంది. అందరి సామాన్య మానవుల్లానే నేనూ విధికి తలవొగ్గక తప్పలేదు!

మా మాలతి తన ఉత్తరంలో అడిగిన ప్రశ్న 'ఈ పెళ్ళికి ఎలా అంగీకరించావు?' అనే దానికి యిప్పటికీ సమాధానం చెప్పలేక పోతున్నాను. పెళ్ళి చూపులనేవి ఫార్మల్‌గా జరిగినా, నా అభిప్రాయాన్ని అడగకుండానే మా వాళ్ళు సెటిల్ చేసేశారు. అప్పుడూ నేనేమీ అనలేక పోయాను. అయిష్టతనూ ప్రకటించలేదు. అప్పుడు నా పరిస్థితి దేనినీ పట్టించుకోలేని అగమ్య పరిస్థితిలో ఉండి పోయింది.

ఉండక యేం చేస్తుంది మరి? ప్రాణానికి ప్రాణంగా ప్రేమించినవాడు, దైవసమానంగా ఆరాధించినవాడు ఆ విధంగా అన్యాయం చేస్తే, నాకేకాదు ఏ కన్యా హృదయం అల్లకల్లోలం అయిపోదు? మా మాలతి అంటూనే ఉండేది ఇటువంటి ద్రోహం జరుగుతుందేమోనని. అప్పటిలో ఆ పిచ్చిలో నేను లెక్కపెట్టలేదు కాని అనాటి ఉత్తరం — నటరాజన్ దగ్గర నుంచి వచ్చినది, మాలతి ఊహలని యదార్థం చేసింది. ఆవేళ ఏప్రిల్ ఒకటి



కూడా అవడంతో ఏప్రిల్ ఫూల్‌ని అయి పట్టయింది నా స్థితి.

'...ఏదో కాలక్షేపానికి నీతో స్నేహం చేశాను కాని నాకు మరో ఉద్దేశం ఏమీ లేదు రాజీ, నీ మనస్సుకి కష్టం కలిగించడం యిష్టంలేక అప్పట్లో అవసరమైన అబద్ధాలు కూడ చెప్పేవాణ్ణి. నీ నిష్కల్మషమైన అభిమానం చూసి, నేను కూడా ఔదార్యం చెప్పకుండ ఉండలేక పోతున్నాను. నేను వివాహితుడను రాజేశ్వరీ! చిన్నతనంలోనే అయిపోయింది నా వివాహం. ఈ వూరు నుంచి ట్రాన్స్‌ఫర్ అయిన తరువాత ఫామిలీని తెచ్చుకోవాలి. ఇంతవరకు నీ జీవితంతో చెలగాటం ఆడినందుకు క్షమించు...' అంటూ రాశాడు నటరాజన్ హు! మొగ లక్షణం పోనిచ్చుకున్నాడు కాదు! స్నేహం కాలక్షేపానికా? ఆడవాళ్ళు—అందులోనూ పెళ్ళి కాని ఆడవాళ్ళంటే — అంత తేలికైపోయిందా? హే! భగవాన్ స్త్రీ హృదయంలో ప్రేమ అనేది వివాహం అయిన తరువాతనే అంకురించేటట్లు చేయి!

మా మాలతి చివాట్లు పెడుతూనే ఉండేది 'ప్రతిదానికీ అంత సీరియస్‌గా తీసుకోకూడదు రాజీ!' అని. ఏం చేయను? ఈ సంఘటన నా మనస్సుని తీవ్రంగా గాయపరిచింది. దాని అఘాతంలోపడి నేను యిదవుతున్న అవస్థలోనే నా జీవితంలో ఈ పరిణామాలు చకచక జరిగిపోయాయి.

అదీ ఒకందుకు మంచిదే ననిపిస్తోంది. ఈ ఝంఝామారుతంలో ఈ విధంగా కొట్టుకుపోయి, ఒక ఒడ్డున చేరగలిగాను. ఇదే జరగకపోతే, ఆ బలహీన మనస్తత్వంలో ఏ అఘాయిత్యానికి పాల్పడి ఉండేదాన్నో! మా తలిదండ్రులు అంత తొందర పడడానికి కారణం— తరవాత తెలిసింది— నా ఈ భాగోతం అంతా వాళ్ళకి చూచాయగా తెలిసిపోవడమేనట! కన్నబిడ్డ జీవిత సౌఖ్యం, తమ వంశగౌరవం దక్కేటట్టు అంతకన్నా యేం చేయగలరు?

కాలం అనే మహాశక్తి అన్నింటినీ సరిదిద్దుతుంది కదా! నా మానసికాఘాతం నుండి నేను కోలుకోడానికి కొంతకాలం పట్టింది. ఈలోగా నా శ్రీవారి ఆదరణా, ఆప్యాయతలు నేను కోలుకోవడానికి మరింత

ఉంగరాలజుట్టుతో, ఎప్పుడూ నవ్వే ముఖంతో, సహిమిరంగుతో నిండైన విగ్రహం — కంటపడగానే ఏదో తెలియని మధురానుభూతి నరనరాలకి ప్రాకిపోయేది. సుందర స్వరూపానికితోడు, సుకుమారమైన భావసంపద, సంస్కారం ఉట్టిపడే ప్రవర్తనా యివన్నీకలిసి ఆయనపైన నాకుండే భక్తివిశ్వాసాలని ద్విగుణీకృతం చేశాయి. మనసులోనే ఆరాధించడం మొదలుపెట్టాను.

ఆరాధన అంటే మా మాలతి నవ్వుతుందేమో! ఇంతకుముందు చేసినది పిచ్చి ఆవేశంతో ప్రణయారాధన. ఇప్పుడు చేస్తున్నది నిండుమనస్సుతో ఆత్మార్పణ!

రోజులు గడిచినకొద్దీ ఆయన మంచితనం మరింత బయలుపడేది. ఆ మంచితనం చూసినకొద్దీ నాలో ఒకరకమైన తెలియని భయం ఆవహించేది! 'ఇటువంటి పవిత్ర మూర్తితో, నీవంటి కలుషితాత్మ సాహచర్యం గడపడమా? నా సామీప్యతతో ఆయన పవిత్రతకూడా కలుషితమైపోతుందేమో?' అనే బాధ కలిగేది. ఇటువంటి బాధ కలిగినప్పుడల్లా, నా ప్రవర్తనలో నాకు తెలియకుండానే మార్పు వచ్చేది. అన్నీ సపర్యలూ చేసేదాన్ని ఒకరకమైన భయంతో — ఒక విధిలాగా చేసేదాన్ని కాని అందులో ఆప్యాయత కనిపించేది కాదేమో? అక్కడికీ వారు ఎంతో మృదువుగా 'ఏం రాజీ అలా ఉన్నావ్? ఒంట్లో బాగాలేదా? నాతో చెప్పడానికి కూడా నీకు అభ్యంతరమా?' అని ఎన్ని విధాలో అడిగేవారు. ఏమనిచెప్పను? ఎలా చెప్పను?

నేనెంత జాగ్రత్తపడినా, నా ప్రవర్తన వారికి వింతగానే కనిపించేది కాబోలు. నా మీద అనుమానం, దురుద్దేశం లేకపోయినా, నా మనస్సు తెలుసుకునేవరకూ ఆయన చేద్దామనుకున్నారు కాబోలు ఒకనాటి రాత్రి నేను ఆయన మంచంమీదకి చేరబోతోంటే, అన్నారు, 'శరీరాలు కలవడం కాదు రాజీ, నా ఉద్దేశంలో దాంపత్యం అంటే మనసులు కలవడం ప్రధానం. నీ మనస్సు కుదుటపడేదాకా నేను ఎలాంటి బలవంతం చేయ దలుచుకోలేదు.' అని వారంటే తల ఆ మంచంకోడుకి బద్దలు కొట్టుకోవా లని

హించింది. ఇంత హృదయ మార్దవం కల వ్యక్తి కూడా నా కారణంగా క్షోభ పెడుతున్నాను కదా! హే భగవాన్ ఏమిటి నాకు దారి ?'

అప్పటినుంచీ నా మనస్సుని నేనే సమాధాన పరుచుకోడానికి ప్రయత్నించి క్రమంగా కృతకృత్యురాల నయ్యాను. మునుపటి అవేదన కొంత తగ్గింది. నా యీ సాధనకి నా మాలతి ఉత్తరాలుకూడా చాలా సహాయ పడ్డాయి.

'...రాజీ మా స్కూల్లో మేష్టారు ఒకాయన అంటూ ఉండేవారు. ఆడదాని హృదయం ఖాళీసీసా వంటిది. ఏ పరిస్థితుల్లో దేనితో నింపితే ఆ రూపంలోనే కనిపిస్తుంది. పరిస్థితుల ప్రభావంవల్ల ఒకసారి కాకుండా అనేకసార్లు— మొదటిదానిని ఖాళీచేసి రెండోదానితో— నింపడం జరుగుతుంది. అందుకే స్త్రీ భావాలకి నిలకడ లేక పోవడం అని. అప్పుడు ఆయనతో నేను వాదించాను కాని, ఇపుడు నీవిషయం చూస్తుంటే ఆయన ఎంత అనుభవంమీద చెప్పారా అనిపిస్తుంది.

'నీ హృదయంలో నింపబడిన మొదటి దాన్ని ఖాళీచేసి, ఇప్పుడు పవిత్ర జలంతో నింపుకొని పదిలంచేసుకో. యిక నివేదన మాట అంటావా? తప్పు చేసినవాళ్ళు శిక్ష అనుభవించక తప్పదు. కాబట్టి నీ తప్పుకు— తెలిసిచేసినా తెలియక చేసినా — నీవూ శిక్షకి సిద్ధమై, నీ మనస్సులోని బాధనంతా మీ వారికి చెప్పేసి, ఆయన కాళ్ళమీదపడి క్షమించమని, లేదా తగిన శిక్ష వేయుమని ప్రార్థించు. ఏ శిక్షవిధిస్తే దాని అనుభవించు. ఒకవేళ నువ్వు భయపడే విపరీత పరిణామ మేర్పడితే— ఈ నరక యాతనకంటె అదేసుఖమని నా అభిప్రాయం.

'నీ భ్రమ కాని నీ ఉత్తరాలనిబట్టి అర్థంచేసుకుంటే, మీవారు నిన్ను తప్పకుండా క్షమిస్తారని నాకు నమ్మకం కలుగుతోంది. వయసుసహజమైన రీతిగానే చేశావుగాని హద్దుమీరలేదుగా. అందుకని విషయం విశదంగాచెప్పి, పర్యవసానానికి సిద్ధపడు. ఏమంటే ఆ పర్యవసానం నాకూ తెలియజెయ్యి...'

ఈ ఉత్తరం చదివిన తరువాత నాకూ ఒకరకమైన ధైర్యం వచ్చింది. ఆ ప్రవారమే చేస్తాను: పాపం ఇంతకీ ఆయన ఏమనుకుంటున్నారో యేమో!

**వసంతరావు చెప్పిన కథ**

ఏమనుకోవాలో అర్థంకాని పరిస్థితి యేర్పడింది నాకు. వృత్తిరీత్యా సైకలాజికల్ ఎంకరేజిమెంటు యిచ్చి ఎంతమందో పేషెంట్లని ఉత్సాహవంతులనిచేసిన డాక్టరునైన నేను నా స్వంత విషయంలో విజయవంతం కాలేకపోవడం నాకూ ఆశ్చర్యంగానే ఉంది. సున్నిత స్వభావం కల ఆమె ఏమంటే ఏమనుకుంటుందోననే ఉద్వేగంతోనే అంతసాహసం చేయలేకపోయాను.

పెళ్ళి చూపులకని వెళ్ళినప్పుడు రాజేశ్వరిని చూడగానే 'ఈమె నా హృదయేశ్వరి అయితే ఎంత అదృష్టం!' అని అనుకున్నమాట నిజం. నిజంగా నా అదృష్టం ఫలించినందుకు ఎంతగానో మురిసిపోయాను. చదువు, సౌందర్యంతోబాటు ఉత్తమ సంస్కారంగల నిరాడంబర యువతి అని తెలిశాక మరింత సంతోషం కలిగింది. ఆమె సాహచర్యంతో అనూహ్య సుందర సౌఖ్యాలనుభవించాలన్న నా ఆశలు అడియాశలు అయినప్పుడు అంతగానూ క్రుంగిపోయాను.

పరిచర్యల విషయంలో రాజీకి ఎప్పుడూ యేమరుపాటులేదు. నాకేది కావాలో, ఇష్టాలు గ్రహించినట్లుగా ముందుగానే అన్నీ ఏర్పాటు చేసేసేది. ఆమె నా జీవితంలో ప్రవేశించాక, జీవితానికి ఒక అర్థం, అందం కనిపించాయి. కాని యిన్నిచేసినా ఆమె యేదో ముభావంగా ఉండడంమాత్రం నాకు బాధకలిగేది. చేసే పనులలో ఆప్యాయత, ఆత్మార్పణకంటె విధ్యుక్తం అనే భావనే ఎక్కువగా కనిపించేది. అక్కడికీ ఎన్నోవిధాల ఆమె మనోగతభావాలు తెలుసుకుందామని ప్రయత్నం చేశాను, లాభం లేకపోయింది. చివరికి శారీరక సంబంధమైన అనుభూతుల విషయంలో కూడా ఆమెలో కావలసిన చైతన్యం కనిపించకపోయేసరికి, నాకు నేనే సర్దిచెప్పుకుని, కొంత వ్యవధి తరువాత పరిస్థితులు చక్కబడకపోవనే ధైర్యంతో తగిన జాగ్రత్తలు తీసుకున్నాను.

ఒక్కొక్కప్పుడు క్షణికోద్రేకంలో పురుష సహజమైన అనుమానం బయలుదేరి అనేక ఆవేశాలకి దారితీసి ఉద్రేకపరిచేది. 'కొంపదీసి ఈమె మనస్సులో ఇంకెవరైనా స్థానం సంపాదించుకో లేదు కదా? నాతో ఈ పెళ్ళి బలవంతంగా జరగలేదుకదా?' అనే సందేహాలు బాధ

పెట్టవి. కాని ఆమె ప్రవర్తనలో ఆ సంబంధమైన చిహ్నాలు ఎప్పుడూ కనిపించ లేదు. మరి ఎందుకామె యింత ముభావంగా నిర్లిప్తంగా ఉంది ?

మరికొన్ని సమయాల్లో ఆమె చర్యలు నా సమక్షంలో జాగ్రత్తగా పరిశీలిస్తే, ఏదో భయం ఆమెను పీడిస్తున్నట్టు అని పించేది. నాకు చెప్పడానికి భయపడి యేదో దాస్తున్నట్టు, అది నాకు తెలిస్తే యెలు వంటి విషమ పరిణామాలు సంభవిస్తాయో అని హడిలి పోతున్నట్టు తోచేది నాకు ఎంతగా ప్రయత్నించినా, ఆమె గత జీవి తంలో తప్పటడుగు వేసివుంటుందనే అను మానం వచ్చినా నాకు కలిగేది కాదు నా అంతరాత్మ ప్రబోధించిన దానికి ఎంతో విశ్వాసం కూడాను.

'అయితే యిటువంటి విచిత్ర దాంపత్య జీవితం ఎంతకాలం సాగాలి ? పరిష్కార మార్గం ఏ విధంగా లభ్యమవుతుంది ? భగవంతుడా ! ఏమిటి ఈ పరీక్ష' అని ఎన్నో రాత్రులు డాబామీద పడుకున్నప్పుడు నాలో నేను ప్రశ్నించుకునేవాణ్ణి. ఆ సమ యాల్లో యేమీ తోచక ఆకాశం వైపు చూసేవాణ్ణి. మబ్బులుకమ్మిన చంద్రుణ్ణి చూసినప్పుడల్లా నా రాజీ జ్ఞాపకం వచ్చేది. మానసికవేదన అనే మబ్బుకమ్మిన నా రాజీ సంతోషం అనే చంద్రుడు ఇలాగే మసక మసకగా కనిపిస్తున్నాడు. ఆ మబ్బు తొలగిన తరువాత ప్రకాశించే చంద్రునిలాగే నా రాజీ ముఖం సంతోషంతో ప్రకా శిస్తుందా ? ఎంతకాలం యిలా ఈ నిరీ

# వసంతరాజీయం

క్షణతో గడవాలి ? తొందరపడి నేను ఏ చర్య తీసుకున్నా ఫలితాలు ఎలా పరిణ మిస్తాయో ? అనంత శక్తిమంతమైన కాలమే దీనికి పరిష్కారం చెయ్యాలి అనే ఓదార్పుతో కాలం గడుపుతున్నా.

చివరకి ఒకనాడు ఆ పరిస్థితి రానే వచ్చింది ఆనాడు హాస్పిటల్ నుంచి కొంచెం ఆలస్యంగా యింటికి వెళ్ళాను దగ్గరగా ఉన్న హాలుతలుపు త్రోసుకుని లోనికి వెళ్ళాను. అంతా చీకటిగా ఉంటె, నేనే స్విచ్ వేశాను. ఆ వెలుగులో, ఆ హాల్లోనే కుర్చీలో కూర్చున్న రాజీనిచూసి ఆశ్చర్య పోయాను ఆ లైటు పడగానే ఆమెకూడా ఉలిక్కిపడి నావైపు చూసింది. సరిగ్గా అదే క్షణంలో ఆమెముఖం చూసిన నాకు ఆమె కళ్ళల్లో నిండుగాఉన్న నీళ్ళు,చెంప లపై తెల్లటిచారలు కనిపించాయి. నా హృదయం ద్రవించిపోయింది దగ్గరగా వెళ్ళి తలమీద చేయివేసి, మెల్లగా 'ఏమ యింది రాజీ ! ఎందుకు ఈ—'

అన్న నా వాక్యం పూర్తికాకుండానే ఆమె ఒక్క ఉదుటునలేచి నా కాళ్ళమీదపడి, 'ఏమండి నన్ను క్షమించరూ ? క్షమిం చరూ ?' అంటూ అలాగే ఉండిపోయింది.

ఒక్కక్షణంపాటు అప్రతిభుణ్ణి అయ్యాను. అంతలోనే మళ్ళీ తేరుకుని ఆమెను లేవనెత్తి, సోఫామీద కూర్చోబెట్టి, ఆమె చేతిని నా చేతుల్లోకి తీసుకుంటూ అనునయంగా అడిగాను.

'ఏం జరిగిందని రాజీ క్షమించడం ? నువ్వేమీ పొరపాటు చేయలేదు కదా !'

'ఉహూఁ! నేనింకా ఈ బాధని మన స్సులో దాచుకుని యాతనపడలేను ఉన్నది ఉన్నట్టుగా మీకు చెప్పేస్తున్నాను. ఆ తరువాత మీరు ఏశిక్ష విధించినా తృప్తిగా అనుభవిస్తాను.'

వెక్కిళ్ళలో కొంత విరామం కలిగింది. నేను గుటకలు మింగుతూ చూస్తున్నాను.

'మన పెళ్ళికి పూర్వం నేను వయో దోషం కారణంగానండి మరో కారణమువల్ల ననండి, ప్రేమలోపడి —'

'నటరాజన్ అనే అతనిని నమ్మావ్.'

ఈసారి అప్రతిభురాలు కావడం ఆమె వంతు అయింది. నేను నా ధోరణిలో చెప్పుకుపోయాను.

'అతను నిన్ను మోసంచేశాడు అంతేనా?'

'ఇదంతా మీకు —?'

'ఎలా తెలిసిందంటావ్ ? ఎంతకాలం నుంచో జరుగుతున్న పాతకథే మీ విషయం లోనూ జరిగింది. కొంతమంది పురుష పుంగవులకి మల్లెనే అతనుకూడా ప్రవ ర్తించి తన నైజగుణం యిప్పుడు కూడా బయటపెట్టుకున్నాడు. ఆ రోజుల్లో నువ్వు అతనికి రాసిన ఉత్తరాలన్నీ నాకు కట్ట కట్టి పంపాడు. ఈ ప్రోగ్రాస్టు అందింది.'

'అయితే ఆ ఉత్తరాలన్నీ మీరు —'

'శ్రద్ధగా చదివాను' అన్నాను నవ్వుతూ. 'అందులోని హృదయమార్దవానికి ముగ్ధుణ్ణి య్యాను. నిజం రాజీ ! ఒక స్త్రీ తాను మనసారా నమ్మిన పురుషునిపట్ల ఎంత గాఢంగా నమ్మకం కలిగివుంటుందో నాకు అవి చదివిన తరువాత అర్థం అయింది. అంతటి సహృదయత సొంతం కావడం నా అదృష్టం అనుకున్నాను.'

'అయితే మీకేం కోపం— అదే బాధ — కలగలేదా ?' ఇంకా ఆమె గొంతు అనుమానాన్నే ధ్వనిస్తోంది.

'పిచ్చి రాజీ! కోపం ఎందుకు ? అతగాడి నీచబుద్ధి తెలిసివచ్చిందికాని ఇందులో కోపం రావడానికి ఏముంది ? పెళ్ళికాక పూర్వం ఎన్నో అనుభవాలు అవుతూ ఉంటాయి పెళ్ళి చూపులకని ఎందరినో చూస్తాం. కొందరు నిజంగా మనవాళ్ళంతే బావుండును అని మనస్సు యేవేవో ఊహలు పెంచుకుం టుంది. అది కాకపోతే, ఆ ఊహా ప్రవాహం



# అన్ని కరువుల్లాగే పెళ్ళికరువూ!

బియ్యం కరువు, కిరసనాయిలుకరువు, ఇండ్లకరువు, గుడ్డల కరువు, పంచదార కరువు—ఇలా కరువులతో ప్రజలు ఏకరువు పెత్తిపోయారు—పోతున్నారు. నిజమే! ఈ కరువులన్నీ అనుభవిస్తున్నాం — బాగానే వుంది! 'పెళ్ళికి కరువేమిటా!' అని ఆశ్చర్యంతో ముక్కుమీద వేలేసుకోవచ్చు కాని కలియుగం కావడంతో కాలంమారి పెళ్ళికరువు పెనుభూతంలా వచ్చిపడింది. అది అందరికీ తెలిసీ, అనుభవంలోకి వచ్చినా, 'ఔ' ననుకోవడానికి, ఆత్మ గౌరవం ఒప్పుకోవడం లేదు స్వేచ్ఛగా సుఖంగా బ్రతకడమని, నాగరికతా పరిభాషలో దానికి పెద్ద పేరుపెట్టి, ఆత్మ వంచన చేసికొని, లలపోగరుగా వుంటు న్నారు.

దేశంలో ప్రబలిస్తున్న ధర విపరీతంగా పెరిగిపోవడానికి యుద్ధాలు కారణమైనట్లు, ఈ పెళ్ళికరువుకు కారణం 'శారదా యాక్టు'. బాల్య వివాహాలవల్ల, బాల వితంతువులు ఎక్కువై పోయారు. ముక్కుపచ్చలారని పిల్లలను మూడుకాళ్ళ ముసలివాళ్ళకు కట్టడంతో యీ సమస్య వచ్చిపడింది. అదిగాక, తాతయ్య యింకో తత్వం బోధపరిచాడు. మనిషికి పాతికేళ్ళ పైబడితే నూరేళ్ళ బ్రతికే అవకాశం ఎక్కువట. అందుచేత యీ చట్టంవల్ల, ప్రతి ఆడపిల్లా, పెద్దదై, పాతికేళ్ళ పైబడ్డ యువకుణ్ణి పెళ్ళాడి, నిండు నూరేళ్ళు సుఖంగా బ్రతుకుతుందని ఆశట! ఏమైతేనేం! అతి బాల్యవివాహాలవల్ల వచ్చే యింకా అనేకమైన అవస్థలను అవరోధించి, 'అష్టవర్షా భవేత్ కన్యా' అనే మాటను నీటిమూటను చేసేసింది.

న్యాయంగా ఆలోచిస్తే, బ్రాహ్మణులకు, కోమట్లకు తప్ప తక్కిన కులాల్లో, చట్టరూపంగా యీ ఆచారం లేకపోయినా యుక్త వయస్కులైన పిల్లలకే వివాహం చేయడమే ఆచారంగావుంది. ఈ నాటి పెళ్ళికరువు, ఆ నాడే అక్కడక్కడా వారిలో కనిపిస్తుండేది. అందుకే ఒక్కో తెగలోని అమ్మాయిలకు సగం తల నెరిస్తేకాని పెళ్ళికాదనే సామెత పుట్టింది. తక్కినవారు హాయిగా చిన్నప్పుడే సుఖంకొల్లగ వుంటుండగా, బాలవితంతువులై కుక్కిన పేనుల్లాగ మనం పడివుండడం బాగుండ లేదని, చక్కటి చట్టాన్నిపెట్టి సుఖ పడదామనుకున్నారు. శారదా చట్టం వచ్చింది. అందరూ ఆనందంగా వుందామను కున్నారు. స్వాతంత్ర్యంవస్తే, అందరూ సుఖపడతామనుకున్న ఆశలాగే, యిదీ చాలా చోట్ల అడియాసే అయింది.

టెన్నిసన్ మహానుభావుడన్నట్లు, పాత ఆచారం యెంతమంచిదైనప్పటికీ, రోజులు మారడంతో సంఘాన్ని కలుషితమే చేస్తుంది. అందుచేత కొత్త ఆచారానికి దోహదమనక తప్పదు మళ్ళా ఈ ఆచారం కాలప్రవాహంలో పాతదికాగానే క్రొత్తది రాక తప్పదు అలాగే 'శారదాయాక్టు' పాతబడిపోయింది. బాల్యవివాహాలను, వాటి వల్ల వచ్చే దుష్ఫలితాలను దూరంచేసి సుఖ శాంతులను ప్రసాదించగలిగినా, వేడీ చట్టం చాలా సమస్యలను సృష్టించింది. ఈ చట్టం చిత్రంగా వివాహాన్ని నిషేధించింది. చట్టంలో నిర్ణయించిన వయస్సులోపల వివాహంచేస్తే శిక్షగాని, యుక్త వయస్సులో వివాహం విధిగా చెయ్యాలనే నియమంగాని, వివాహమే చెయ్యనివారికి శిక్షగాని ఏమీలేదు. మానవనైజానికి, చెడ్డ పనులు చెయ్యడమన్నా, బాధ్యతలను తప్పించుకోవడమన్నా సరదా. పరిదిద్దేవారు, సాంఘికంగా, ఒక 'భయం' అంటూ లేక పోతే ఎంతటి సాహసానికైనా వెనుదియ్యరు. వరకట్న నిషేధపు బిల్లువచ్చినా, ఎక్కడో మహానుభావులుతప్ప, కట్నందగ్గర చేతులు చాపకుండా వుండలేకపోతున్నారు. అలాగే ఈ చట్టం స్వార్థపరులచేతుల్లో పై చెప్పిన యిక్కట్లకు దారితీసింది.

వ్యక్తి ఏకాకిగా జీవించడం కష్టం. కష్టసుఖాలకు, జబ్బుపడిన సమయాలలో సేవచేసుకోడానికి ఒకరికొకరు అవసరం. అదిగాక వ్యక్తికి భవిష్యత్తు వున్నదంటే, అది అతని పిల్లలద్వారానే. మమతాను బంధాలు, ప్రేమానురాగాలులేని జీవితం దుర్భరం. అదీగాక, వయస్సులోని కోరికలు తీరేవి వివాహం ద్వారానే. ఈ వాంఛలను మహామునులే అరికట్టలేరని పూర్వం అను కునేవారు. కాని ఈ రోజుల్లో సామాన్య స్త్రీలే, వివాహంలేక అట్టి వాంఛలను అరికట్టుకొని దుర్భరమైన జీవితాన్ని అనుభవిస్తున్నారు. ఎంతముద్దుగా పెంచిన తల్లిదండ్రులైనా విధిగా వివాహంచేసి తీరాలనే నియమం లేకపోవడంవల్ల, పెళ్ళి వాయిదావేసి, వయిస్సు మీరబెట్టి పిల్లలను భయంకర మానసిక రోగులుగా, పిచ్చి వాండ్లుగా తయారుచేస్తున్నారు.

ఒకవేపు 'సెక్సు' విపరీతంగావుండే సిని మాలు, ఆ సంబంధమైన పుస్తకాలు అధికమైపోతున్నాయి. పెళ్ళిమాత్రం ఏళ్ళు మీరినవాళ్ళకు తప్ప కావడంలేదు. కొంతమందికి ఆ భాగ్యం కూడా లేదు. బెండకాయ ముదిరినా ... సామెతకి విలువ పోయింది. బ్రహ్మచారులు — బ్రహ్మచారి ణుల వయస్సు విపరీతంగా ముదిరి పోతున్నది.

'పెళ్ళి' కాలేదనే చీకూ చింతా కూడా పెద్దవాళ్ళల్లో అంతంతమాత్రంగానే వుంటున్నాయి. మూలమున్న ముసలమ్మ కూడా 'పెళ్ళిఅయితే అయింది, లేకపోతే పోయింది. హాయిగా వుద్యోగం చేసుకు బ్రతుకుతారు' — అనే ధోరణిలో పడి పోయారు. బాలవితంతువులపై జాలిపడి, వాళ్ళకు మళ్ళీ పెళ్ళిచేస్తున్నారు. కాని, పెళ్ళికాని కన్యల విషయమై ఎవ్వరూ పట్టించుకోవడంలేదు. ఆ సమస్యా ఈ సమస్యా యించుమించు ఒకటిగావున్నా, దానికో అవ తార పురుషుడు జనించి ఎలుగెత్తి చాటడాన్ని, ఆ సమస్యపై సానుభూతి చూపి, పరిష్కారమార్గం కనిపెట్టారు. కాని పెళ్ళికాని వాళ్ళను హేళనగా చూస్తు న్నారు. పెళ్ళికాకపోవడం వ్యక్తులనేరం కాదుగా! పెద్దవాళ్ళనేరం కాని!

పాతరోజుల్లో 'పెళ్ళి' చెయ్యకపోవడం ఎంత తప్పని అనుకునేవారో, ఈ రోజుల్లో ఆమాట తలపెట్టడం అంత తప్పుగా భావి స్తున్నారు కొంతమంది అతి చాదస్తులు. యీ విషయమై, పాతకాలంనాడు వీరికెంత తొందరో, యీనాడంత నిదానం. 'యుక్త వయస్సు' అనేది ఒకటి వుంటుందని, ఆ

ఇప్పుడే ఏం తొందర' అనుకుంటూ, ఏ ఇరవై ఏళ్ళు దాటాకో సంబంధాలు చూడటం ప్రారంభిస్తారు. సాంఘికభయం లేకపోవడం వల్ల, ఏ సంబంధం చూసినా ఏదో వంక కనిపిస్తూనే వుంటుంది. అప్పటికి అమ్మాయికి పాతిక పైబడినా, 'ఆ మంచి సంబంధం వచ్చినప్పుడే చేస్తాము. మా ప్రక్కింటివారమ్మాయికి నలభై ఏళ్ళకి పెళ్ళయింది. మాకాలం నాడంటే తొందర కాని యీ రోజుల్లో ఏం ఖర్మం' అంటూ సమాధాన పడతారు. ఈ తెగ మూర్ఖత్వంలో కాస్త మంచివాళ్ళయితే, అమ్మాయికి పెళ్ళికాక పోవడం అదేదో ఆ పిల్ల తప్పయినట్లు, సాధించి పొయ్యారు. అదే కాస్త కఠినులైతే, ఒకవైపు పెళ్ళికి తగిన శ్రద్ధ తీసుకోక, తీసుకున్నా పెట్టుకున్న హిరణ్యాక్షవరాలు ఏనాటికీ సరిపోక, వివాహం కాకుండా విపరీతమైన వయస్సు వచ్చిన అమ్మాయిలను, వివాహం కాలేదని చెరిగి పోస్తూనే వుంటారు.

కొంతమంది ఇళ్ళల్లో మొదటి పిల్లకు పెళ్ళిచేస్తారు. 'పెళ్ళిచేసి చూడు' అనే సామెతలోని నిజం ఏం గ్రహిస్తారో మళ్ళీ పెళ్ళిమాట తలపెట్టరు. ఇంకా కొంతమంది అబ్బాయిలకైతే అన్నీ రాబట్టుకోవచ్చు కాబట్టి, అబ్బాయిలకు పెళ్ళిళ్ళు చేస్తారు. అమ్మాయిలను వొదిలివేస్తారు. కొంతమంది పుణ్యాత్ములు నాలు గక్షర ముక్కలు చెప్పిస్తారు. కొంతమంది అదీ చెయ్యరు. దాంతో అమ్మాయి ఎందుకూ పనికిరానిదై కూర్చుంటుంది.

సమాన హక్కులు సాధించామని ఆత్మవంచన చేసుకోవడమే తప్ప, శారదాయాక్టు వచ్చి, చదువులు ఏనాడువచ్చాయో, స్త్రీ వివాహపు హక్కును ఆ నాడే పోగొట్టుకొన్నది మళ్ళీ ఏ వీరేశలింగం వంటి మహానుభావుడో ఉదయించి; చట్టంలోని లోటును దిద్ది విధిగా వివాహానికి ఒక వయస్సు నిర్ణయించడమే వివాహ వ్యవస్థ చక్కబడదు నాడువాని 'పెళ్ళి—ఫేమిన్' పోదు. ఈ మధ్య ఏదో పత్రికలో చదివినట్లు, తిరిగి పాతఆచారమే ప్రచారంలోనికి వస్తే మేలనిపిస్తున్నది.

—మందరపు పద్మ ●

వంటలు

# మసాలా గ్రుడ్లు

కావలసిన సామానులు:— తాజాగ్రుడ్లు 3 పెద్ద వుల్లిపాయ 1, పచ్చిమిరపకాయలు 6, వెల్లుల్లిపాయి 1, అల్లం, జీలకర్ర, దాసినచెక్క, లవంగాలు, యాలుక్కాయలు తగినన్ని.

వుల్లి, పచ్చిమిర్చి మెత్తగానూరి వుంచుకోవాలి. వెల్లుల్లి, అల్లం, జీలకర్ర వేరేగాను, దాసినచెక్క, లవంగాలు, యాలుక్కాయలు విడిగాను మెత్తగా నూరుకొని, వుంచుకోవాలి. గ్రుడ్లను మేకుతో రంధ్రంచేసి, స్టీర్‌గిన్నెలోకి సొనంతా నెమ్మదిగా వంచాలి.(పచ్చసొన పడకుండాచూడాలి). ఈ సొనలో నూరి వుంచుకొన్న ముద్దలు, సరిపడ ఉప్పు, పసుపు వేసి, స్పూన్‌తో బాగా కలపాలి. గ్రుడ్డుగుల్లలలో యీ కలిపివుంచుకొన్న సొనను వేసి, రంధ్రానికి కొద్ది గోధుమపిండి, తడిపి ఆరంధ్రాన్ని పూడ్చి, తెల్లటిగుడ్డలో మూటగట్టి, నీరుపోసిన గిన్నెలో వాటిని వుడక పెట్టాలి. పది నిమిషాల తర్వాత, గిన్నెదించి మూటలను విప్పి, చల్లార్చాలి. బాగా చల్లారాక గ్రుడ్లపైపెచ్చులు, జాగ్రత్తగా వలిచి, వుంచుకోవాలి. కుంపటిమీద కళాయిపెట్టి, నూనెగాని, నెయ్యిగానివేసి, సన్నని సెగలో గ్రుడ్లను వేయించాలి. వేయించేటప్పుడు మూత వుంచాలి. యీ వంట చాలా రుచిగా, వుంటుంది. ఎవరన్నా ఫ్రెండ్స్‌కి డిన్నర్‌లో, సర్వ్‌చేస్తే, చాలా బాగుంటుంది. గ్రుడ్లలో పెట్టగా మిగిలిన మసాలాసొనను, గిన్నెకు వాసెనకట్టి, యీసొనను అరచేయి మందంగా సర్ది ఆవిరిమీద వుడికించాలి. పదినిముషాలు ఆగి, గిన్నెదించి వాటిని ముక్కలుగా చేసుకొని వుంచాలి. వుల్లి, పచ్చిమిర్చి ముక్కలుగా తరుక్కొని వుంచాలి. పై మాదిరిగా మసాలా సామానులో కొన్ని గసగసాలు చిన్న కొబ్బరిముక్కచేర్చి, ముద్దనూరుకోవాలి. కుంపటిమీద గిన్నెపెట్టి, సరిపడ నూనె వేసి, వుల్లి, పచ్చిమిర్చి వేసి దోరగా వేగాక, మసాలా ముద్ద, సరిపడవుప్పు, పసుపువేసి, బాగా కలిపి రెండు నిమిషాలాగి అరకప్పు నీళ్ళపోసి, మూత పెట్టాలి. మసాలా ఉడికేటప్పుడు తయారు చేసుకున్న, ముక్కలని గిన్నెలోకి వేసి, వుప్పు, కారం సరిపోయిందో లేదో చూసుకొని దగ్గిర పడ్డాక కొత్తిమీర సన్నగా తరిగివేసి దించాలి. యీ మసాలాకూర కూడా, ఘుమఘుమ లాడుతూ రుచిగా, బాగుంటుంది.

# గ్రుడ్ల పులుసు

గ్రుడ్లను వుడికించి, నూనెలో వేయించి, పెట్టుకోవాలి. వుల్లి, పచ్చిమిర్చి సన్నగా చీలికల్లా తరగాలి. కూరకు తగినంత, చింతపండుపులుసు పిసికి వుంచాలి. కుంపటిమీద గిన్నెపెటి రెండు టేబుల్‌స్పూన్ల నూనేవేసి, కాగాక మెంతులు, ఆవాలు వేసి చిటపట లాడాక, వుల్లి, పచ్చిమిర్చిముక్కలు, కరివేపాకు వేసి వేగాక పులుసుకు సరిపడ్డ వుప్పు, కారం. పసుపు, వేయించిన గ్రుడ్లు, పులుసులోవేసి మూతపెట్టాలి. దించేముందు, కొత్తిమీరవేసి దించుకోవాలి. పై మాదిరిగానే పులుసుతాళింపు పెటి పులుసు మరిగేటప్పుడు గ్రుడ్లను (వుడకబెట కుండా) కొట్టివేసేయాలి. వో అయిదు నిమిషాలకు, మధ్య చందమామ చుటూ తెల్లసొనవుండి, అరచేయి మందంలో అటు మాదిరి తయారవుతుంది. దీనికి తాజావేగాని, నిలువగ్రుడ్లు వాడకూడదు. యీ పులుసులో ములక్కాడ, టొమేటో కలుపువేసుకోవచ్చు.

కె. విజయలక్ష్మి ●



# నటి నర్తకి చంద్రకళ

వ్యాసం మోహన్‌కుమార్
ఫొటోలు ప్రభాకర్



తీరిక వేళల్లో...

"కాలేజీకి వెళ్ళ మూడు నెలలయిందండి. సెలవుపెట్టాను. జనవరినుంచి వెళ్తాను! కాలేజీలో చేర్చుకుంటే సరే.సరి! లేకపోతే ప్రైవేట్‌గా అయినా స్టడీచేసి బి. ఏ. పూర్తిచేస్తాను. డిస్‌కంటిన్యూ చేయదలచుకోలేదు.' అన్నది కుమారి చంద్రకళ—



ఉత్తమనటిగా స్థిరపడాలన్నది కోరిక..!







చదువుమీద శ్రద్ధాసక్తులు.

**యిటీవల నేనావేసు కాలేజీలో చదువుమీద శ్రద్ధాసక్తులు**

ఈ అమ్మాయి స్థానిక యస్. ఐ. ఇ. టి. ఉమన్స్ కాలేజీలో బి. ఏ. రెండో సంవత్సరం చదువుతున్నది. పరిశ్రమలోని చాలామందికి కూడా కుమారి చంద్రకళ నటిగానే తెలుసుగాని, నటిస్తూ చదువు కుంటున్న కాలేజి విద్యార్థినిగా ఎరుగరు. వరకట్నం, అన్నదమ్ములు, శ్రీ సారథి స్టూడియోస్ చిత్రం, ప్రతీకారం మొదలయిన చిత్రాలలో నిర్విరామంగా పని చేస్తున్నా కాలేజీమీద ధ్యాస ఉందంటే, చదువుమీద ఆమెకుగల శ్రద్ధాసక్తులు ఎలాంటివో అర్థమవుతుంది.

**ఆడపడుచు ఆర్ద్రత**

ఆడపడుచు చిత్రంద్వారా ఆంధ్రులందరికీ ఆడపడుచు అయింది చంద్రకళ. 'ఆ చిత్రం విడుదలయ్యాక అసంఖ్యాకమైన లేఖలు వచ్చాయి. వాటిలో ఎన్నో ఉత్తరాలు నన్ను కలవరపెట్టాయి. 'చెల్లీ' అని కొందరు. 'అక్కా' అని మరికొందరు, 'అమ్మాయ్' అని ఇంకొందరు సంబోధిస్తూ—వారి కుటుంబపు మంచి చెడ్డలు, కష్టసుఖాలు కూడా రాశారు. నా పాత్ర వారిని కదిలించి మెప్పించినందుకు ఓ పక్క ఆనందంగా ఉన్నా—మరోపక్క నా మనసు ఆర్ద్రమైంది, వారి అవ్యాజమైన ప్రేమాభిమానాలలో భాగం పంచుకునే హక్కు నాకు దక్కింది ఆడపడుచుగా. అంతకన్న కావలసింది ఏముంటుంది? అది నాకు పెద్ద సంతృప్తి' అన్నది.

**కొత్తసంవత్సరం కోరిక !**

'కొత్తసంవత్సరంలో మీ కోరికలేమిటి?' అని నేను అడిగినపుడు 'చక్కని నర్తకిగా రాణించి ఉత్తమనటిగా స్థిరపడాలనేది నా కొత్తసంవత్సరపు కోరిక !' అన్నదా అమ్మాయి తక్షణ— 'ఆఁ— మీరు వరకట్నం చూశారా?' అడిగింది. 'లేదు !' అన్నాను. 'చాలా మంచివేషమండీ ! నాకు నచ్చినవేషం. సానుభూతి చూరగొనే పాత్ర... ఇప్పుడొక మరాఠీ చిత్రంలోనూ నటిస్తున్నాను. సదాశివరావు జె. కవి ఆ చిత్రం నిర్మిస్తున్నారు. షూటింగ్ అయిపోయింది. 'అన్నదమ్ములు'లో కూడా నా వర్కు పూర్తయింది.' అన్నది కుమారి చంద్రకళ.

పుస్తక పఠనంమీద ఆసక్తి మెండు చంద్రకళకి. తీరికగా వున్నపుడల్లా ఎక్కువగా పుస్తకాలు చదువుతుంది. స్టూడియోకి వచ్చినపుడుకూడా పుస్తకాలు తెచ్చుకుంటుంది.

నాట్యంలో మంచి శిక్షణా, నటనలో నేర్పూ, అందమూ, చదువూ సంస్కారం వున్న చంద్రకళవంటి ప్రతిభగల చక్కని ఆర్టిస్టులను ప్రోత్సహించవలసిన అవసరం పరిశ్రమకు ఉన్నది.

**అభిమానులకు శుభాకాంక్షలు !**

'సారథీ స్టూడియోస్ పిక్చర్ అవుట్‌డోర్‌కి వెళ్తున్నాం. రేపు ఆ యూనిట్‌తో కలిసి ఊటీకి బయలుదేరుతున్నా. నామీద సాంగ్ పిక్చరైజేషన్. తిరిగి వచ్చాక మళ్ళా కలుద్దాం !' అంటూ ముందుకు వెళ్ళబోయేదల్లా వెనక్కితిరిగి 'ఆంధ్ర సచిత్ర వారపత్రికద్వారా నా అభిమానులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు అందజెయ్యండి!' అన్నది చిరునవ్వుతో.



'జగత్ కిలాడీలు'లో ఎస్. వి. ఆర్. విద్యశ్రీ విజయఖాను

# సినిమా

ప్రముఖ హాస్యనటుడు పద్మనాభం, రమాప్రభను మనస్ఫూర్తిగా ప్రేమించాడు. తనను ఆమెకు నచ్చిందో లేదో తెల్సుకోవా అనుకున్నాడు; ఆమెను సమీపించి మాటిగా అడిగాడు. ఆమె వెలిబుచ్చిన అభిప్రాయాన్ని మీకు తెల్పాలిగ.

రమాప్రభ: స్త్రీస్వాతంత్రంమీద మీ అభిప్రాయం ఏమిటి?

పద్మనాభం: స్త్రీకి సంపూర్ణస్వాతంత్రం వుండాలని వాదించే వాళ్లల్లో నేను ప్రథముణ్ణి.

రమ: థాంక్స్.

పద్మ: స్త్రీపురుషుడికి యెప్పుడూ బానిసగావుండే అవసరంలేదు.

రమ: నా ఆశయంకూడ అదే.

పద్మ: మన దాంపత్యంలో అది నిరూపిద్దాం, అంటూ ...రమను ముట్టుకోబోతాడు.

రమ: ఆఁ! ఆఁ! ఇవన్నీ మన పెళ్లయ్యాకే.

పద్మ: అలాగే, గుడ్, గుడ్ అని నిష్క్రమించబోతూ తనకు కాబోయే అత్తమామ అయిన రాధాకుమారి, రావికొండలరావు కేసి 'అత్తయ్యా! మావయ్యా! మా అభిప్రాయాలు కలిసాయి.'

రాధాకుమారి: శాస్త్రులుగారూ, మాస్త్రారేమండి, పంచాంగంతీసి ముహూర్తం పెట్టెయండి.

ఈ సన్నివేశం గోపాలక్రిష్ణా పిక్చర్స్ 'కథానాయకుడు' చిత్రానికిగాను హేమాంబరధరరావు ప్రసాద్ స్టుడియోలో చిత్రించాడు. పద్మనాభం, రమాప్రభల దాంపత్య జీవితం యెలా సాగిందని తెల్సుకోవాలంటే



'పత్తేకాలపు పత్తెమ్మ'లో రాజశ్రీ

గోపాలక్రిష్ణ నిర్మిస్తున్న 'కథానాయకుడు' చూడండి. జయలలిత, రామారావు నాయకీనాయకులుగ నటిస్తున్న యీ చిత్రం పూర్ణా పిక్చర్స్ద్వారా మార్చిలో విడుదల కాగలదని యిటీవల నిర్మాత గోపాలక్రిష్ణ వెల్లడించాడు.

* * *

ప్రసాద్నుండి విజయాగార్డెన్స్కువచ్చాము అక్కడ కవి నారాయణరెడ్డి, నిర్మాత డి. వి. ఎస్. రాజు, సంగీత దర్శకుడు టి. వి. రాజు వుండడాన్ని చూచి డి. వి. ఎస్కు సంబంధించిన రికార్డింగు వుంటుందని నిర్ణయించుకున్నాము. రికార్డింగు థియే



'బొమ్మలుచెప్పిన కథ'లో రాజబాబు, సంధ్యారాణి

టర్లోకి వెళ్ళండి అని డి. వి. ఎస్. రాజా దారి చూపించారు. సౌండు ఇంజనీరు స్వామినాథన్ వాల్యూమును పరిచూసుకుంటూ వుంటే; మైకు ముందు సుశీల వాయిస్ సరిదిద్దుకుంటూవుంది. విజయా కృష్ణమూర్తి ఆర్కెస్ట్రాకు సలహాలిస్తున్నాడు అందరూ సెటిల్‌కావడానికి పదినిమిషాలు పట్టింది. సుశీల పాడ ప్రారంభించింది. కవి నారాయణరెడ్డి వ్రాసిన పాటకు సుశీల తన మృదుమధురమయిన గానాన్ని జోడించింది. ఆమె పాడినప్పుడు నన్ను నేనే మరచి పోయానంటే నమ్మండి. నేను అంతగా



'కథానాయకుడు'లో
జయలలిత, యన్. టి. రామారావు

వినపై విన్న పాటను నీకూ తెల్పాలిగా.

పాకే అనురాగ గగనాలలోన
ఆగింది కన్నీటి వానా
మెరిసింది ఒక ఇంద్ర ధనువు
విరిసింది నాలోని అణువణువు !
వెల్లివి...నవ్వెను నాలో జాజిమల్లి
పొంగెను నాలో పాలవెల్లి
తళతళలాడెను నా ముంగిట
ముత్యాల రంగవల్లి !!

ఈ పాటను డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న జానపదచిత్రంలో దేవిక పాట



'అన్నదమ్ములు'లో రామ్మోహన్, కృష్ణ, విజయనిర్మల

వెంట తెరపై వింటారు. విఠలాచార్య దర్శకత్వంలో శరవేగంతో తయారౌతున్న యీ చిత్రంలో ఎన్. టి. ఆర్. ద్విపాత్రాభినయం సరికొత్తపంథాలో సాగుతున్నట్టు యిప్పటివరకు చూచిన రషస్‌నుబట్టి చెప్పగల్గుతున్నాను. ఈ చిత్రానికి ఎస్. ఎస్. లాల్ కెమెరాను, టి. వి. రాజు సంగీతాన్ని నిర్వహిస్తున్నారు.

*  *  *

విజయా గార్డెన్స్‌నుండి బయటపడ్డ సమయానికి 'సత్తెకాలపు సత్తెయ్య' నిర్మాత ఫియట్‌లో వెళ్ళడాన్ని చూచి కారు ఆపమని చప్పట్లు కొట్టాను. సడన్ బ్రేక్‌వేసి రివర్సులో గార్డెన్స్‌ముందు ఆపాడు. 'ఎక్కడికి ప్రయాణం?' అని ప్రశ్నించాను. 'విక్రంకు వెళుతున్నాను' అన్నాడు. 'ఏమిటి విశేషం ? కొత్తపిక్చరు మొదలెట్టారా' అని అడిగాను. 'అబ్బే! అదేం కాదండి. చలం పిక్చరు తీస్తున్నాడు చూచివద్దామని బయల్దేరాను' అన్నాడు. ఎక్కణ్నించి వస్తున్నారు అని అడిగాను. 'వాసూ స్టూడియోలో నాపిక్చరు ఎడిటింగు జరుగుతూ వుందిగా, అక్కడ్నించి' అన్నాడు. సరే, నేనూ వస్తాను అని కారెక్కి



'శుభలేఖ'లో శివాజీ గణేశన్, కె. ఆర్. విజయ



'మూగనోము'లో పద్మనాభం, గీతాంజలి

వి(కంకు వెళ్ళాను.

వి(కంకు నేను వెళ్ళిన సమయానికి శారదకు సంబంధించిన దృశ్యాలను దర్శకుడు జి. వి. ఆర్. శేషగిరిరావు చిత్రీకరించి 'పాక్అప్' అన్నాడు. నన్నుచూచిన జి. వి. ఆర్. 'కాస్త ఆగండి, ఒక్క నిమిషంలో వచ్చేస్తాను' అని కుర్చీ చూపించాడు. ఆ గ్యాప్‌లో కాఫీ అరకప్పు ముగించుకున్నాను. వాట్‌సార్, ఎలావుంది మీ పొజిషన్ అని శేషగిరిరావును అడిగాను. 'ఫర్వాలేదండి. ఏదో తృప్తి కన్పడుతూవుంది.

## సినిమా

ఇప్పుడు మూడు చిత్రాలకు దర్శకుడిగ పనిచేస్తున్నాను' అన్నాడు. 'చలం నిర్మిస్తున్న 'ఎదిర్ నీచ్చల్'ను, పద్మనాభం నిర్మించే 'కోటీశ్వరుడు' చిత్రాన్ని, రామానాయుడు నిర్మించనున్న సాంఘికానికి దర్శకుడిగ నియమింపబడ్డాను.' అన్నాడు. ఇక వస్తానండి అని వి(కంనుండి బయల్దేరి సురేష్ పిక్చర్సు ఆఫీసుకి టాక్సీని మాట్లాడుకున్నాను.

* * *

టాక్సీ బోగ్‌రోడ్డులోగల సురేష్ ఆఫీసు ముందు నిలబడ్డప్పుడు సరిగా ఒంటిగంట అయింది. అప్పుడే 6757 ఫ్లిమత్‌లో రామానాయుడుకూడ దిగాడు. ఇద్దరం కలసి ఆఫీసులోకి వెళ్ళాము; 'భోంచేస్తారా?' అని నాయుడు అడగడం, 'నాకుకాదు నా కలానికి భోజనం పెట్టండి' అని నేను సమాధానమివ్వడం, ఆయన నా మాటలోని ఆంతర్యాన్ని అవగాహన చేసుకుని, ఇంకా



'సప్త స్వరాలు'లో కాంతారావు, విజయలలిత

క్రింది విధంగా చెప్పడం జరిగింది.

'బొమ్మలు చెప్పిన కథ' షూటింగు పూర్తయింది. పాటలన్నీ బాగా వచ్చాయి. ఫిబ్రవరి 21 కి విడుదల చెయ్యాలనుకుంటున్నాను.' అని ముగించబోతూ 'మీ పాఠకులకు సరికొత్త వార్త ను అందించండి' అని తను నిర్మించబోతున్న సాంఘికచిత్రం వివరాలనుతెల్పాడు. 'విజయ—సురేష్ కంబైన్స్ బ్యానర్‌పై తురయా'ర్ మూర్తి వ్రాసిన కథను జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకత్వంలో నిర్మిస్తున్నాము.

# సినిమా డైరీ

- శ్రీ చిత్రకల్పన పిక్చర్స్‌కు సంబంధించిన నాల్గు పాటలను ఆరుద్ర వ్రాయగా, కె వి మహదేవన్ సంగీత దర్శకత్వంలో విజయాగార్డెన్స్‌లో సుశీల, ఘంటసాల పాడారు
- విజయభట్ మూవీస్‌కుగాను నారాయణరెడ్డి వ్రాసిన యుగళగీతాన్ని సుశీల, ఘంటసాల పాడగా విజయాగార్డెన్స్‌లో కె వి మహదేవన్ ఫిబ్రవరి 1 వ తేదీన రికార్డు చేసాడు ఈ పాటను వాణిశ్రీ, నాగేశ్వరరావు తెరపై పాడ్తారు ఈ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు
- ప్రసాద్ ఆర్ట్సు "సత్తెకాలపు సత్తెయ్య" ఫిబ్రవరి 14 న విడుదలౌతుంది చలం నాయకుడిగ నటించిన యీ చిత్రానికి కె బాలచందర్ దర్శకుడు
- సురేష్ పిక్చర్స్ నిర్మిస్తున్న "బొమ్మలు చెప్పిన కథ" ఫిబ్రవరి 21 కి విడుదల కాగలదని వూహించబడ్తుంది. విజయనిర్మల, విజయలలిత, గీతాంజలి, కాంతారావు, కృష్ణ, రాజబాబు నటించిన యీ చిత్రాన్ని వరయుగా విడుదల చేస్తున్నారు.
- శ్రీ రాజా ఆర్ట్సు ఫిలింస్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో ప్రభాకరరెడ్డి ఒక ముఖ్యపాత్రను ధరిస్తున్నాడు. కె. ఎస్. ప్రకాశరావు దర్శకత్వంలో యీ చిత్రం సర్వజన రంజకంగా తయారవుతుంది.
- ప్రముఖ చిత్ర నిర్మాత, జెమిని స్టుడియో అధినేత అయిన ఎస్. ఎస్. వాసన్‌కు భారత ప్రభుత్వం "పద్మవిభూషన్" బిరుదాన్ని ప్రసాదించింది.

ఈ చిత్రంలో పద్మశ్రీ నాగేశ్వరరావు నటించడానికి అంగీకరించడమే గాక నాకు మ్యాక్సిమమ్ కాల్‌షీట్లనుకూడ యిచ్చాడు ఇందులో నాగేశ్వరరావు ఫిషర్ మ్యాన్‌గాను. క్యాప్టెనుగాను ద్విపాత్రాభినయం చేస్తున్నాడు. ఫిషర్‌మ్యాన్ భార్యగా కె. ఆర్ విజయ, క్యాప్టెన్‌ను ప్రేమించే అందాల యువతిగా కాంచన నటిస్తుంది. ఇతర ముఖ్య పాత్రలను గుమ్మడి, నాగభూషణం సత్యనారాయణ, రాజబాబు ధరిస్తారు. సంగీతాన్ని విశ్వనాథం సమకూరుస్తాడు' అని రామానాయుడు ఫుల్‌స్టాప్ పెట్టబోయాడు. 'మరి షూటింగు యెప్పట్నించి ?' అని ప్రశ్నించాను. 'మార్చి 1 నుండి 10 వరకు ఏప్రిల్ 1 నుండి 18 వరకు, మే 1 నుండి 10 వరకు షెడ్యూలువేసి వుంచాను. రికార్డింగు ఫిబ్రవరి 12 న ప్రారంభిస్తాను. రికార్డింగుకు నాగేశ్వరరావు వస్తాడు' అన్నాడు. చాలా థ్యాంక్స్, అని చెప్పి నేను నా టాక్సీని పాండీ బజారుకు మళ్లించాను.

* * *

నేనుకూడ భోంచేసి, అరగంట విశ్రమించి ఆపైన అన్నపూర్ణా పిక్చర్స్‌కు వెళ్లాను. నేను వెళ్లిన సమయానికి దర్శకుడు తాతినేని రా మా రా వు మిద్దెపై నుండి దిగి యెదురొచ్చాడు. ఎలావున్నారు? అని అడిగాను. 'బిజీగా వున్నానండీ' అన్నాడు. ప్రస్తుతం విజయభట్ చిత్రాన్ని డైరెక్టు చెయ్యడంలో నిమగ్నమైవున్నట్టు చెప్పి వెళ్లిపోయాడు. వరండాదాటి ఆఫీసు గదిలోకి వెళ్ళేసరికి సారధి స్టుడియో చిత్ర సహకార నిర్మాత టి. వి. ఎస్. శాస్త్రి ఫోనుమీద ఫోనుచేస్తూ నన్నుచూచి కూర్చోమని సంజ్ఞ చేసాడు. ఏమిటి యిలా వచ్చారు అని అడిగాడు. మీ పిక్చరు స్టిల్సు యిస్తారేమోనని వచ్చాను అన్నాను. పై వారం యిస్తానండీ. నిన్నటి రోజున ఆల్బంలో స్టిల్సు సెలెక్టుచేసి సత్యంవద్దకు పంపించాను అన్నాడు. మీ చిత్రంయొక్క షూటింగు పూర్తయిందా అని ప్రశ్నించాను. ఇక ఒక పాటమాత్రం మిగిలివుంది. ఆ పాట ఫిబ్రవరి 11 నుండి సారధి స్టుడియోలో చిత్రీకరించబడుతుందిఅన్నాడు. మేము మాట్లాడే సమయానికి ప్రముఖ కథకుడు ముళ్లపూడి వెంకటరమణ అక్కడికి వచ్చాడు 'హలో, బాగున్నారా' అని,



చంద్రా మూవీస్ చిత్రం ప్రారంభోత్సవ సందర్భములో నిర్మాతలు శ్రీయుతులు కొల్లూరి వెంకటేశ్వరరావు, గొరిజాల శేషగిరిరావు, రామసుబ్బారెడ్డి, బి. ధర్మరాజు, హరనాథ్, కృష్ణకుమారి దర్శకుడు శ్రీ తోట రామమోహన్‌రావు, ఛాయాగ్రాహకుడు బి. ఎస్. జాగీర్‌దార్.



'ముద్దాయి — హైద్రాబాద్'లో కల్పన

అడిగాను. ఓ. ఎస్. అన్నాడు: మీ పిక్చరు యెప్పుడు ప్రారంభిస్తున్నారు అని ప్రశ్నించాను 'ఫిబ్రవరి 1 నుండి జరుగుతుంది. నా పిక్చరుకు సంబంధించిన వివరాలను మీ పాఠకులకు తెల్పండి'...అని యీ క్రింది సమాచారాన్ని చెప్పారు.

'చిత్రకల్పనా బ్యానర్‌లో నేను, బాపు కలిసి నిర్మించే చిత్రంయొక్క షూటింగు ఫిబ్రవరి 1 నుండి ప్రారంభమౌతుంది. పద్మశ్రీ నాగేశ్వరరావు ద్విపాత్రాభినయం చేస్తున్నాడు. ఆయనకు జంటగా విజయనిర్మల ప్రప్రథమంగా నటిస్తూంది. ఇతర ముఖ్యపాత్రలను నాగభూషణం, కృష్ణంరాజు, సూర్యకాంతం, శాంతకుమారి, రుక్మిణి ధరిస్తున్నారు సంగీతాన్ని మహదేవన్, ఆర్టును జి. వి. సుబ్బారావు, కెమరాను వెంకటరత్నం, ఎడిటింగును సంజీవి నిర్వహిస్తారు. మొదటి షెడ్యూలు హైదరాబాదు పరిసరాల్లో (అవుట్‌డోర్) జరుగుతుంది' అని ముగించాడు. మా సంభాషణ ముగిసేసరికి దుక్కిపాటి మధుసూదనరావు కూడ వచ్చేసారు. రావడం అంటే హైదరాబాదుకు ప్రయాణమై రావడం అన్న మాట అప్పటికే అయిదుగంటలు కావడం వల్ల యేరోడ్రోముకు వెళ్లవలసినందువల్ల, మళ్లీ కల్సుకుందామని మధుసూదనరావు ఫియట్‌యెక్కి మీనంబాకంకువెళ్లి

# సినిమా

పోయారు నేనుకూడా శాస్త్రి, ముళ్లపూడి రమణలకు గుడ్‌నైట్‌చెప్పి గిరి రోడ్డులోగల, తారకరామా పిక్చర్సుకు వెళ్లాను.

తారకరామా పిక్చర్స్ నిర్మాత పుండరీకాక్షయ్య, షెడ్యూలును తిరగవేస్తున్నట్టు గుర్తించిన నేను పది నిమిషాలు ఆరుబయట వెయిట్‌చేసి, ఆ పైన ఆఫీసు గదిలోకి వెళ్లాను. చిరునవ్వుతో నన్ను ఆహ్వానించారు మరి నేను వచ్చిన పని చెప్పాలిగ 'మీ పిక్చరుకు పేరు ఖాయం చేసారా? స్టిల్సు యిస్తారా?' అని అడిగాను. 'ఇంకా లేదండి. మంచి టైటిల్‌కోసం ఆగివున్నాను ఆ పైన పబ్లిసిటి చేస్తామనుకుంటున్నాము' అని సమాధానమిచ్చాడు. 'ఇన్‌డోర్‌వర్కు చాలావరకు పూర్తయింది' హైదరాబాదులో అవుట్‌డోర్ పెట్టుకోవాలనుకుంటున్నాను' అని ముగించారు. ఎన్. టి. రామారావు ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా వుండగల యీ చిత్రంలో శశిరేఖ అనేడి కొత్తనటి రామారావుకు నాయికగా నటిస్తూంది బి. ఏ. సుబ్బారావు డైరెక్టు చేస్తున్న యీ చిత్రంలో మహ్మద్‌రఫీ గాన సుధారసాన్ని వినే అదృష్టాన్ని నిర్మాత కల్పించడం ఒకవిశేషం.

* * *



'శభాష్ సత్యం'లో విజయలలిత, సత్యనారాయణ.

## మీకు తెలుసా?

మద్రాసు రాష్ట్రంలోగల సినిమా థియేటర్లు 1,112

ఆంధ్రప్రదేశ్‌లోగల సినిమా థియేటర్లు 713

ప్రముఖ నటి సరోజాదేవికి 1969 జనవరి 26 న భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదాన్ని యిచ్చింది.

అక్కినేని నాగేశ్వరరావు 1944లో సినిమా రంగాన్ని ప్రవేశించాడు

ఎన్ టి రామారావు 1949 లో చిత్రపరిశ్రమలో అడుగుపెట్టాడు.

ఎం జి రామచంద్రన్ నటించిన మొదటి చిత్రం 'సతీ లీలావతి' 1936లో విడుదలయింది.

అక్కినేని నాగేశ్వరరావు, ఎన్. టి రామారావు కలిసి నటించిన మొదటి చిత్రం 'పల్లెటూరి పిల్ల'

భానుమతీ రామకృష్ణ, స్వర్గీయ ఎన్. ఎస్. కృష్ణన్ కలిసి నటించిన చిత్రం 'పల్లతంబి'

గిరి రోడ్డులో పని ముగియగానే బజుల్లా రోడ్డులోని గోపాలకృష్ణా పిక్చర్స్‌కు నడక సాగించాను. ఆఫీసులో గోపాలక్రిష్ణ, హేమాంబధరరావు దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు పసిగట్టాను. ఈ సమయంలో అంతరాయం కల్గించడం సబబుగాదని వెళ్లబోతుంటే రండి శ్రీనివాస్ అని గోపాలకృష్ణ పిలవడంతో, లోనికి వెళ్లక తప్పిందికాదు. 'ఏమిటిసార్, షూటింగు పూర్తయినట్టేనా? ఫిబ్రవరిలో రిలీజు చేస్తున్నారా' అని అడిగాను. 'ఇంకా రెండు రోజులు పని మిగిలి వుంది. విజయలలిత, రామారావులు ఫిబ్రవరి 16, 17 కాల్‌షీట్లు యిచ్చారు. అది పూర్తయితే చిత్రాన్ని మార్చిలో విడుదల చెయ్యాలనుకుంటున్నా'నంటూ వాళ్ల పిక్చరుకు సంబంధించిన పాటలు ఆంధ్రాలో బహుళ ప్రజాదరణ పొందుతున్నట్టు, పిక్చరు ట్రెయిలర్ జనాన్ని విపరీతంగా ఆకర్షిస్తున్నట్టు వెల్లడించాడు. సరే, వస్తానండీ అని చెప్పి నా గదికి వెళ్లిపోయాను.

* * *

నా మరునాటిదినం కార్యక్రమం వాహిని స్టూడియోలో ప్రారంభమైంది. అరవప్లోర్ లోకి వెళ్ళిన నన్ను దర్శకుడు బి. వి. శ్రీనివాస్ సాదరంగా ఆహ్వానించి తన పనిలో నిమగ్నుడయ్యాడు. కళ్ళు మిరుమిట్లు గొలిపే దుస్తుల్లో విజయలలిత వయ్యారంగా నిలబడివుంది అల్లంత దూరంలో రామకృష్ణ కూర్చునివున్నాడు నృత్యదర్శకుడు చిన్ని సంపత్ విజయలలితకు రిహార్సలు యిస్తున్నారు వాళ్ళను చూడడంతో నా పని పూర్తవుతుందా? ఆ సన్నివేశ ప్రాధాన్యతను తెల్సుకోవాలిగ. అందుకని నాకు పదిగజాలదూరంలో ఆసీనుడైవున్న విఠలాచార్యవద్దకు వెళ్ళి నేను వచ్చిన పనిని వివరించాను ఆయన యిలా చెప్పసాగాడు.

'విజయలలిత ఒక శాకిని. అమెకు అందమయిన యువకుల్ని కవ్వించి, తన వైపు మరల్చుకోవడం పరిపాటి అమెతో పరిచయం చేసుకునే ప్రతివాడు ఆనాడే హతుడుగావడం అలవాటు. ఇలా ప్రతిరోజూ ఒక నవయువకుడు బలిఅవుతూవుంటాడు. ఒకరోజు యువరాజు రామకృష్ణ అరణ్య


'బొమ్మలు చెప్పిన కథ'లో విజయనిర్మల


'[illegible]'లో రాజశ్రీ

# సినిమా

మార్గంలో వేటకై వచ్చి ఒకచోట సేద తీర్చుకుంటూవుంటాడు. విజయలలిత ఆ సుకుమారుడ్ని చూస్తుంది. అతన్ని పొందా లనుకుంటుంది. కాని రామకృష్ణకు యీమె గుట్టు తెలుసు; అందుకే ఆమెకు లొంగడు; రామకృష్ణను యెలాగయినా వరించాలని విజయలలిత తన అవయవ సౌందర్యాన్ని, వాలుచూపులతో, వాడికైపులతో బహిర్గతంచేస్తుంది. విజయ ఒక పాటనుకూడ పాడింది.

పిలిచింది అందాల బాల,
ఏయ్ వలచింది మందారమాల,

ఈ పాటను నారాయణరెడ్డి వ్రాసారు. విజయా కృష్ణమూర్తి సంగీత సారధ్యంలో సుశీల కమ్మగా పాడింది. విజయలలిత ఆట, పాటలకు రామకృష్ణ ముగ్ధుడయ్యాడా? ఆమెకోరిక ఫలించిందా? ఈ ప్రశ్నలకు సమాధానం విఠల్ కంబైన్స్ నిర్మిస్తున్న జానపదచిత్రం జయలలిత, రామారావు నాయకీ, నాయకులుగ నటించే యీచిత్రం విజయా కంబైన్స్‌ద్వారా ఆంధ్రలో విడుదలౌతుంది.

* * *

'అలీబాబా నలభైదొంగలు' చిత్రాన్ని మీరు డైరెక్టుచేస్తున్నారా అని అడిగాను. 'అవును. ఆ చిత్రానికిగాను జనవరి 29 వ రామబ్రహ్మంగారి ఆఫీసులో పూజ జరిగింది' అని విఠలాచార్య చెప్పారు. రికార్డింగు ప్రారంభించారా? అని ప్రశ్నించాను. 'లేదండి. విఘ్నేశ్వర స్తోత్ర పాఠంతో ప్రారంభమైంది. పూజకు నేను, నారాయణరెడ్డి, డి. వి. నరసరాజు, ఎన్. టి. రామారావు వెళ్ళి నిర్మాతను ఆశీర్వదించి వచ్చాము' అని ఆచార్య వివరించాడు. శ్రీ గౌతమీ పిక్చర్స్ నిర్మించే 'అలీబాబా నలభైదొంగలు' షూటింగు మార్చినుండి ప్రారంభమౌతుంది. ఈ చిత్రానికి డి. వి. నరసరాజు రచయితగాను, ఘంటసాల సంగీత దర్శకుడిగాను వ్యవహరిస్తున్నారు. జయలలిత, రామారావు నాయకీ నాయకులుగా నటిస్తున్న యీ చిత్రం 1969 లోనే విడుదల కాగలదట.

—శ్రీనివాస్ ●



'అన్నదమ్ములు'లో చంద్రకళ, కృష్ణ



'బందిపోటు దొంగలు'లో ఒక దృశ్యం



'జగత్ కిలాడీలు'లో విజయలలిత, కృష్ణ, వాణిశ్రీ, బాలకృష్ణ, జనార్దనరావు

# పుస్తకాలు

## స్వయంవరణం

(నవల, రచయిత: శ్రీ మహీధర రామమోహనరావు, ఎమెస్కో పాకెట్‌బుక్. ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్, వెల: రూ 2—00 పేజీలు 208.)

మన దేశంలో ఏ విషయం అధికారికంగా చెప్పాలన్నా, రాజకీయ నాయకులే చెప్పాలికదా! శంఖంలో పోస్తేగాని, తీర్థం కాదుగదా! అందువల్ల రాజకీయజ్ఞులు ఏమన్నారూ అంటే, వర్ణాంతర ప్లస్ కులాంతర ప్లస్ మతాంతర వివాహాలు బెస్ట్ అన్నారు. అందువల్ల దేశంలో సమూహిక సామాజిక ఏకత్వం వచ్చి తీరుతుంది అనీ అన్నారుగదా, కొంతవరకు అది మంచిదే!

కాగా పోగా, పూర్వం నుంచి మన దేశంలో ఉన్న, వివాహ వ్యవస్థ మారిపోతే, మహా దేశంగా మహోజ్వలాగ్గా, మరీ తేలిగ్గా సమస్యలు సమసిపోతాయి, పరిష్కారం అవుతాయి, అంటూ నమ్ముతున్నారుగదా! శుభమస్తు.

ఆవిషయం చెప్పాలని ఈ నవల వ్రాయబడింది. ఈ విషయం గూర్చి చాలామంది సాహిత్యం సృష్టించారు. పల్లంపూడిపోయి మెరకకావటానికి ఎవరు వస్కిన ధోరణిలో వాళ్ళు తలా ఒక రాయి వేస్తే ఏనాటికయినా పల్లం సమతలానికి తరలి రావచ్చుగదా! ఈ నవల ఆ పల్లం పూడ్చే ఉద్దేశంతో ఈ రచయిత వేసిన ఒక రాయి!

నవల ప్రారంభం నుంచి, దాదాపు సగం దాకా సాగిన సిద్ధాంత వాదనలు, తార్కికదృష్టి ఉన్నవాళ్ళకు నచ్చుతాయి. సామాన్య పాఠకులకు నచ్చక పోవచ్చు. మిగతాసగం అందరికీ నచ్చుతుంది ఎందుకంటే నవల ద్వితీయార్థంలాగా ఉండాలి కాబట్టి!

ఇవి సరదా నవల. కథలో పటుత్వం కంటే రచయిత భావనాశక్తి ఎక్కువ. సామాన్యమైన ఇతివృత్తంమీద రచయిత సామర్థ్యం అల్లుకుపోయింది. ప్రతిభ వంతమయిన కథకాదు. వ్యుత్పత్తి సహితమైన రచన.

బొడ్డూడని పసి గుడ్డు వంటి కథకు నైలాన్ చీర, సొగలు తీర్చిన కళ్ళకాటుక, నడుం మటుకు వయ్యారం వంటి రచన, అస్థానపతితం అనిపించక పోదు.

వర్ణాంతర వివాహాలు రచయిత చేయటమే కాని, జరిగింది చిత్రించినట్లు లేదు నవల. పెద్ద వయస్సు వాళ్ళ మాటల తీరు బాగా చిత్రింపబడినట్లూ, స్వరూప స్వభావాలు ఆకళింపు చేసుకొని వర్ణించినట్లూ, పాఠకులు గమనిస్తారు

ఓపిక ఉన్నవాళ్ళు సంస్కారం కోరే ఈ రచన సరదాగా చదువుకోవచ్చు.

—మనోరాణి

## కావ్యలక్షణము

(గ్రంథకర్త: శ్రీ కిళాంబి—వేంకట వేదాంతాచార్యులు, డెమ్మీ 130 పుటలు. చిన్న అచ్చు, వెల 3 రూ. ప్రతులకు కావలసినవారు "కిళాంబి—వీరరాఘవాచార్యులు, పోస్టల్ డిపార్టుమెంటు, నిడుదవోలు" అను చిరునామాకు వ్రాయవలెను.

సాహిత్యతత్వాన్ని తెలుసుకొనుటకు, పదికాలాల పాటుండే కావ్యాన్ని రచించడానికీ కావ్య లక్షణ జ్ఞానం అవసరం. అది ఛందోవ్యాకరణాలంకారాలకు సంబంధించినది. తెలుగులో ఒక్కొక్క విషయానికీ సంబంధించిన గ్రంథాలు వేరువేరుగా ఉన్నవి. కావ్య స్వరూప పరిజ్ఞానానికి ముఖ్యంగా కావలసిన ఛందస్సును గూర్చి అలంకార శాస్త్ర విషయాలను గురించీ సులభంగానూ, సంగ్రహంగానూ తెలుసుకొనుటకు ఒక ప్రత్యేక గ్రంథం అవసరమనే దృష్టితో రచయిత దీన్ని వ్రాశారు. ఇందులో అయిదధ్యాయాలున్నవి. మొదటి, రెండూ కావ్య ప్రశంసనూ, రచననూ గూర్చినవి. మూడవ అధ్యాయంలో రసమును గూర్చి దానికి అంగములైన భావాలను గూర్చి విపులంగా ఉన్నది. చతుర్థాధ్యాయంలో యమకాదులైన శబ్దాలంకారాలూ, ఉపమాదులైన అర్థాలంకారాలూ సోదాహరణంగా వివరింపబడినవి. అయిదవ అధ్యాయం ఛందస్సును గూర్చి విపులంగా తెలుపుతూ ఉన్నది.

శ్రీ వేంకటవేదాంతాచార్యులుగారు సంస్కృతాంధ్రాలను అభ్యసించి అర్ధశతాబ్ది క్రిందటనే విద్వద్బిరుదాన్ని సంపాదించిన పండితులు. అందువల్లనే తమ గ్రంథంలో లక్షణోదాహరణాలు సంస్కృతాంధ్ర గ్రంథాలు రెండింటి నుంచీ ఇచ్చారు. ముఖ్యంగా కాళిదాసు మహాకవి కావ్యత్రయం, శాకుంతలం, వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి, భానుదత్తుని రసమంజరి, పోతన భాగవతం, కవిత్రయ భారతం, అప్పకవీయం, 'నర్సభూపాలీయం' గ్రహింపబడ్డాయి. సంస్కృతంలో ఇచ్చిన లక్షణాలకు తెలుగు వివరణ ఉన్నది కాని ఉదాహృత శ్లోకాలకు లేదు. సంస్కృత విద్యార్థులకు దీని అవసరంలేదు. తెలుగు నేర్చుకునే వారికి సంస్కృత లక్షణోదాహరణాలు అనవసరం. అందువల్ల వాటికి బదులు తెలుగు కావ్యాల్లోని ఉదాహరణాలనే ఇస్తే ఎక్కువ మేలుగా వుండేది.

అచ్చు తప్పులు చాలా అధికంగా ఉన్నవి. అందునా సంస్కృత శ్లోకాలు తప్పుల కుప్పలు. జిజ్ఞాసువులు ఆధారంగా గ్రహించే ఇట్టి లక్షణ గ్రంథాలలో తప్పులున్నప్పుడు, దాని ప్రయోజనం చాలా తగ్గిపోతుంది. ముద్రణ బాగులేదు. అచ్చు వేయించి



మొట్టమొదటి సారిగా మద్రాసువచ్చిన రాయల్ ఆస్ట్రేలియా నావికదళం ఓడలు డిస్ట్రాయర్ హెచ్. ఎం. ఎ. ఎస్. డచెస్, జలాంతర్గామి విధ్వంసకనౌక హెచ్. ఎం. ఎ. ఎస్. డెర్వెంట్. ఈ రెండు ఓడలలో కలిపి అధికారులు, ఇతరులు 570 మంది ఉన్నారు.

# పుస్తకాలు

విప్లవాదు ప్రకాశకులు తగిన శ్రద్ధ తీసికొన్నట్లు కానరాదు.

15 ఏళ్ళ క్రిందట రచయిత "విజ్ఞాపనము"తో కూడా సిద్ధపరచిఉంచిన యీ పుస్తకాన్ని ఆయన కుమార్తె ప్రకటించారు. ద్వితీయ ముద్రణలో నయినా ఏయి లోపాలు లేకుండా ఉండేటట్లు చూస్తారని ఆశిస్తున్నాను.

## శ్రీశ్రీ కవితాప్రస్థానం

రచన: శ్రీ అద్దేపల్లి రామమోహనరావు క్రౌను 12+136 పుటలు. వెల రూ. 3. ప్రకాశకులు: ప్రభాకర్ పబ్లికేషన్సు, నందిగామ—కృష్ణాజిల్లా.

ఆధునిక కవితా ప్రపంచంలో పెద్ద తిరుగుబాటును తీసుకొని వచ్చి యువ రచయితల కంఠరికీ ఆదర్శప్రాయుడైన శ్రీశ్రీని గురించి బాగా అర్థం చేసికున్నవాళ్ళూ, ఆయన కవిత్వంలోని లోతుపాతులు గ్రహించినవాళ్ళూ వేళ్ళ మీద లెక్కపెట్ట తగి ఉన్నారు. ప్రపంచంలోని ప్రతి వస్తువూ కవితా సామగ్రి కాగలదంటూ, అతి సామాన్య విషయాలను తీసుకుని హృదయం స్పందించే రీతిని ఛందః శృంఖలలతోనూ, వ్యాకరణపు పడికట్టు రాళ్ళతోనూ బంధించకుండా కవిత్వం అల్లే శక్తి శ్రీశ్రీది. ఆయనను అనుకరించి రచనలు సాగించినవారు ఎంతో మంది బయలుదేరి ఆయన స్థాయిని అందుకో లేకపోవడమే ఆయన రచనలోని వైశిష్ట్యాన్ని తెలుపుతుంది.

అభ్యుదయ కవిత్వం మీదా, ఛందోబద్ధం కాని రచన పైనీ ఎంతో మోజు వున్న వారిలోనూ ఆయననూ—ఆయన కవితనూ అర్థం చేసుకున్న వాళ్ళు చాలా తక్కువ. ఇక తక్కినవాళ్ళ సంగతి చెప్పనక్కరలేదు.

ఇట్టి స్థితిలో శ్రీశ్రీ కవితా ప్రస్థానం గురించి విమర్శ పూర్వకంగా చక్కని వ్యాసాలు రచించి కవి హృదయాన్ని శ్రీ అద్దేపల్లి రామమోహనరావు గారు మొదట "ఆంధ్రప్రభ"లో ప్రకటించి యిప్పుడు గ్రంథ రూపంగా వెలువరించారు.

ఈ చిన్నపుస్తకంలో శ్రీశ్రీ ఛందస్సు, కవిత, కథనశక్తి, ఆవేశం, కవితాసృష్టి, అలంకారికత, మానవత, ఎలజీ దేశచరిత్రలు, స్వతంత్ర మార్గ నిర్మాత— అనే విషయాల సమగ్ర పరిశీలన జరిగింది. శ్రీశ్రీ రచనలను గురించిన విభిన్నాభిప్రాయాలనూ, ఊహాపోహలనూ తొలగించడానికీ, ఆయనకున్న అత్యున్నత స్థానాన్ని గ్రహించడానికీ యిందలి వ్యాసాలు ఎంతో ఉపకరిస్తాయి. కేవలం శ్రీశ్రీ రచనలను గురించే కాకుండా అభ్యుదయ కవితా లక్షణాలూ, రీతులూ మున్నగువాటిని కూడా వీని మూలంగా తెలుసుకోవచ్చు. ఆధునిక కవితారీతులను విమర్శించే గ్రంథాలలో ఇది పేర్కొనదగిన రచన. ఎంతో పరిశ్రమించి అభ్యుదయ కవితా నిర్మాత శ్రీశ్రీ హృదయాన్ని ఆవిష్కరించిన రచయితకు ధన్యవాదాలు.

—ఆంగీరస





## అదృష్టవంతులను చెరిపేవారు లేరు,

(పిల్లల కథల సంపుటి)

రచన:— శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. చందమామ సైజు 60 పేజీలు. వెల రూ 1—50. ప్రతులకు: సరస్వతీ ప్రచురణలు, హైదరాబాదు13.

పిల్లలకి ఏ విషయం చెప్పాలన్నా గొప్ప అనుభవం ఉండాలి, తగినంత ఓరిమి కావాలి. జీవితం పండబారితేగాని ఈ రెండూ గడించలేము. ఇవి అమ్మమ్మలు, తాతయ్యల సొత్తు. కనుకనే పిల్లలు వాళ్ళ దగ్గర చేరతారు. వాళ్ళు చెప్పేది చెవి కోసుకు వింటారు. ఆ ప్రకారం నడుచుకుంటారు. ఈ సూక్ష్మాన్ని గ్రహించినవారు శ్రీ సరస్వతీదేవిగారు. ఇంతవరకు బహు ముఖాలుగా ప్రౌఢ రచనలు సాగించిన పిరిప్పుడు — అమ్మమ్మ అయిన తరవాత బాలరచనలకు పూనుకోవడం సంతోష విషయం.

ఈ సంపుటిలో కథలు ఎనిమిది. ప్రతికథా ఒక్కొక్క నీతిని బోధిస్తూ, పిల్లల మనసుకి ఇట్టే హత్తుకునే వాతావరణంతో నిండి వుంది. ఈ కథలు పిల్లల మనస్సుపై బాగా పని చేస్తాయి. జీవితంలో తప్పులు దిద్దుకుని బాగుపడదామనే కాంక్ష వారికి కలిగి తీరుతుంది.

మొదటి కథలో పిల్లికూనలు— పుట్టుకతో పుట్టిన అలవాట్లు మార్చటానికి సాధ్యం కాదంటాయి. పిన్నలకు శుష్కనీతులు బోధిస్తూ, తప్పుడు పనులు చేసే పెద్దలం కిది చక్కటి గుణపాఠం. 'రవి గన్న కల'— 'మురళి ఆడిన అబద్ధం'— 'దామోదరం చేసిన తప్పు' ఒక్కలాంటివే. వర్షాన సానం చెడ్డలోంచి మంచి పుట్టుక రావటం. ఒక మంచి పని కోసం మురళి అబద్ధం ఆడాడు, ఒక ఉపకారం చేయటానికని దామోదరం దొంగతనం చేశాడు. మనస్సులో ఉద్దేశం మంచిది కనుక ఈ చెడ్డ పనులను పెద్దలు హర్షిస్తారు. అయినా— ఈ పరిణామాలను ఎలా సమర్థించాలో వూహకు అందటం లేదు. ఆరవ కథలోలాగా విచక్షణాజ్ఞానం గల అధికారులున్ననాడు, వారు ముక్కు సూటిగా వర్తించగల శక్తి కలవారైననాడు, 'అదృష్టవంతులను చెరిపేవారు లేరు' అన్నమాట నిజమే.

'నమ్మిన మిత్రుడు', 'ఉప్పుతిన్న విశ్వాసం'— కృతజ్ఞతను నేర్పుతాయి. చిట్టచివరి 'గురుదక్షిణ' కథ చిన్నదయినా విషయం గొప్పది. మన పిల్లలందరూ శ్రీనివాసువంటి ఆదర్శ విద్యార్థులు కావాలని వాంఛిద్దాం. ఇంకా శ్రీ సరస్వతీదేవిగారి రచనలను మన పిల్లలకోసం ఎదురు చూద్దాం.

—శివకుమారి

## శ్రీ అన్నాదురై...

(4వ పేజీ తరువాయి)

పోయిదా అఘణం' (మీరు లోపలకు వెళ్ళి తీరాలి) అని దారి వదలారట. దారిలో ఆయన చెప్పులుతెగి, కాళ్ళకు గాయాలయ్యాయట. గోడల మీంచి పడ్డవారు లెక్కకు మీరారు. గోడమీంచి పడిన ఒక పౌరుణ్ణి ఫుట్‌పాత్‌మీదకు లాగేసి పోలీసులు వెళ్ళిపోతే ఓ నలుగురు పోగై దారినపోయే ఒకాయనను బతిమాలి ఆయన కారులో ఎక్కించి ఆసుపత్రికి తీసుకువెళ్ళారట.

నాలుగో తారీఖు వుదయం ఎనిమిది గంటల ప్రాంతంలో ఆయన భౌతిక దేహాన్ని వూరేగించారు. 'అయ్యో! అణ్ణా! అయ్యయ్యో అణ్ణా' అని స్త్రీలు, పురుషులు గుండెలు, తల బాదుకుని ఏడ్చారు. కొందరు స్పృహను కోల్పోయారు. ఆయన శరీరం రాజగౌరవాలతో ప్రభుత్వ లాంఛనాలతో మద్రాసు విశ్వ విద్యాలయం ఎదుట మెరీనా బీచి ఒడ్డున పాతిపెట్టారు.

—ఫాలాక్షుడు


Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# "అమూల్లోని అమూల్యమైన విటమినులు ఎందుకో చెప్పగలరా?" అన్నాది బుల్లిపాప.

"ఓ, చెప్పగలం"
అన్నాయి బుల్లి
స్నేహితులు







**అమూల్** దుగ్ధాహారము

మీ పాపకు కావలసిన 7 విటమినులు గలవు.



## ఎంత అద్భుతమైన ఫ్యాషన్!
## ఎంత ఆధునికమైనవి...ఇవన్నీ

# Wintex®

## వింటెక్స్ బట్టలు

క్రొత్త రకపు బట్టలు! ఆధునికమైన కృత్రిమమగు ఫైబర్స్ నుండి నేయబడినవి. సరిక్రొత్త స్టైల్స్! క్రొత్త ఫ్యాషనులకు సరిపోయేలా నేయబడినవి. ఎంతో మనోహరమైన డిజైనులు! ప్రతి నెలా మార్చబడుతూ ఉంటాయి... అన్నీ కన్నులకు పండుగగొలిపే రంగులవి.

వింటెక్స్ బట్టలతో తయారైన చీరలు, సల్వార్లు, కుర్తాలు, ఫ్రాకులు, బ్లౌజులు, మొదలైనవి ధరించి మీరు అందరి మెప్పునూ పొందుటలో ఆశ్చర్యమేమీ లేదు.

● మీ జీవిత భాగస్వామికి ఆధునికమైన వింటెక్స్ షర్టింగ్ మరియు సూటింగ్

**వింటెక్స్—మారుతున్న ఫ్యాషను ప్రపంచములో నేడు మరియు భావికి అనువైన బట్టలు**

ఇంకా, ఆకర్షణీయమైన జార్జెట్లు, క్రోకేట్లు, క్రేప్ సాదావి మరియు ప్రింటు చీరలు, ఫ్రాక్, బ్లౌజులకు తగిన బట్టలు లభిస్తున్నాయి. ఇవన్నీ నాణ్యమైన కృత్రిమమైన ఫైబర్స్‌నుండి నేయబడుతున్నాయి.

**వింటెక్స్ మిల్స్** వింటెక్స్ రోడ్, సూరత్.

ఏజెంట్ : మెసర్స్ గోయల్ ట్రేడర్స్ 24/48, గోడౌన్ స్ట్రీట్, మద్రాసు-1.

'erest/296b/WM